The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

వెల : రూ. 10

16-31 జనవరి 2003

పేజీలు : 68 + 8





అంతర్వేది శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దివ్య ఆశీస్సులతో..
సూపర్‌హిట్ ఫ్రెండ్స్
ప్రేమలో.... పావని కళ్యాణ్
..... Love is different
బి.ఎ.రాజు బి.జయ పోలూర్‌ఘటికాచలం
పి.విజయ్‌వర్మ · ఘంటాడికృష్ణ · జవహర్‌రెడ్డి · కృష్ణ · వెంకటేష్ · రాంబాబువర్మ
వరల్డ్‌కప్ విజేత మీరే
ప్రేమలో పావని కళ్యాణ్ ప్రేక్షకులకు
WORLD CUP 2003 South Africa
సూపర్‌హిట్ ఫ్రెండ్స్ అందిస్తున్న లక్కీఛాన్స్!
సౌత్ఆఫ్రికా వరల్డ్ కప్ క్రికెట్ మ్యాచ్
ప్రత్యక్షంగా చూసే అవకాశం

హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

32

# హాస్యం - సంగీతం



కవర్ పేజీ ఫోటో కర్టెసీ: తాతాజీ















'సెంటర్ స్ప్రెడ్'లో - 'సందడే సందడి', 'ఈ అబ్బాయి చాలా మంచోడు' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: చిరంజీవి, పవన్‌కళ్యాణ్

> మీరు ప్రచురిస్తున్న 'ఇద్దరు మిత్రులు' స్క్రిప్టు చదువుతున్నాను. చిత్రం చూస్తున్న తృప్తి కలుగుతోంది.ఆ చిత్రానికి నేను సహాయ దర్శకునిగా పని చేసాను. ఆనాటి నా అనుభవాలు పంపుతున్నాను.
>
> కె.వి.రావు (స్వామి చిత్రానంద)

మీ పత్రిక చాలా బాగుంది. అందరినీ అలరిస్తున్నది. ఈసారి ప్రచురించిన సూర్యకాంతం, మాధవపెద్ది సత్యం గార్ల గురించిన వ్యాసాలు చాలా బాగున్నాయి. మళ్లీ మళ్లీ చదివి ఆనందిస్తున్న మేము మిమ్మల్ని అభినందించకుండా ఉండలేం.

తనికెళ్ల భరణిగారి వ్యాసాలు చాలా బాగున్నాయి. ఎందరో మరుగుపడిన మహనీయుల జీవిత విశేషాలను, వారి ప్రతిభ గురించీ తెలుపుతూ అందిస్తున్న వ్యాసాలు అందరికీ ఉపయోగపడతాయి.

**-మంత్రిప్రగడ శేషాబాయి, సికింద్రాబాదు.**

గతకాలపు తెలుగు సినిమా కళా, సంగీత వైభవాన్ని పునశ్చరణ చేస్తూ మీరు ఓ పత్రికను నిర్వహిస్తున్నందుకు అభినందనలు తెలియజేస్తున్నాను. నేటి కళ, సంగీతాలను మీ ప్రయత్నం ఏ మాత్రమైనా సంస్కరించి మార్పు చేయగలిగితే, మీ ప్రయత్నం ఫలించినట్లే అవుతుంది. ఆ తరం నటీనటులు, దర్శకులు, రచయితల చేత ఆనాటి విశేషాలను చెప్పించటం చాలా ఉపయోగకరంగానూ, ప్రయోజనకరంగానూఉంది.

**ఎం.సత్యనారాయణ, తణుకు**

నిన్న వచ్చివెళ్ళిపోయిన మంచి అతిథిలా మళ్ళీ కనిపించని 'విజయచిత్ర' లేని లోటు 'హాసం' పత్రిక తీరుస్తోంది. పత్రిక స్టాండర్డ్ రక్షిస్తూ ఉండండి.

**డా॥ తాతిరాజు వేణుగోపాల్, పుణే**

16-13 డిసెంబర్ సంచికలో సూర్యకాంతం గురించి ప్రచురించిన వ్యాసం చదివాక ఆనందం, బాధ రెండూ ఒకేసారి కలిగాయి. ఆమె ఒక మహానటి మాత్రమే కాదు. ఒక మహోన్నత వ్యక్తి కూడా. నా చిన్నతనంలో ఒకసారి ఆమెను విజయవాడలో కలిసాను. మాటల సందర్భంలో మీ పేరు 'సూర్యకాంతం' అని ఎందుకు పెట్టారు అని ఎవరో అడిగితే దానికామె - నేను దీపావళి అమావాస్య నాడు పుట్టాను. అమావాస్య కాంతిహీనం గనుక మా వాళ్ళు నాపేరు 'సూర్యకాంతం' అని పెట్టారు. ఐతే అది దీపావళి మహత్యం వలన కాబోలు 'సూరేకారం' అయ్యింది. అని చమత్కారంగా జవాబు చెప్పారు. మనదేశానికి మీరు ఏం సేవ చేయాలనుకుంటున్నారు అని ఎవరో అభిమాని అడిగితే దేశానికి సేవ చేసే మహానుభావులకి అడ్డుతగలకుండా ఉండటమే నేను చేసే దేశసేవ అని నవ్వుతూ చమత్కారంగా జవాబు చెప్పారు. అలాంటి వ్యక్తి గురించిన సమాచారం తెలియజేసినందుకు చాలా ధన్యవాదాలు. అలాగే ఈ సంచికలో అలనాటి మేటి ఆమని 'ఈమని' గూర్చి ప్రచురించిన వ్యాసం ఎంతో ఆసక్తితో కూడుకొని వున్నది.

**-ముని శ్రీలత.టి.విజయవాడ**

సంగీత - హాస్యప్రియుల కొరకు మీరు చేస్తున్న సేవ సదా ప్రసంశనీయం. ఈ పత్రిక మొదటిసారి నేను 25-12-02న చూసి కొని 2 రోజుల్లో




ఆమూలాగ్రం చదివాను. పరవశించాను. కార్టూన్లు, భరణిగారి కాలమ్, పద్మనాభంగారి జ్ఞాపకాలు, మల్లాది సీరియల్, లలిత గీతములను 'నొటేషన్'తో సహా ఇవ్వడం, ముఖ్యంగా పాతపాట లకు పెద్దపీటవేస్తూ హిందీలో ఆణిముత్యాలను మీరు ఎన్నుకున్న విధానం ఎంతో సముచితంగా ఉంది. పాత చిత్రాల్లోని పాటలను నొటేషన్‌తో సహా ఒక కాలమ్‌లో ఇస్తే ఔత్సాహిక కళాకారులకు అది ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. సంగీతం నేర్చుకునేవారి సంఖ్య పెరుగుతుంది.మీ పత్రిక దినదిన ప్రవర్ధమా నమవుతూ 'సంచలనాన్ని' సృష్టించాలని ఇంతమంచి 'సేవ' చేస్తున్న మీకు పత్రికాముఖంగా అభినందనలు తెలియచేసుకుంటూ...

**బలుసు రామకృష్ణారావు**
**కన్నాపురం ప॥గో॥జిల్లా**

(లలిత సంగీతంలో చిత్తరంజన్‌గారు ఉదహరించే పాటకు తప్ప మరే పాటకు నొటేషన్‌ను ఇవ్వడం సాధ్యపడదు. **- ఎడిటర్)**

కొత్త సంవత్సరం 'హాసం' తొలి సంచిక నన్ను ఎంతగా ఆకట్టుకుందో చెప్పటానికి మాటలు రావటం లేదు. ఒక విధంగా చెప్పాలంటే ఎమోషనల్‌గా ఫీలయ్యాను. ఆర్.డి.బర్మన్ వర్ధంతి సందర్భంగా గాయకుడిగా తానేమిటో చాలా చక్కగా శ్రీ రామారావుగారు వివరించారు. 'అర్థం చేసుకుందాం...'లో ఆర్.డి.స్వరపరచిన నాకెంతో ఇష్టమైన పాట వెయ్యడం అమితానందాన్ని కలిగించింది. ఆంధ్రా ఆర్.డి.గా పేరు తెచ్చుకున్న సత్యం కూడ జనవరిలోనే మరణించడం యాదృచ్ఛికం. సత్యం స్వరకల్పన చేసిన ఎన్నో పాటలు ట్యూన్స్, ఆర్కెస్ట్రా, రిథం పరంగా ఆర్.డి.బర్మన్ బాణీలకు దగ్గరగా వుండేవి. 70,80 దశకాలలో సత్యంతో పాటు అనేక మంది సంగీత దర్శకులకి ఆర్.డి. మ్యూజిక్ ఇన్స్పిరేషన్ అయింది. 'దిల్ విల్ ప్యార్ వ్యార్' ఆడియో సేల్స్ ఆర్.డి. బర్మన్ ఎంత గొప్ప సంగీత దర్శకుడో చెబుతున్నాయి. ఇక సువర్ణ సుందరి పాటల విశ్లేషణ సూపర్బ్‌గా వుంది. నాకెంతో ఇష్టమైన సినిమా ఇద్దరు మిత్రులు సీరియల్, నా ఫేవరేట్ సింగర్ కిషోర్ జీవన ఝరి, కమేడియన్ పద్మనాభం ఆత్మకథ సీరియల్స్‌గా అందిస్తున్నందుకు థాంక్స్. ఈ సంచికలోనే మీరు అందించిన రెండు నిక్షిప్త చిత్రాలు మాకు అపురూపం, అమూల్యం, నాకు ఇష్టమైన ఇన్ని విశేషాలతో వచ్చిన ఈ 'హాసం' నాకు ప్రియం, ప్రాణం.

**- జి.ఎల్.ఎస్.స్వామి, విజయనగరం**

ఈ రోజుల్లో సకుటుంబంగా చదవదగిన పత్రిక ఏదైనా ఉందీ అంటే అదే మీ 'హాసం'. ఇపుడు అది మా (మన) పత్రికగా మారింది. 1-15 జనవరి సంచికలో "అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం" శీర్షికలో మీరు ప్రచురించిన నా అభిమాన హిందీ గీతం నన్నెంతగానో అలరించింది. ఇటువంటి మంచి పాటలు మరిన్ని మన పత్రికలో ప్రచురించగలరు. ఇదే సంచికలో మీరు ప్రచురించిన 'సత్యం హిట్స్' మమల్ని ఎంతగానో మంత్రముగ్ధులను చేసాయి. తనికెళ్లభరణిగారి వ్యాపాలు సింప్లీ సూపర్బ్. అదేవిధంగా బాలుగారిచే ఒక మంచి శీర్షికను (పద సంపదతో పాటు) ప్రచురించవలసిందిగా కోరుతున్నాం. హాసం నిక్షిప్త చిత్రాలు పత్రికకే వన్నె తెచ్చాయి. 'హాసం' ఇలాగే కలకాలం కొనసాగాలని కోరుతూ...

**-నారాయణరావుమరియు సంగీతాభిమానులు,**
**శ్రీకాకుళం.**

'దక్షిణాది ఆర్.డి.బర్మన్' సత్యం గారి గురించి నాకు తెలియని విషయాలు తెలుసుకోగలిగాను. 'సరిగమలు-గలగలలు' మాధవపెద్ది సురేష్‌గారి వ్యాసంలో హాస్య దర్శకుడు జంధ్యాలగారి విషయాలు బాగున్నాయి. 'బాపు విశ్వరూపం'లో సంక్రాంతి విశిష్టతను తెలియజేసే గ్రీటింగ్ కార్డులు నా హృదిని మైమర పించినవి. కాని 'కలర్'లో ఇస్తే బాగుండేవి. ఎడిటర్‌గారికి ఈ బొమ్మలు ప్రచురించినందుకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మాలాంటి నవతరం వాళ్లకి, అందులోను బాపుగారి బొమ్మలను ప్రచురించినందుకు చాలా ప్రయోజనకరంగా ఉంది. సువర్ణ సుందరి విశేషాలు సువర్ణాక్షరాలతో లిఖితంగా ఉన్నాయి.

**విజయరాఘవన్.కె, వరంగల్**

కిశోర్‌కుమార్ కథ చదువుతుంటేనే చాలా బాధ కలుగుతుంటే 'ఓ వీనస్.........' కథ మరీ కంటతడి పెట్టించింది. పేరు 'మధు'రమైనదైనా 'బాల' వయసులోనే జీవితాన్ని చాలించడం హృదయ విదారకం.

'పత్రిక' సకాలంలో పోస్ట్‌లో మాకు అందజేస్తున్నందుకు కృతజ్ఞులము.

'హాసం క్లబ్' పెట్టాలని యోచన. పశ్చిమగోదావరి జిల్లాలో పాఠకులకు విజ్ఞప్తి - ఫోన్ చేస్తే (నా ఫోన్ నెం.254138) మనమందరం కలిసి క్లబ్ పెట్టగలం.

**-ఎస్.లక్ష్మీగోపాలం**

ముళ్ళపూడి వెంకట రమణగారి రచన "బాపు నుంచి బాపు దాక"- చదివాను. బాపు గీతార్థసారాన్ని ముళ్ళపూడి మాటల్లో (రాతలు కాదు. ఎందుకంటే ఆయన రచన ప్రత్యక్షంగా మనతో ముచ్చటిస్తున్నట్టుంటుంది) ప్రతి తెలుగువాడు చదివి ఆనందించవలసిందే. ఇది నిజంగా బాపు విశ్వరూపమే. ఘంటసాల పాటకు, ముళ్ళపూడి మాటకు, బాపు గీతకు- వార్ధక్యం లేదు-రాదు. 'బాపు' కొండంత ప్రతిభను 'హాసం' అద్దంలో చూపెడుతున్న సంపాదక వర్గానికి ధన్యవాదాలు.

**- పెండ్యాల సుబ్బారావు, కాకినాడ.**

సంపుటి : 2 సంచిక: 8

16-31 జనవరి 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

32

తెలుగు వారిది విశాల దృక్పథం. ఇతర భాషా సాహిత్యాన్ని మన భాషలో అనువదించుకుని ఆనందిస్తాం; ఇతర ప్రాంతాల వారి సంగీతాన్ని ఆస్వాదిస్తాం, ఆయా కళాకారుల గురించి తెలుసుకునే ప్రయత్నం చేస్తాం. అందుకే 'హాసం'లో అనేక రాష్ట్రాల వారి గురించిన ముచ్చట్లు కనబడతాయి.మరి వారి పత్రికలలో మన ప్రసిద్ధ వ్యక్తుల గురించిన విశేషాలు కనబడతాయా? అని ప్రశ్నించుకుంటే సమాధానం నిరుత్సాహం కలిగిస్తుంది.

వారు కూడా మన గురించి తలచుకునేలా, ముచ్చటించేలా చేయాలంటే మనందరం కృషి చేయాలి. మనవారి గురించి అంతర్జాతీయ స్థాయిలో కాకపోయినా కనీసం జాతీయస్థాయిలోనైనా ప్రచారం జరగాలి. పార్లమెంటులో ఆంధ్రకేసరి పటం ఎంత ఆలస్యంగా పెట్టారో గుర్తు చేసుకుంటే చాలు, మనం ఈ విషయంలో ఎంత వెనుకబడి వున్నామో తెలుస్తుంది. గోవింద వల్లభ్ పంత్ గురించి మన ప్రైమరీ క్లాసు పాఠ్యపుస్తకాలలో ఉంటుంది. కానీ ఆంధ్రకేసరి గురించి, పట్టాభి సీతారామయ్య గురించి ఉత్తరభారతంలోని పాఠ్యపుస్తకాలలో ఉండదు. తెలుగువాళ్లు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారని చెప్తే ఉత్తరాది వారు ఆశ్చర్యంగా చూడడానికి కారణం ఇదే!

మన నాయకుల గురించే కాదు, కళాకారుల గురించి ప్రచారం సరిగా జరగదు. త్యాగరాజస్వామి మాతృభాష తమిళం అని అనేక జనరల్ నాలెడ్జి పుస్తకాలలో కనబడుతుంది. అంతెందుకు వచ్చేనెలలో ఘంటసాల పై స్టాంపు వెలువడబోతోంది కదా, ఆయన గురించి జాతీయ పత్రికలలో వ్యాసాలు వెలువడుతున్నాయనుకుంటున్నారా? ఆయన ఘనత ఎంతమంది తెలుగేతరులకు తెలుస్తుందనుకుంటున్నారు? ఘంటసాల గురించి తెలుగుపత్రికలలో, తెలుగునాట వెలువడే ఆంగ్ల పత్రికలలో మాత్రమే కనబడుతుంది. తక్కిన వారు- ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ వాళ్లు ఇచ్చే పదిలైన్ల సమాచారాన్ని ప్రచురించి చేతులు దులుపుకుంటారు.

ఈ పరిస్థితి మారాలంటే సంగీతాభిమానులు, పాత్రికేయులు పూనుకోవాలి. హిందీ, ఇంగ్లీషు భాషలలో వ్యాసాలు వ్రాయగల తెలుగువారు ఘంటసాల ప్రతిభ గురించి జాతీయ దినపత్రికలైన టైమ్స్ ఆఫ్ ఇండియా, హిందూస్తాన్ టైమ్స్, స్టేట్స్‌మన్..వంటి పత్రికలకు ఇప్పటినుండీ వ్యాసాలు వ్రాసి పంపాలి. ఆంధ్ర రాష్ట్రం వెలుపల ఉన్న ప్రవాసాంధ్రులు స్థానిక భాషలో నైపుణ్యం సాధించివుంటే తామే స్వయంగా వ్రాయవచ్చును. లేదా అక్కడి జర్నలిస్టులకు ఘంటసాల పాటలు వినిపించి, ఆయన గురించి వివరించి వారిచేత ఆయా భాషా పత్రికలకు వ్రాయించవచ్చు. ఆ వ్యాసాలు చదివిన సంపాదకులకు ఘంటసాల గురించి అవగాహన ఏర్పడి, ఆయనపై గౌరవం కలిగి స్టాంపు రిలీజయ్యే సమయానికి ఆ వ్యాసాలు ప్రచురించడం జరుగుతుంది. తద్వారాఘంటసాలకు ఎందుకింత గౌరవం దక్కిందో ఆంధ్రేతరులకు కూడా తెలుస్తుంది. ఈ పాటి కృషి కూడా మనవైపు నుండి జరుగకుండా మన కళాకారులకు జాతీయస్థాయిలో గుర్తింపు లభించటం లేదని ఫిర్యాదు చేయడం వ్యర్థం! ఘంటసాలంటే అభిమానం మాకు ఉందని గొప్పలు చెప్పుకుని ఊరుకోకుండా, ఈ కార్యాచరణకు పూని సత్ఫలితాన్ని సాధించమని ఘంటసాల అభిమానులకు 'హాసం' విజ్ఞప్తి చేస్తున్నది.

# నథింగ్ టు వర్రీ

- సూరేపల్లి విజయ



యమ టెన్షన్‌గా వుంది శలభారావుకు. మధ్యాహ్నం అత్తారింటికి ట్రెయిన్‌లో బయల్దేరాలి. రాత్రి తొమ్మిదింటిలోగా చేరుకుంటాడు. తన కోసం తన బావమరిది స్టేషన్‌లో ఎదరు చూస్తూ వుంటాడు. తెల్లవారే... బావ మరిదికి పెళ్ళిచూపులు. ఎటువంటి పరిస్థితిలోనూ మధ్యాహ్నం ట్రెయిన్‌కి బయల్దేరి రావల్సిందని భార్య అల్టిమేటమ్.

ఇప్పుడు తను ఆ పెళ్ళిచూపుల కార్యక్రమానికి అటెండవ్వకపోతే, పుట్టింట్లో వున్న తన బెటరాఫ్ తన దగ్గరికి వస్తుందని భరోసా లేదు. పైపెచ్చు మీరు మా తమ్ముడి పెళ్ళిచూపుల ప్రోగ్రామ్‌కు రాకపోతే, వరుసగా డైలీ టీవి సీరియల్స్ చూసి చచ్చిపోతానని వార్నింగిచ్చింది.

'పోనీ,' వెళ్తే...టేబుల్ మీద ఉన్న అదేదో వీక్లీ కవ్వించింది. రాశిఫలాలు చూడమంది. చూసినదాకా ఉండి వెళ్ళద్దని దానిలో రాసివుంటే...? అంతే, ఆ థాట్ రావడంతోనే శలభారావ్ గుండె గుభేలుమంది. రాశిఫలాల కొవ్వొత్తి శలభాన్ని ఆకర్షింపచేసింది. టేబుల్ మీద వున్న అదేదో వీక్లీ చేతిలోకి తీసుకున్నాడు. కళ్ళు మిటకరిస్తూ ఒక్కో పేజీ తిప్పి... సరిగ్గా అక్కడ ఆగిపోయాడు. గ్రహఫలాలు చెప్పే ఫీచర్ అది.

మకర రాశి దగ్గరికి వెళ్ళి ఆగాడు. ఒకటికి రెండుసార్లు చదివాడు. పలుకుబడి కలిగిన వ్యక్తుల ద్వారా కొన్ని పనులు సాధిస్తారు. ఆర్థిక పరిస్థితులు ఆశాజనకంగా వుంటాయి. దూర ప్రయాణాల విషయంలో జాగ్రత్త వహించాలి.... ఆ తర్వాత మరి, ఏమీ చదవలేకపోయాడు.

అంటే తాను ఇప్పుడు జాగ్రత్త వహించాలి. తను తొందరపడి వెళ్తే హమ్మో... గుండెలు బాదుకున్నాడు శలభారావు.

ఇక్కడ శలభారావు గురించి కొద్దిగా కాదు, చాలానే చెప్పుకోవాలి. అతనికి రాశిఫలాలు అంటే విపరీతమైన నమ్మకం. రోజూ తన రాశిఫలాలు చూసిగానీ బయల్దేరడు. ప్రతీవారం అదేదో పత్రికలో వచ్చే గ్రహఫలాలు, యిదేదో పత్రికలో వచ్చే జ్యోతిష సమాధానాలు చదవకుండా విడిచిపెట్టడు. చదవడమే కాదు... తు..చ... తప్పకుండా పాటించడం శలభారావు చాదస్తం.

అతని చాదస్తం పరాకాష్ట గురించి చిన్న ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్ళిపోవాల్సిందే. అది శలభారావ్‌కు కొత్తగా పెళ్ళయిన రోజులు. ఆ వారం గ్రహఫలాల్లో ఈ వారం శ్రీమతితో గొడవలు... అని వుంది. అంతే ఆ గొడవలు ఎవాయిడ్ చేయాలని భార్య దగ్గరకి వెళ్ళడమే మానుకున్నాడు. అట్టి విధంబెట్టిదనిన...

వారం రోజుల తర్వాత మొగుడి మోకాలి మీద ఒక్కటిచ్చింది మిసెస్ శలభారావ్.

'అదేంటి... నేను నిన్నేమన్నానని యిలా కొట్టావ్. నేనప్పుడే అనుకున్నాను. ఈ వారం శ్రీమతితో గొడవలు... అని రాసున్నపుడే'... ఉక్రోషంగా అన్నాడు మిస్టర్ శలభారావ్.

"మీ మెదడు చితగ్గొడతున్నా" అంది ముక్కు ఎగబీలుస్తూ మిసెస్ శలభారావ్.

"నా మోకాలి మీద కొడితే నా మెదడెలా

పగుల్తుంది" చంకలు గుద్దుకుంటూ అడిగాడు ఓ వెర్రి నవ్వు నవ్వి శలభారావ్.

"ఎందుకు పగల్దు... మీ మెదడుంది అక్కడేగా" తన్నీ చంకలు గుద్దుకొని అంది మిసెస్ శలభారావ్.

"అంటే నీ వుద్దేశమేంటి?"

"అది అడగాల్సింది నేను... వారం రోజుల్నుంచి చూస్తున్నాను... మీరు నాకు దూరంగా వెళ్ళి పడుకోవడంలో మీ వుద్దేశం ఏమిటి? ఉప్పుకారం శుభ్రంగా తింటూ కూడా" అంది మిసెస్ శలభారావ్.

"హవ్వవ్వవ్వ... అవేం మాటలే... అసలు విషయం ఏమిటంటే అదేదో పత్రికలో ఈ వారం నా గ్రహఫలం బాగాలేదు. శ్రీమతితో గొడవలు... అని వుంది. అందుకే... ఎందుకైనా మంచిదని యిలా" దూరంగా సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ చెప్పాడు శలభారావ్.

మరోసారి ఫటామని మోకాలి మీదొక్కటిచ్చి అదేదో పత్రికను ముక్కలు ముక్కలుగా చించింది. మిక్సీలో గ్రైండ్ చేసినట్టు చేసి, బయటకు గిరాటేసింది.

'మీకిదేం పిచ్చి... గ్రహఫలాలు చదివితే చదివారు గానీ ఇలా చేస్తే నేను వూర్కోనంతే..." అంది సీరియస్ లుక్కేసి మిసెస్ శలభారావ్.

ఆ తర్వాత తెల్లవార్లూ వాళ్ళిద్దరి మధ్య వార్ జరుగుతూనే వుంది. సదరు శలభారావు మాత్రం యిదంతా తన గ్రహఫలంలో రాసిన రిజల్టేనని బ్లైండ్‌గా నమ్ముతూనే వున్నాడు.

* * *

ఇలాంటి ఎగ్జాంపుల్స్ బోల్డు వున్నాయి. రాశిఫలాల్లో ఈ రోజు లావాదేవీలు మంచివికావు... అని వుంటే, ఛస్తే లావాదేవీలు చేసేవాడు కాదు.

ఆఫీసులో అశాంతి... అని రాసి వుంటే, ఆఫీసు ఎగ్గొట్టేవాడు. అలా ఆఫీసు ఎగ్గొట్టే సమయంలో ఇన్‌స్పెక్షన్ వున్నా ఆఫీసుకు రానందుకు 'మెమో'లు అందుకున్న యిన్సిడెంట్స్ కూడా బోల్డు వున్నాయి.

అయినా, శలభారావ్ తన పిచ్చి నమ్మకాన్ని మానుకోలేదు. అలాంటి శలభారావుకు ఇప్పుడీ సమస్య వచ్చి పడింది.

ఏదేమైనా సరే. తను దూర ప్రయాణం చేయకూడదని డిసైడైపోయాడు. సరిగ్గా అతని కథ అక్కడే టర్న్ అయింది.

* * *

సదరు శలభారావు బావమరిది బావగారి కోసం స్టేషన్‌లో వెయిట్ చేసాడు. ట్రెయినొచ్చింది, వెళ్ళింది. రావల్సిన బావ మాత్రం రాలేదు. పోనీలే నెక్స్ట్ ట్రెయిన్‌కు వస్తాడేమోనని చూసాడు. ఆ ట్రెయిన్ వచ్చెళ్ళిపోయింది.

అలా తెల్లవార్లు అన్ని ట్రెయిన్లు చూసి, ఇక రాడని తెలుసుకుని నిద్రమత్తుతో స్కూటర్ మీద బయల్దేరాడు. రాత్రంతా స్టేషన్‌లో కళ్ళు పత్తికాయల్లా చేసి, మిడిగుడ్లేసుకుని బావ కోసం ఎదుర్చూడడం వల్ల, కళ్ళు మూతలు పడి ఎదురుగా వచ్చే లారీని చూడ్లేదు.

దాని తాలుకు రిజల్ట్ సెకన్స్‌లో తెల్సింది. కాకపోతే అదృష్టం ప్లస్సయి లారీ జస్ట్‌లో మిస్సయి స్కూటర్ రోడ్డు పక్కన వున్న ఓ చెట్టుకు గుద్దేశాడు. దట్సాల్.

* * *

పెళ్ళి చూపులకు బయల్దేరాల్సిన పెళ్ళికొడుకు పుత్తూరుకు కట్లు కట్టించుకోవడానికి వెళ్ళాల్సి వచ్చింది. పెళ్ళి చూపుల్లో కాలుఫ్యాక్చర్ అయిన పెళ్ళికొడుకుని చూడలేనని పెళ్ళికూతురు తెగేసి చెప్పేసరికి ఆ సంబంధం క్యాన్సిలైంది.

దానికంతటికీ కారణమైన తన మొగుడి మీద పీకల్దాక కోపం వచ్చింది మిసెస్ శలభారావుకు.

వెంటనే ఫోన్లోనే క్లాసు పీకాలని డిసైడైంది.

* * *

"హలో... నేనేనండీ... మీరెందుకు రాలేదు" కోపాన్ని గొంతులో బిగపట్టి అడిగింది మిసెస్ శలభారావు.

అది ఆఫీసు అని కూడా చూడకుండా సిగ్గుతో మెలికలు తిరిగిపోయి "ఈ వారం దూర ప్రయాణాలు మంచివి కాదని వుంది. నువ్వెళ్ళాక ఆ పత్రిక మార్కెట్‌లోకి వచ్చింది. అందుకని..."

అటువైపు వున్న మిసెస్ శలభారావుకు కోపం పెరిగిపోయింది. ఎదురుగా వుంటే నాలుగు వడ్డించాలనీ వుంది.

"ఛీ... ఛీ... మీ వల్ల మా తమ్ముడికి కాలు ఫ్రాక్చరైంది. సంబంధమూ క్యాన్సిలైంది. మీ రాశి ఫలాల పిచ్చి బిన్ లాడెన్ ఎత్తుకెళ్ళ" అంటూ తిట్టిపోసింది.

"అయ్యో అంత పని జరిగిందా? అయినా మీ తమ్ముడ్ని కూడా రాశిఫలం చూసి స్టేషన్‌కు బయల్దేరమని చెప్పాల్సింది" అన్నాడు ఉచిత సలహా ఒకటి చేరుస్తూ....

* * *

"అన్నయ్యా ఈ మొగుడు నాకొద్దు! హమ్మో... హమ్మో... మెంటలెక్కి పోతోంది. సినిమాకు వెళ్ళాలన్నా తన రాశిఫలాలు చూసుకుంటాడు. పొరపాటున ఆప్తమిత్రులతో విరోధం అని వుంటే, ఇంక ఆరోజు ఎంత క్లోజ్ ఫ్రెండ్స్ వచ్చినా ముంగిలా వుంటాడే తప్ప, నోరు విప్పడు". అంటూ భర్త నిర్వాకాలని ఏకరువు పెట్టి వాపోయింది మిసెస్ శలభారావు గోపాలంతో.

సదరు గోపాలం మిసెస్ శలభారావుకు అన్న వరుసవుతాడు. గోపాలం శలభారావు ఫ్రెండ్ కూడా!

"డోంట్ వర్రీ చెల్లెమ్మా... వాడి పిచ్చి నేను కుదురుస్తానుగా" అంటూ అభయహస్తమిచ్చాడు గోపాలం.

* * *

"ఒరే శలభా... యిదేం బాగాలేదురా" సాయంత్రం శలభారావుని టాంక్‌బండ్‌కు బలవంతంగా లాక్కొచ్చి అన్నాడు గోపాలం.

"ఏది... ఈ టాంక్‌బండా? అవును గోపాలం నా చిన్నప్పట్నుంచీ చూస్తున్నాను. ఈ కంపు తప్ప అన్నీ మారాయి. ఈకంపు ఎప్పుడు పోతుందో" అన్నాడు ముక్కు మూసుకుంటూ...

"ఏంటీ కామెడీనా?"కోపంగా అన్నాడు



గోపాలం.

"అదేమిట్రా... మనుక్కున అంత మాటనేసావ్" శలభారావు అమాయకంగా అడిగాడు.

"నువ్వు పిచ్చిగా రాశిఫలాలు చదవడం... వాటిని ఫాలో అవుతూ యిబ్బందులు కొని తెచ్చుకోవడం"

"అదా మీ సిస్టర్ గోకిందా... నాకు తెలియదురా... రాశిఫలాల్లో వున్నది మాత్రం ఖచ్చితంగా జరుగుతుంది" శలభారావు చెప్పాడు.

"ఏంట్రా జరిగేది... ఏదో అలా చదివి పాజిటివ్‌ను చదివి, నెగిటివ్‌ను ఇలా వదిలేయాలి గానీ, వాళ్ళేదో రాసారని..."

"అంత మాటనకురా" అన్నాడు శలభారావు. గోపాలానికి విషయం అర్థమైంది. వెంటనే రంగంలోకి దిగాడు.

'అదేదో' పత్రికలో రాశిఫలాలు, 'యిదేదో' పత్రికలో వాటికి సంబంధించిన జవాబులు ఇచ్చేది ఒకప్పటి తన ఫ్రెండ్ ముక్కంటేనని తెలుసుకున్నాడు. ముక్కంటి మందు ప్రియుడని తెలుసు.

ఆపరేషన్ 'నథింగ్ టు వర్రీ' మొదలైంది.

* * *

ఆ బార్‌లో ఓ కార్నర్ టేబుల్ ముందు కూచున్నారు గోపాలం, శలభారావు.

'ఒరే... శలభా... నువ్వు ఆ పక్క టేబుల్ దగ్గర కూచో... ఓ గెస్ట్ వస్తాడు. మా మాటలు విను మధ్యలో ఇంటర్‌ఫియరవొద్దు" స్ట్రిక్ట్‌గా ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చాడు.

మరో అయిదు నిమిషాల్లో ముక్కంటి వచ్చాడు. శలభారావు పక్క టేబుల్ దగ్గర కూచొని, గోపాలం చెప్పినట్టు వాళ్ళని అబ్జర్వ్ చేస్తున్నాడు.

* * *

మొదటి రౌండ్ పూర్తయింది.

"అంటే బాగానే డెవలప్ అయ్యావన్నమాట" గోపాలం అడిగాడు.

"ఏదో లే ఫ్రెండూ... రాశిఫలాలు రాస్తే ఏదో కొద్దిపాటి డబ్బు, యిక రాశిఫలాలకు సంబంధించిన జవాబులంటావా... వాటిలో బాగానే గిట్టుబాటు అవుతుంది"

"అవున్రోయ్... అసలు నీకు ఏ నక్షత్రాలకు, ఏ రాశి వస్తుందో కూడా తెలియదు. నువ్వెలా రాశిఫలాలు రాస్తున్నావ్రా"

"పిచ్చి గోపాలం కుంజా"

"అదేమిట్రా.. అంత మాటన్నావ్"

"అది నా ఊతపదంలే... నాలుగు పత్రికలు తిరిగేస్తే అదే వచ్చేస్తుంది"

"మరి ప్రతి వారం వాళ్ళు రాశిఫలాలు ఎలా కరెక్ట్‌గా రాస్తావ్?"

ఫక్కున నవ్వాడు ముక్కంటి.

"నాకు తెలిస్తే కదరా కుంజే, నేను చెప్పడానికి, ఏదో ఒకటి రాస్తాను. ఈ వారం ఆరోగ్యం బాగుండదు అని రాస్తే, వచ్చేవారం బావుంటుందని రాస్తాను. ఈ వారం ధనలాభం అని రాస్తే వచ్చే వారం వ్యాపారంలో నష్టం అని రాస్తాను"

"ప్రతీవారం ఎలా రాస్తావురా"

"ఆ రాశిది, ఈ రాశికి, అటు ఇటు మార్చి రాస్తా... బోర్ కొడితే ఏదో ఒకటి వూహించి రాస్తా"

"మరి ప్రజలెలా నమ్ముతార్రా"

"ఎలా ఏమిట్రా... రాసింది జరిగితే రాశిఫలం ప్రభావం అనుకుంటారు. రాసింది జరగలేదనుకో ఖర్మనుకుంటారు... లేదా... మరచిపోతారు... వచ్చేవారం మళ్ళీ చూస్తారు"

"ఎన్ని టాలెంట్లున్నాయిరా నీలో... అవున్రా... మొన్న యిదేదో పత్రికలో నా పెళ్ళెప్పుడు? అని ఓ పాఠకుడు రాస్తే 2009లో పెళ్ళి, 2010లో పుత్రయోగం 2015లో ఉద్యోగం, 2025లో విదేశ ప్రయాణం, 2040లో అనారోగ్యం అని సమాధానమిచ్చాను.... అంత కాలిక్యులేటెడ్‌గా ఎలా చెబుతావ్‌రా"

ఫక్కున నవ్వాడు ముక్కంటి.

"అలా రాస్తే తప్పు, రాసే నాకు, చదివే పాఠకులకు తెల్లుండదు... యింతకీ నీకా డౌట్ ఎందుకు వచ్చిందిరా" అడిగాడు ముక్కంటి మూడో రౌండ్‌లో

"ఆ ప్రశ్న పంపింది నేనే, మా నాన్న జన్మ నక్షత్రం పంపించా... ఆయన పోయి పదేళ్ళయింది. అసలు నీది నువ్వు కరక్టుగా రాసుకోగలవా? ఈ వారం ఇలా మందు యోగం ఉందని రాసుకున్నావా?" అడిగాడు గోపాలం.

మందు గొంతులో నుంచి ముక్కులోకి జారిపోతున్న ఫీలింగ్ కలిగింది ముక్కంటికి.

'సారీరా ఫ్రెండ్... అయినా ఏదో బుద్ధి తక్కువై అలా రాసాను... మరేమీ అనుకోకు... ఆ రెండు పత్రికల్లో రాసి, నాలుగు డబ్బులు వెనకేసుకుంటున్నా... అన్నట్టు నీకో జోక్ చెప్పనా బాసూ... ఆ పత్రికల్లో నా ఫీచర్ ఎప్పుడు పీకేస్తారో నాకే తెలియదు. అప్పుడప్పుడు ఆ టెన్షన్‌తో మందు కొడతా మందుయోగం అని రాసుకోలేదు కానీ వాహనయోగం అని రాసుకున్నా. ఎవడైనా కనీసం లిఫ్టయినా ఇవ్వకపోతాడా?" అని నవ్వాడు ముక్కంటి.

అదంతా వింటున్న శలభారావుకు ఒళ్ళు మండింది. తన చేతిలో వున్న బీరు బాటిల్ ముక్కంటి నెత్తిమీద పగలకొట్టి మిగిలిన బీరు తన నెత్తిమీద గుమ్మరించుకోవాలన్న ఆలోచన వచ్చింది. తనెంత ఫూలిష్‌గా నమ్మాడు. అనవసరంగా తన టైం, బుర్ర వేస్ట్ చేసుకున్నాడు.

* * *

శలభారావుకు బుద్దొచ్చింది. రాశిఫలాలు, సమస్యలు సమాధానాలు చదవడం లేదు. తనలాంటి మూఢ నమ్మకం వున్నవాళ్ళకు తన స్టోరీ ఎక్స్‌పీరియన్స్ చెబుతున్నాడు. ఏదైనా పాజిటివ్‌గా తీసుకోవాలని అలాంటివి చదివి వర్రీ అవొద్దని...నథింగ్ టు వర్రీ... అని చెబుతున్నాడు శలభారావు.

ఆ రోజు రాత్రి ముక్కంటి తూలుతూ రోడ్డు మీద నడుస్తున్నాడు. సరిగ్గా అప్పుడే ఓ స్కూటర్ వచ్చి ముక్కంటిని గుద్దేసింది.అంబులెన్స్‌లో హాస్పిటల్‌కు వెళ్ళాల్సి వచ్చింది. ఆ విధంగా వాహనయోగం కలిగిందతనికి!. ◆





ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## పండుగంటే నేడే పండుగ...

ప॥ పండుగంటే నేడే పండుగ
పల్లెకైనా కొత్త ఢిల్లికైనా
పేదవాడకైనా సిరులమేడకైనా ॥పండుగంటే॥

చ॥ భాషలన్నీ సమతాభాషలైన రోజు
కులమతాలన్ని భరత కులాభిమతమైనరోజు ॥పండుగంటే॥

చ॥ సకలజనానందం ఓ...
సకలజనానందం మన సంస్కృతియైన రోజు
నవభారత నిర్మాణం నాగరికతయైనరోజు ॥పండుగంటే॥

చ॥ ప్రజలే పాలకులైన ఓ...
ప్రజలే పాలకులైన పర్వదినం నేడు
బాధలు భేదాలు మరచిపాడుకొనేరోజు ॥పండుగంటే॥

| | |
|---|---|
| రచన | : డా॥ జె.బాపురెడ్డి |
| సంగీతం | : ఎం.చిత్తరంజన్ |
| గానం | : బృందగానం |
| రాగం | : మిశ్రహరికాంభోజి |
| | -రాగ్ మిశ్ర్ ఖమాజ్(హిందుస్తాని సం॥) |
| తాళం | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) |
| | - దాద్రా (హిందుస్తాని సం॥) |
| హరికాంభోజి స్వరాలు | |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

- షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, చతుశ్శృతిదైవతం, కైశికి నిషాదం -ఈ రాగంలోని స్వరాలు.



హరి కాంభోజిలోని యీ స్వరాలకు అన్యస్వరమైన కాకలినిషాదాన్ని మిశ్రమంచేసి కొంతజానపద సంగీతశైలిని కూడా జోడించి ఈ పాటకు బాణీని కూర్చాను. ఈ స్వరాల మిశ్రమంతో జానపద, సంగీత ధోరణిలో బాణీలెన్నిటినో చాలాకాలంగా మనకు స్వరకర్తలు అందిస్తున్న విషయం, సంప్రదాయ జానపద గీతాలలో కూడా యీ మిశ్రమ పోకడలు దర్శనమిచ్చే విషయము 'హాసం' అక్టోబరు 16-31, 2002 సంచికలో నేను ప్రస్తావించడం జరిగింది. అదే విధంగా 'పండుగంటే నేడే పండుగ' అనే ఈ దేశభక్తి గీతానికి మిశ్రహరికాంభోజి స్వరాలు ఆధారంగా సంగీతం కూర్చబడింది. 1947లో స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత1950 వ సంవత్సరం జనవరి 26వ తేదీన మనదేశం ప్రజాస్వామ్య దేశం(రిపబ్లిక్ దేశం)గా ఏర్పడింది. ఆ రోజునుండి ప్రతిఏడూ జనవరి 26వ తేదీన'గణతంత్ర' దినోత్సవాన్ని(రిపబ్లిక్ దినోత్సవం) ఎంతో వైభవంగా జరుపుకుంటున్నాము. ఎన్ని ప్రాంతాలున్నా, ఎన్ని భాషలున్నా, 'భిన్నత్వంలో ఏకత్వం' నినాదంగా ఐక్యతతో దేశప్రగతికై శ్రమించడమే ధ్యేయంగాగల జాతి మనది.

'సకల మతాలను కలుపుకునే సాగరాత్మగల చరిత్ర మాది'(కృష్ణశాస్త్రి), 'భేదాలు వాదాలు మానాలి నేడు - ఒక మాటగా మనము నిలవాలి నేడు(దాశరథి), 'నీది నాది ఏనాటికి - మన అందరిదీ దేశం(వింజమూరి శివరామారావు), 'ఒక్కమాటపై నిలచి ఒక్క బాటలోనడచి - ఇలలో భారతాంబ ఖ్యాతి పెంచుదాం(డా॥ పద్మినీదేవి), 'దేశము మిూరై తేజము మిూరై ఒకటిగా వుంటే చాలదా- ప్రగతిని కోరే భారతమంతా వెన్నెల పుంతగా మారదా' ( డా॥ఆచార్య తిరుమల) ఇలా 'ఎందరో కవులు సకల మతసామరస్యాన్ని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధిస్తూ గావించిన రచనలు అనంఖ్యాకంగా వెలువడినాయి. 'ప్రజలే పాలకులైన పర్వదినం నేడు- పండుగంటే నేడే పండుగ' అని ప్రఖ్యాత కవి డా॥ జె. బాపురెడ్డి రిపబ్లిక్ దినోత్సవానికై వ్రాసిన యీ పాటను బృందగీతంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం జనవరి 26, 1982 నాడు "మాతృవందనం'' కార్యక్రమంలో ప్రసారం చేసింది.

### డా॥జె.బాపురెడ్డి



ఆధునికాంధ్ర సాహిత్యంలో అగ్ర శ్రేణి కవుల వరుసలో నిలబడతారు డా॥బాపురెడ్డి. ప్రకాశించే ప్రతిభకు, ప్రజాస్వామిక ప్రగతి శీలతకు, పరిమళించే పద చిత్రాలకు, ప్రయోజనాత్మక తాత్త్విక భావుకతకు సమాహారమైన ప్రతిరూపం శ్రీ బాపురెడ్డి. పద్యం, గేయం, వచనం మొదలైన అన్ని ప్రక్రియలలోను






చక్కని భావ చిత్రాలను రూపు కట్టించే అక్షరశిల్పి. ప్రణయాన్నీ, ప్రగతినీ, ప్రణవాన్నీ జీవితంలో ముప్పేటగా భావించే సమగ్ర దృక్పథంతో విరిసిన రచనలు ఆయనవి. ఐ.ఎ.ఎస్. ఆఫీసరుగా ఆంధ్ర ప్రభుత్వంలోని వివిధ శాఖలలో వృత్తిరీత్యా బరువు బాధ్యతలున్నా కూడా నిరంతర సాహితీ కృషీవలుడుగా చైతన్యరేఖలు, రాకెట్టు రాయబారం, బాపురెడ్డి గేయాలు, బాపురెడ్డి గేయ నాటికలు, పద్య కావ్యాలు, అనంత సత్యాలు, ప్రేమారామం (ప్రణయ గీతాలు), ప్రణయ ప్రణవం మొదలగు అనేక కావ్యాలను రచించారు.

సుమారు 4, 5 దశాబ్దాలుగా ఆకాశవాణిలోను, దూరదర్శన్‌లోను వివిధ యితివృత్తాలతో అనేక సందర్భాలకు ఆయన రాసిన గీతాలు ప్రసారమయి తెలుగువారిని అమితంగా ఆకట్టుకున్నాయి. పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీత దర్శకత్వంలో 'కొమ్మలలో కోకిలమ్మా కుహూకుహూమన్నదే', 'శిశిరంవలె యీసురాలి పోయింది-వాసంతంలా ప్రేమ పూచింది', 'ఒక్కటే తెలుగుదేశం' మొదలగునవి. పి.వి.సాయిబాబా స్వరరచనతో "కోకిల పాటలు వినే కోరిక లేదు" మొదలైనవి నా సంగీత నిర్వహణలో.

'ఇది మన భారతదేశం ఎంతో సుందరదేశం' (బృందగీతం-1975-77ల మధ్య కాలంలో ఎమర్జెన్సీ అమలులో వున్నపుడు), 'కోకిలా నా పాట కూడా వినిపించుకో' (గానం : మోహన్‌రాజు-ఈ మాసపు పాట), 'వెలుగు పండే తెలుగు తీరంలో -విలయ తిమిరం తాండవించింది' (గానం : చిత్తరంజన్- 1977లో కోస్తా ప్రాంతాన్ని తుఫాను ముంచెత్తినపుడు), 'నా దేశం నవ్వుతూంది నందనవనంలా' (గానం : ఎం.ఎస్.రామారావు ఈ మాసపు పాట), 'మురజమేదో నా మదిలో మురళి ఏదో నా ఎదలో మ్రోగుచున్నది డోలలూగుచున్నది' (గానం : మాడపాటి సరళారాణి) మున్నగు గీతాలు మచ్చుకు కొన్ని. ఇవేకాక ఆయన గేయ నాటికలు చాలా ఆకాశవాణిలో ప్రసారమైనాయి.

'శ్రీకార శిఖరం' అనే కావ్యం రెడ్డి గారి భావుకతకు, కవితా చేతనకు పరాకాష్ట అని చెప్పవచ్చు. ఇందులోని ప్రతీ గీతంలోనూ వినూత్నమైన భావాలను మనోహరంగా రూపొందించారు కవి. తిరుమలేశుని చరణ కమలాలకు అంకితం చేసిన యీ కావ్యంలోని కొన్ని పాటలు సాలూరి రాజేశ్వరరావు గారి సంగీత సారథ్యంలో క్యాసెట్‌గా రూపొందించారు.

"నా మనో భావనలు గోపీ జనం
నా క్రియారంగమే బృందావనం
నా బ్రతుకు ఆనంద కృష్ణార్పణం"
(గానం : పి.సుశీల)

'త్యాగయ్య పాడుకొనెను తలపుతంత్రితో
అన్నమయ్య ఆడుకొనెను వలపుటూహతో'
(గానం : డా॥బాలమురళీకృష్ణ)

'సిగ్గవుతున్నది నాకు శ్రీనివాసా
నెరిసిన తలనీలాలను నీకీయాలంటే'

మొదలైన మధుర గీతాలు ఆ క్యాసెట్‌లోనివి.

ఇంకా 'ఆరాధనా లహరి', 'సప్తగిరి బాలాజి' వంటి భక్తి గీతాల క్యాసెట్లు రెడ్డి గారివి రిలీజు చేయబడినవవి.

వీరు In quest of Harmony, loving for life మొదలైన అనేక ఆంగ్ల కావ్యాలను కూడా రచించారు. వీరి తెలుగు, ఇంగ్లీష్ కావ్యాలను తమిళ, కన్నడ యిత్యాది పలు భారతీయ భాషలలోనే కాక, జర్మన్, స్పానిష్, టర్కిష్, కొరియన్ భాషలలోకి సైతం తర్జుమా చేయడం జరిగింది.

రెడ్డిగారు సుమారు 36 దేశాలలో పర్యటించి తమ తెలుగు కవితా సౌరభాలను ఆయా దేశాలలో వెదజల్లి తెలుగు భాష ఔన్నత్యాన్ని చాటారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు-1971 (బాపురెడ్డి గేయాలు'-కావ్యానికి), మొరాకోలో జరిగిన వరల్డ్ కాంగ్రెస్ ఆఫ్ పొయెట్స్ సభలో వరల్డ్ అకాడమీ ఆఫ్ ఆర్ట్ & కల్చర్ వారిచే డాక్టరేట్ డి.లిట్ ప్రదానం(1984), 'దాశరథి లిటరరీ అవార్డు', 'జాషువా అవార్డు', 'ఋతురాగం' టెలీ సీరియల్‌లోని గీత రచనకు 'బెస్ట్ లిరికిస్ట్ అవార్డు' (నంది అవార్డు) మున్నగు అవార్డులు, గౌరవాలు అసంఖ్యాకంగా వీరిని వరించాయి. వీరి సాహిత్యంపై పరిశోధన చేసి ఎం.ఫిల్, పి.హెచ్.డి. డిగ్రీలు పొందిన వారున్నారు.

బాపురెడ్డి గారి షష్టిపూర్తి సంచికగా వెలువడిన 'బాపురెడ్డి సాహితీ భారతి' ఆయన సాహితీ విరాట్ స్వరూపాన్నీ, విశ్వమానవ ప్రేమతత్వాన్ని ఆవిష్కరించింది.

## మిశ్రహరి కాంభోజి రాగం ఆధారంగా కొన్ని సినీ గీతాలు




| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. లాలూ దర్వాజ లష్కరు బోనాల్ పండుగకు | మొండి మొగుడు పెంకి పెళ్ళాం | ఎస్.పి.శైలజ | యం.యం.కీరవాణి |
| 2. ప్రతిరాత్రీ వసంత రాత్రీ ప్రతి గాలి పైరగాలి | ఏకవీర | ఘంటసాల, బాలు | కె.వి.మహాదేవన్ |
| 3. రానిక నీ కోసం సఖీ రాదిక వసంత మాసం | మాయని మమత | ఘంటసాల | అశ్వత్థామ |
| 4. ఎంత బాగా అన్నావు ఎవ్వరు నేర్పిన మాటరా | అమ్మమాట | సుశీల | రమేష్‌నాయుడు |
| 5. ముద్దబంతి పూలుపెట్టి మొగలి రేకుల జడనుచుట్టి | కలసివుంటే కలదు సుఖం | ఘంటసాల, సుశీల | మాస్టర్ వేణు |
| 6. ఓ రంగయ్యో పూల రంగయ్యో | వెలుగు నీడలు | ఘంటసాల, సుశీల, బృందం | పెండ్యాల |

### హింది

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. ఆవో బచ్చో తుమ్హే దిఖాయే ఝూన్కి హిందుస్తాన్‌కే | జాగృతి | ప్రదీప్, బృందం | హేమంత్‌కుమార్ |
| 2. హమ్‌లాయే హైఁ తూఫాన్‌సే కిష్తీ నికాల్ కే | జాగృతి | రఫీ | హేమంత్‌కుమార్ |
| 3. నన్హేమున్నే బచ్చే తేరీ ముఠ్ఠీ మేఁక్యాహై | బూట్‌పాలిష్ | మన్నాడే, ఆశాభోఁస్లే, బృందం | శంకర్ జైకిషన్ |
| 4. కర్‌గయారే కర్ గయారే కర్ గయా ము ఝ్‌పే జాదూ | బసంత్ బహార్ | లత, ఆశా | శంకర్ జైకిషన్ |

సీరియల్

12

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

## జరిగిన కథ

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించాక ఊరెళ్లి డబ్బులు తెస్తానని చెప్పి నిర్మాత మాయమయిపోయాడు. ఆకలిబాధలు తాళలేక ఓ పెద్ద డైరక్టరు వద్ద అసిస్టెంటుగా జాయిన్ అవుదామని వెళ్లాను. అక్కడ మాటలు పడలేక మానేసాను. ఫలానా వచ్చి తిండి పెట్టించి ఓ హీరోయిన్ కథ చెప్పాడు..."

(ఇక చదవండి)



"...దాంతో అందరికి మొహం మొత్తింది. 'ఓసి దీని గర్వం'అనుకున్నారు. ఇదే శాశ్వతమనీ తనెప్పుడు ఇట్లాగే ఉంటాననీ అనుకుందామె. ఆమె మీద అందరికీ అసహ్యం పుట్టింది. ఆమెని గురించి అందరూ విన్నారు, రాను రాను వేషాలు తగ్గిపోయాయి. కొన్నాళ్ళకు కారు అమ్మేశారు, పెద్ద ఇళ్ళు మార్చేసి, చిన్న ఇంటికి పోయారు. ఇప్పుడెక్కడా వేషాలు లేవు. మళ్ళీ మొదటిస్థితికి వచ్చి - ఖేదఘట్టాల్లో పడి కొట్టుమిట్టాడుతూంది.

విన్నారా గురూగారూ - మిడిమిడి భాగ్యాన్ని చూసి మురిసిపోతే ఎంత అవకతవకో! దీన్నే "నడిమంత్రపుసిరి'' అంటారు. తానప్పుడు ఫీల్డంతా కొనేసేదానిలాగా మాట్లాడేది. ఇప్పుడేమయింది? అంచేత ఈ రోజు వేషం వచ్చిందని నేను పొంగిపోకూడదు. మీ దగ్గర

రూపాయుందని మీరు ఉబ్బిపోకూడదు." అని లేచాడు ఫలానా.

"ఏం?" అన్నాను.

"ఏం లేదు, ఊరికే, మూమెంటు ఒక్కలాగే ఉందని, కాస్త మార్చాను. గురూజీ - వాళ్లెవరో డబ్బింగు చిత్రం తీస్తున్నారట."

"డబ్బింగు చిత్రం తియ్యడమేమిటోయ్?"

"అదేలెండి - డబ్బింగు చేస్తున్నారుట - ట్రై చెయ్యరాదా? ఏదయినా పాత్రకు గొంతు యిద్దురుగాని!"

"వద్దులేవోయ్ - మనకు లేనిపోనిది. ఒక్కటి చెబుతా విను. మనకు తెలియనిదాని జోలికి మనం పోకూడదు. పోతే ముప్పు తప్పదు."

"దాని మీద కథ చెబుతారా ఏమిటి కొంపదీసి - ఒద్దులెద్దురూ - వినే ఓపిక లేదు .... అదెవరు గురూగారూ. మన సలహాలా ఉన్నాడు గదూ .... ఉండటమేమిటి - ఆయనే. ఏఁవండోయ్ .... సలహాలవారూ, రండి... రండి" అని పిలిచాడు ఫలానా. ఎటో పోతున్న సలహా మా వేపు చూసి, మా దగ్గరకు వచ్చాడు.

"ఏమిటండీ సలహాలుగారూ, ఇంతపని జేయించారే?" అన్నాడు ఫలానా,

"ఏమైంది?" అన్నాడు సలహా - ఎటో చూస్తూ.

"నాటకం ఆడకండి - సినిమా తియ్యండి గాని! మీకు తెలీదా - మన నిర్మాతగారు ఎట్లా వెళ్ళిపోయిందీనూ."

"తెలిస్తే? అతనిష్టం. అతను సినిమా మానుకున్నాడు. మనమెవరం చెప్పటానికీ చెందటానికీ - యూ సీ ...."

"ఐసీ - " అన్నాడు ఫలానా చిరాగ్గా.

"మీరు వారికి సరిగా సలహా యిచ్చివుండొచ్చుగదా - ఐనా, వస్తాను, చెప్తాను, చేస్తాను అని చెప్పి ఇంతలో మోసం చేసి వెళ్ళిపోతే ...." అన్నాను నేను.

"అరెరె! వాట్ డూ యూ మీన్, ఇటీజ్ ...."

"తెలుగులోకి డబ్ చేదురూ, చస్తున్నాం" అన్నాడు ఫలానా.

"అబ్బాయ్ ఫలానా - ఇందులో ఇంత వర్రీ కావటానికి ఏముందో అర్థం కావటంలేదు. ఈ ప్రకారంగా సినిమాలు తీస్తామని మనుషులు రావటం, బోర్డులు కట్టటం, కొంత హంగు చెయ్యటం .... ఇదంతా ఈ 'సీమ'లో మామూలే గదా! ఇంకానయం, మనవాళ్ళు ఇంకా బోరు కొట్టలేదు. అందుకు సంతోషించండి" అన్నాడు సలహా వెళ్ళిపోతూ.

"పోనీ మాకేదన్నా సలహా ఇవ్వండి" అన్నాడు ఫలానా.

సలహా వినిపించుకోలేదు, అట్లాగే పోతున్నాడు.

"ఓ సినీతి కథేనా సెలవివ్వకుండా వెళ్తున్నారు -" అన్నాడు మళ్ళీ.

"పోనీ వూరుకోవోయ్," అన్నాను నేను.

"దొంగ చచ్చినోడు.వీడే చేసి ఉంటాడులెండి గురూ అసలు ఇట్టాంటివాళ్ళు ఫీల్డులో చాలామంది ఉన్నారు. వాళ్ళు పోతేనేగాని - ఫీల్డు బాగుపడదు" అన్నాడు ఆవేశంగా ఫలానా.

"అనవసరంగా నోరు పారేసుకోకు, సలహా చెప్పినట్టు సలహా మాత్రం ఏం చేస్తాడు? అతనూ మనలాగానే అవస్థపడుతున్నాడేమో!" అన్నాను నేను.

"ఇటువంటివాళ్ళు ఏమి అవస్థపడరు గురూ - డబ్బుపెట్టిన వాళ్ళని మధ్యన ఇరికించి తమాషా చూస్తారు. మీకో కథ చెప్తాను వినండి. ఆ మధ్య - ఒక డబ్బున్నాయన సినిమా తియ్యటానికి వచ్చాడు. వాళ్ళకేం తెలుస్తుంది? మన సలహాలాంటి మనిషి ఒకడు దొరికాడు. వాడి ఆధారంగా చిత్రనిర్మాణయత్నం కొనసాగింది. అసలాయన ఈ మనిషికి డబ్బివ్వటమే నన్నమాట. ఇతనేం కావాలన్నా, ఏం చెయ్యాలన్నా అతను చేసేవాడు. ఈ మనిషి తన యిష్టులందర్ని పెట్టాడు. తానే పెద్ద ప్రొడ్యూసరల్లే ఫోజు కొడుతూ కార్లమీద తిరుగుతూ ఇతరుల ధనం మీద సౌఖ్యాలు పొందసాగాడు. గులాంల దగ్గర్నుంచి అందరూ ఇతనికే సలాంలు కొట్టేవారు. ఈ విధంగా సంచరిస్తూ, అతను 'డబ్బు' కొట్టేశాడు. ఆ డబ్బు పెట్టిన మనిషి పాపం - ఇక్కడ ఉండేవాడే కాదు. స్టార్లకు ఇంత ఇవ్వాలీ, అంత ఇవ్వాలీ అని చెబుతూ తాను మిగుల్చుకొంటూ ఉండేవాడు. చివరకు ఏమయిందో తెలుసా గురూ? చిత్రం విడుదలై - నాలుగయిదు వారాలు కూడా పోలేదు. నిర్మాత చాలా నష్టపోయాడు. కానీ, కానీ కూడా పెట్టుబడి పెట్టకుండా - కార్లమీదా, నోట్లమీదా తిరిగి, 'ఫోజు' కొట్టి అధికారం చెలాయించిన ఈ మనిషి లాభం సంపాయించాడు. ఆ డబ్బు పెట్టి స్వంతంగా చిత్రం తీస్తున్నాడని వింటున్నాను. వింటున్నారా గురూ! ఎంత అన్యాయమో, ఎంత ద్రోహమో" అని ముగించాడు ఫలానా.

"ఏమైతేనేం - మనం ఇవాళ ఖేదపడుతున్నాంగదా" అన్నాను నేను - ఏమీ చెప్పలేక.

ఆ రాత్రి చాలాసేపటిదాకా ఫలానాకు కారురాలేదు. షూటింగు కాన్సిల్ ఐందేమో తెలీదు. ఉన్నడబ్బులేవో పెట్టి, ఇద్దరం సర్దుకుని ఏదో తిన్నాం. ఎనిమిది గంటలనుంచీ ఫలానా వాళ్ళను తిడుతూనే ఉన్నాడు.

"ఇదే గురూ - ఒక టైముండదు - ఒక వేళ ఉండదు, చూశారా - కారు పంపుతానన్న పెద్దమనిషి ఎంత మోసం చేశాడో - పోనీండి. కాల్‌షీటు కాన్సిలు ఐతే. ఆ మాటయినా చెప్పాలా - అదీ చెప్పరు. అందులో నాలాంటి వర్ధమానుడికి అడిగినా సరే, చెప్పరు. ఛీ ఛీ - ఇప్పుడు ఉందనుకోవటమా - లేదనుకోవటమా - ఉందనుకొని ఇక్కడ ఇట్లా తెల్లవారేదాకా జాగారం చెయ్యటమా - లేదనుకొని ఎవడిగదికోపోయి నిద్రపోవటమా - ఇక్కడ ఉంటే రాకనూ పోవచ్చు - పోతే రానూ రావచ్చు - ఏమి కాన్‌ఫ్లిక్ట్ సీను క్రియేట్ చేశాడో చూశారా - ఆ ప్రొడక్షన్ మానేజరు!" అన్నాడు ఫలానా.

మేము అక్కడ రాత్రి పదకొండు గంటలదాకా ఏవేవో మాట్లాడుకుంటూ కూచున్నాము. పదకొండు గంటలకు కారొచ్చి ఆగింది. కార్లోంచి ఆ ప్రొడక్షన్ మానేజరు - రావయ్యా, తొందరగా! ఇంకా కూచున్నావు" అని



కసిరాడు - తప్పంతా ఫలానాదే ఐనట్టు.

"ఎప్పొంటికి వస్తాన్నారుగా - తిండిలేదు, తిప్పాలేదు - ఇక్కడ తపస్సు చేస్తూనే ఉన్నాను" అన్నాడు ఫలానా లేస్తూ.

"అక్కడ చూదాం పద! సినిమా కంపెనీలో తిండితిప్పలూ ఎవడికి మాత్రం ఉన్నాయి? నువ్వేదో టైము చెబుతున్నావు, ఎనిమిదింటికి వస్తానంటే, పదకొండుకు వస్తానని అర్థం అన్నమాట. ఎలాగంటావా - పెద్ద తారలు ఏడింటికి వస్తామని పదింటికొస్తున్నట్లు. లే, లే" అన్నాడు ప్రొడక్షన్ మానేజరు.

"బావుంది" అని ఫలానా మా ఫ్రెండు కూడా వస్తాడు .... కాస్త చోటు యివ్వరూ" అన్నాడు.

"రా - రా పుష్పక విమానం ఇది, ఎక్కించు" అన్నాడు. ఫలానా ఎక్కి నన్ను రమ్మన్నాడు. కారునిండా పాతిక ముప్పై మంది జనం ఉన్నట్టున్నారు. ఎక్కడా కాలుపెట్టుకోవటానికి కూడా స్థలం లేదు.

"నేను రాన్లే" అన్నాను.

"రండి గురూ, సరదాగా, ఇక్కడేం చేస్తారు? రండి .... ఇదిగో ఇక్కడ కాళ్ళు ఇరికించి - ఇట్లా వంగుని నిలబడవచ్చును. ఎంతసేపు అరగంటలో స్టూడియోలో దిగుతాం" అన్నాడు ఫలానా. నేను ఎక్కాను. తలుపు వెయ్యకమునుపే ఆ కారు 'డగడగడగ'మంటూ స్టార్టయింది. సాధారణంగా ఐదు నిముషాల్లో చేరవలసిన స్టూడియోకు అరగంటలో చేరుకొన్నాం - ఫలానా చెప్పినట్టే దిగేసరికి కాళ్ళు నొప్పులు - వొళ్ళునొప్పులు.

"ఎనిమిదింటికి బయలుదేరి నడిచివచ్చేసినా హాయిగా వచ్చేవాళ్ళం కదా" అన్నాను నేను కారుదిగి ఫలానాతో.

"మరే కానీ - మనం లోకువయిపోతాం గురూ - రంగు వేసుకుందాం" అని మేకప్ రూముకేసి బయలుదేరాడు. తెలిసిన వాళ్లెవరైనా కనిపించి - "ఏం ఇలా వచ్చారు?" అని అడుగుతారేమోనని భయంతో నేను నెమ్మదిగా అతని వెనకాలే వెళ్ళాను.

మేకప్ రూం నిండా జనం ఉన్నారు. "ఇంకో గంట పోతే గాని మేకప్ వెయ్యను" అని కసురు కున్నాట్ట - మేకప్ అసిస్టెంటు. ఫలానా వచ్చేశాడు.

"పోనీండి గురూ. కాసేపు సెట్లోకి వెళ్ళివద్దామా?" అన్నాడు ఫలానా.

"నేను రాను" అన్నాను.

"రండి గురూ గారూ, విశేషాలూ, వార్తలూ తెలుస్తాయి. మీకేం భయంలేదు. తెలిసినవాళ్ళెవరైనా కనిపించి అడిగితే, 'పని మీద వచ్చానని' చెప్పండి. సెట్లో బిజీగా ఉన్నట్లు ఫోజుకొట్టండి. "ఏం పిక్చరు డైరెక్టు చేస్తున్నారని అడిగితే - ఇంకా పేరు పెట్టలేదు" అని చెప్పండి. ఇటువంటి గప్పాలు చెప్పుకోవటానికే చిత్రాలకు ముందుగా పేర్లు పెట్టరు. రండి" అని లాక్కెళ్ళాడు.

సెట్టుదగ్గరకు వెళ్ళగానే - అంతా సందడిగా ఉంది. సెట్టునిండా జనం ఉన్నారు. ఇద్దరుముగ్గురు పెద్దతారలున్నారు. చిన్న వేషాలు వేసేవాళ్ళు చాలామంది ఉన్నారు. రెండుఫాన్లు రొదచేస్తూ తిరుగుతున్నాయి. "అంద బేబీ కొండా! పోడు ... ఇది పెరిసుపణ్ణు ....ఉన్నుం పెరిసు ..... వున్నుం ..... వున్నుం .... బాన్ బాన్ - ఫిక్స్" అని అరుస్తున్నాడు కెమెరామాన్. గుమ్మం దగ్గిర ప్రొడక్షన్ ఆయన కనిపించి -

"ఏంవయ్యా - ఇక్కడికొచ్చావ్ - వెళ్ళి రంగేసుకో" అన్నాడు ఫలానాతో.

"బావుంది గురూ - అక్కడికెళితే గంటయ్యాక రమ్మంటాడు. ఇక్కడికొస్తే మీరు అక్కడికి పొమ్మంటారు. ఏంటి గురూ మీరు కాన్ఫ్లిక్టు సీనుమీద కాన్ఫ్లిక్ట్ సీను పెట్టేసి చంపేస్తున్నా"రన్నాడు ఫలానా.

"ఏంటయ్యా కబుర్లు చెబుతావ్ - పదకొండు గంటలకొచ్చి" అన్నాడు పైగా ఆయన.

"మరో మేకప్ మనిషిని పెట్టరాదూ?" అన్నాడు ఫలానా.

"ఏం - నువ్విస్తావా డబ్బు" అని, అతను తగ్గి - "లేదయ్యా నీ షాటు రెండు, మూడు గంటలప్పుడుగాని రాదు. అందుకనే ముందుగా నిన్ను తీసుకొచ్చి ఇక్కడ బాధపెట్టడం ఎందుకని, పదకొండుకు తీసుకొచ్చాను" అన్నాడు నవ్వుతూ.

"సరే - నా కేదేనా టిఫినూ, కాఫీ ...." అన్నాడు ఫలానా.

"ఏకంగా రెండవనీ - బ్రేక్ చేదాం. బ్రేక్‌లో టిఫినూ, కాఫీ .... మంచినీళ్ళునూ," అని ప్రొడక్షన్ మనిషి వెళ్ళిపోయాడు.

"ఆహా! గురూ, చూశారా?" అన్నాడు ఫలానా నా వేపు తిరిగి.

నేనేం అనలేదు, అటూ ఇటూ చూస్తూ ఉండగా, తెలిసిన ఒకాయన కనిపించి - విష్ చేశాడు.

"బాగున్నారా?" అన్నాను.

"మీ దయవల్ల"

"ఏమిటి పిక్చరేదేనా మొదలెడుతున్నారా, లేదా?" అని అడిగాను నేనే. ఒకవేళ అటువంటి ప్రశ్న ఏదన్నా నన్ను అడుగుతాడేమోనని భయం వేసి.

"ఆఁ ఎక్కడండి .... ఫిల్మ లేదు, మనం ఎక్కడ ఇబ్బంది పడతాం. కొన్నాళ్ళలో మనదేశంలోనే ఫిల్ము ఉత్పత్తి జరుగుతుందటగా - అప్పుడైతే మనిష్టం" అన్నాడు - వెళ్ళిపోతూ.

ఆ రాత్రి ఇంకెవరూ కనిపించలేదు. రెండు గంటలకు ఫలానా మొహానికి కాస్త తెల్లరంగూ, ఎర్రరంగూ పులుముకుని వచ్చాడు.

"చూశారా - గురూ ఈ మహద్భాగ్యానికే ఇంత సేపయింది. ఏదో స్పెషల్ మేకప్ అనుకున్నాను. రంగు సరిగా వెయ్యవయ్యా అంటే - "చాలు, లాంగ్‌షాట్‌లో ఉంటావు - కనిపించదు" అని పంపేశాడు" అన్నాడు ఫలానా. ఆ తర్వాత ఓ రొట్టెముక్కా, ఇంత కాఫీ యిచ్చారు. నాకివ్వటానికి చాలా తటపటాయించి, ఆ తర్వాత యిచ్చినట్లు అర్థమైంది. ఎంచేతనంటే, అందరికీ ఇచ్చేసిన అరగంటకుగాని నాకు ఇవ్వలేదు.

తెల్లవారిపోయి, ఆరుగంటలై పోయింది. కాల్‌షీటయి పోయింది. ఫలానాకు షాట్ రాలేదు. రంగు తుడిచేసుకుని పొమ్మన్నారు. వస్తే మళ్ళీ కబురుచేస్తాం అన్నారు. ఆ అవస్థను తలచు కుంటూ - ఇద్దరమూ నిద్రలేక తూలిపోతూ, కళ్ళుమండిపోతూ - పార్కుదగ్గర దిగి ఒక చెట్టుకింద చేరి, గడ్డిలోపడి చిత్తుగా నిద్రపోయాము. **(ఇంకావుంది)**



# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి



మీ అమ్మగారు చాలా అందంగా ఉంటారు...



అయినా నీకు మీ నాన్నగారి పోలికలు వస్తాయ్.



మీరు రైలెక్కడానికి చాలా సామాన్లు మోసుకుంటూ వెళ్తుంటే, ఫ్రెండ్సంతా చూసీచూడనట్లుండి ఎవరూ సాయం చెయ్యరు...



లలితకి అట్టే సామాన్లు లేకపోయినా పది మంది ఫ్రెండ్స్ గుమిగూడుతారు-నేను మోసుకొస్తానంటే నేను మోసుకొస్తానని.



మీరు చాలా జాగ్రత్తగా అన్నీ చూసి చూసి తింటారు-బరువు పెరగకూడదని. ఐనా మీరు తెగ ఊరిపోతుంటారు....



మీ ఫ్రెండ్ ఇష్టం వచ్చినట్లు, దొరికిందల్లా తింటూంటుంది. ఐనా సన్నగా ఉంటుంది.

**"మూర్ఖులు కచేరి మొదలుపెట్టి, కాలానికి కర్ణ కఠోరమైన రణగొణ ధ్వనులను వినిపిస్తుంటే - తెలివైనవారు నిగూఢమైన సంగీత నాదంలా నిశ్శబ్దం పాటిస్తారు" అన్న మాటలు ఓ.పి.నయ్యర్ విషయంలో సరిగ్గా సరిపోతాయి.**



# ఓ.పి.నయ్యర్

హిందీ చిత్రసీమలో 60 దశకంలో రెబెల్‌గా పేరొందిన షమ్మీకపూర్ మెలికలు తిరుగుతూ మెడ ఓ పక్కకి వంచి "చుప్నే వాలే సామ్నే ఆ" అంటూ గంతులు వేసినా, ఒక్కచూపులో మనుసునుదోచే ముంతాజ్ తన ఒంటిని విరుస్తూ "యేహై రేష్మి జుల్ఫోంకా అంధేరా'' అని హస్కీగా పాడినా, మహోన్నత నటుడు గురుదత్ పెద్దగా నవ్వుతూ ప్రియురాలితో "సున్ సున్ సున్ సున్ జాలిమా" అని ఆలపించినా, ట్రాజెడీ కింగ్ దిలీప్ కుమార్ గాలికే హెచ్చరికలు చేస్తూ "ఉడే జబ్ జబ్ జుల్ఫేతేరీ" అంటూ డాన్సు చేసినా- వీటన్నిటిలో కనిపించే ఒక ఏకీభావం ఉంది. తేలిగ్గా చెప్పాలంటే ఈ పాటలకి ట్యూన్స్ కట్టి సినీ సంగీతంలో ఇంద్రజాలాన్ని సృష్టించినవాడు "ఓ.పి. నయ్యర్''. తన మెలోడియస్ మ్యూజిక్‌తో యావత్ భారత ప్రజలను పరవశానందసాగరంలో ఓలలాడించిన సంగీత దర్శకు డాయన. జనవరి 16న 77వ ఏట ప్రవేశిస్తున్న నయ్యర్ సాబ్ పూర్తిపేరు "ఓంకార్ ప్రసాద్ నయ్యర్". లాహోర్‌లో 1926 జనవరి 16న పుట్టారు.



వనితనం నుండే సంగీతం, గానం, కవిత్వం పట్ల అభిమానం పెంచుకున్నారు. గులాం హైదర్, సైగల్, కానన్‌దేవిల గానమంటే చెవికోసుకునేవారు. సినిమాల్లో హీరోగా నటించాలని, అందమైన హీరోయిన్లతో కలిసి డాన్స్ చేయాలని కలలు గన్నారు. కాని ఎందరో అందాల తారల డ్యూయెట్లకు సంగీతం అందించేవాడిగా ఎదిగాడు. చదువుకునే రోజుల్లోనే 1937లో పదమూడేళ్ల వయస్సులో లాహోర్ రేడియోలో చిన్నపిల్లల కార్యక్రమంలో వినిపించే పాటలకు తొలిసారిగా ట్యూన్స్ కట్టారు. 1950లో సినీ రంగప్రవేశం చేశారు. 1951లో పంచోలీ అనే నిర్మాత తీసిన "ఆస్మాన్" చిత్రానికి తొలిసారిగా సంగీత దర్శకత్వం నెరిపారు. ఈ చిత్రంలోని "పమ్ పమ్ పమ్ బాజా బోల్", "దేఖో జాదూ భరే యేనైనా" పాటలు పాపులరైనవి. అయితే ఏ సంగీత దర్శకుడి వద్దా అసిస్టెంటుగా పనిచేయకుండానే ఈ అవకాశం వచ్చింది. ఇందుకు ముందు 1945లో సి.హెచ్. ఆత్మచే "ప్రీతమ్ ఆన్ మిలో" ప్రైవేట్ పాటకు ట్యూన్స్ కట్టి ప్రాచుర్యంలోకి వచ్చారాయన.

నయ్యర్ ఆ తరువాత సంగీతం సమకూర్చిన ఆస్మాన్, బాజ్, ఛమ్ ఛమా ఛమ్ చిత్రాలు వరసగా ఫెయిలయినవి. అయితే గురుదత్ "ఆర్‌పార్" నుండి ఆయన దశ తిరిగింది. అనంతరం గురుదత్‌తో సి.ఐ.డి., మిస్టర్ అండ్ మిసెస్ 55 చిత్రాలకు సంగీతం అందించారు. "బహారే ఫిర్ భీ ఆయేంగే" కూడా నయ్యర్ సంగీతంతో తయారైనదే. గురుదత్ అయితే "నయ్యర్ స్వరాలు కూర్చేది పదాలకు కాదు భావాలకే" అని ప్రసంశించారొక సందర్భంలో.

నయ్యర్ సాబ్ సంగీతంలో షంషాద్ బేగం, గీతారాయ్, ఆ తరువాత ఆశాభోంస్లే పాడిన పాటలే ఎక్కువ. విశ్వఖ్యాతిగాంచిన లతా మంగేష్కర్‌చే ఒక్కపాట కూడా పాడించకుండా సంగీత దర్శకుడుగా వెలుగొందడం అనితరసాధ్యం. ఓసారి ఆయనే స్వయంగా

## ఓ.పి.నయ్యర్ సంగీతం ఇచ్చిన కొన్ని పాటలు, చిత్రాలు

| | | |
|---|---|---|
| కభీ ఆర్, కభీ పార్ | ఆర్‌పార్ | 1954 |
| లేకే పహెలా పహెలా ప్యార్ | సి.ఐ.డి. | 1956 |
| మాంగ్‌కే సాథ్ తుమ్హారా | నయాదేర్ | 1957 |
| ఇక్ పర్‌దేశీమేరా దిల్ లేగయా | ఫాగున్ | 1958 |
| మేరానామ్ చిన్ చిన్ | హౌరాబ్రిడ్జి | 1958 |
| బహుత్ శుక్రియా బడే మెహర్‌బానీ | ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా | 1962 |
| బందా పర్‌వర్ | ఫిర్ వహీదిల్ లాయా హూఁ | 1963 |
| దీవానా హువా బాదల్ | కాశ్మీర్ కీ కలీ | 1964 |
| యేహై రేశ్మీ జుల్ఫోంకా అంధేరా | మేరేసనమ్ | 1965 |
| ఆప్‌కే హసీన్ రుఖ్ పర్... | బహారేఁ ఫిర్‌భీ ఆయేంగీ | 1966 |
| మేరా ప్యార్ వో హై | యే రాత్ ఫిర్ న ఆయేగీ | 1966 |
| వో హసీన్ దర్ద్‌దేదో | హమ్‌సాయా | 1968 |
| ఆంఖోంమే కయామత్ కీ కాజల్ | కిస్మత్ | 1968 |
| చల్ అకేలా | సంబంధ్ | 1969 |
| రూప్ తేరా ఐసా | ఏక్ బార్ ముస్కు రాదో | 1972 |
| చైన్ సే హమ్‌కో | ప్రాణ్ జాయే పర్ వచన్ నా జాయే | 1974 |



ఓపి నయ్యర్ కెరియర్‌ను మలుపు తిప్పిన 'ఆర్‌పార్'లో గురుదత్, షకీలా, జానీవాకర్



ఓ.పి.నయ్యర్ సంగీత దర్శకత్వం వహించిన నీరాజనం చిత్రంలో ఓ దృశ్యం

"వందేళ్లకో లతా పుడితే రెండు వందల ఏళ్లకో ఆశా పుడుతుంది" అని ప్రకటించి ఆషా పాటల జెండాను హిమాలయంపై ఎక్కించిన వారాయన. ఇంకా చెప్పాలంటే లతామంగేష్కర్‌ని కాదని హిందీ చిత్రసీమలో బతికి బట్ట కట్టినవాడు నయ్యర్. 'లత బేస్ వాయిస్ నా స్వరాలకు ఇమడదని" ప్రకటించిన ధైర్యశాలి ఆయన.

నయ్యర్ క్లాసీ మ్యూజిక్‌కి రఫీ-ఆశాల గాత్రం ఒద్దికగా ఇమిడిపోయింది. వీళ్ల కాంబినేషన్ 80 దశకం దాకా ఓ వెలుగు వెలిగింది.

లతను కాదని ఆషాను ఆకాశానికెత్తిన నయ్యర్ మూడోతరానికి చెందిన కృష్ణకల్లె, వాణీజయరామ్, దిల్ రాజ్‌కౌర్ వంటివారిని ప్రోత్సహించినా వారెందుకో అంతగా వెలుగులోనికి రాలేకపోయారు. మధ్యప్రదేశ్ ప్రభుత్వం లతామంగేష్కర్ అవార్డుకు ఎంపిక చేయగా "బ్రతికి ఉన్న వారి పేరు అవార్డేమిటి?'' అని తిరస్కరించడం నయ్యర్ సాబ్‌కే చెల్లింది.

దశాబ్దాల సినీ జీవితంలో ఆయన సంగీతం నెరిపిన చిత్రాల సంఖ్య రాశిలో తక్కువే అయినా వాసిలో వాటి విలువ గొప్పది.

తెలుగులో నయ్యర్ చేసింది ఒక నీరాజనం' చిత్రమే. అదీ చాలాకాలం పాటు సినిమాలకు దూరంగా ఉండి మళ్లీ పనిచేసిన చిత్రం ఇది. ఈ చిత్రం ఆడియో నేటికీ హిట్ స్టేజ్‌లోనే ఉందంటే ఆయన మెలోడియస్ మ్యూజిక్ వల్లనే. "దక్షిణాది గాయకులలో బాలు,జానకి సమర్థులైన వారు.రిహార్సల్ లేకుండానే బాణీని పట్టేయ గలిగిన మధురగాయకుడతడు. జానకి తెలుగు వారికి దేవుడిచ్చిన వరం. ఆమె లత, ఆశాలకు ఏ విధంగానూ తీసిపోదు. కొన్ని సందర్భాల్లో ఆమె వారిద్దరినీ కూడా అధిగమించగలదు'' లని ప్రశంసిస్తారాయన.

తాను పంజాబీ అయినా ఇంత వరకూ ఏ ఒక్క పంజాబీ చిత్రానికి సంగీతం చేయకపోవడం విశేషం. నయ్యర్ సాబ్‌ను తెలుగువారు ఆత్మీయునిగా భావిస్తారు. 1998లో హైద్రాబాద్‌లో సన్మానించారు. 1995 డిసెంబర్‌లో ఆయన పాటలతో సంగీత విభావరి నిర్వహించారు. హిందీ చిత్రరంగంలో నేడెందరో గొప్ప సంగీత కారులున్నారు. మరెందరో రావచ్చు. కాని నయ్యర్ మాత్రం ఒకే ఒక్కడు.

**- హెచ్.రమేష్‌బాబు**

---

సంగీతానికి సంబంధించిన సమితులు, సమాజాలు నిర్వహించేవారు ఈ కూపన్ నింపి మాకు పంపితే 'హాసం' వద్ద ఆడియో క్లబ్ డేటాబేస్ తయారవుతుంది. మాకందిన వివరాలు 'ఆడియోక్లబ్స్' శీర్షిక ద్వారా పాఠకులకు తెలుపుతాం. దీనివల్ల ఈ క్లబ్స్ పరస్పరం సహకరించుకునేందుకు, సమన్వయం సాధించేందుకు ఉపయోగపడుతుంది.

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

సంస్థ పేరు :............................................................ స్థాపించినసంవత్సరం:....................

ఉద్దేశ్యము :............................................................ సభ్యుల సంఖ్య :....................

అడ్రసు :............................................................

............................................................ పిన్‌కోడ్ నెం:....................

కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ :............................................................

కార్యనిర్వాహక సభ్యులు 1. ☎

2. ☎

3. ☎

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : తేదీ:..........

# ఓ.పి.నయ్యర్ హిట్స్

## చిత్రం: కాశ్మీర్‌కి కలీ (1964)

రచన: యస్.హెచ్.బిహారీ  గానం: రఫీ, ఆశాభోస్లే

అ : ఓ... ఆ....
ఆ : హోయే.... ఇషారోఁ ఇషారోఁ మే దిల్ లేనే వాలే
బతాయే హు నర్ తూనె సీఖా కహాసే
అ : నిగాహోఁ నిగాహోఁ మె జాదూ చలానా
మెరీ జాన్ సీఖాహై తుమ్ నే జహాసే
అ : ఓ మెరే దిల్ కో తుమ్ ఛాగయే మెరీ క్యాథీ ఇస్‌మే ఖతా
ముఝే జిస్‌నే తడ్‌పా దియా యహీ థీ వో జాలిమ్ అదా
యహీ థీ వో జాలిమ్ అదా
యే రాజాకీ బాతేఁయే మజ్లాకే కిస్సే
అలగ్ తో నహీ హై మెరీ దాస్తా సే  ఆ: ॥ఇషారో॥
అ : హో మొహోబ్బత్ జో కర్ తే హై హమ్
మొహోబ్బత్ జతాతే నహీ
ధడ్ కనేఁ అప్ నే దిల్ కీ కభీ
కిసీ కో సునాతే నహీ  కిసీ కో సునాతే నహీ
మజా క్యా రహా జబ్‌కీ ఖుద్ కర్ దియా హో
ముహబ్బత్ కా ఇజ్‌హార్ అప్ నీ జుఁబాసే  అ: ॥నిగాహో॥
అ : హో మానాకే జానే జహా లాఖోఁ మె తుమ్ ఏక్ హో
హమారీ నిగాహోఁ కీ భీ కుఛ్ తో మగర్ దాగ్‌దో
కుఛ్ తో మగర్ దాగ్‌దో
బహారోఁ కో భీ నాజ్ జిస్ ఫూల్ పర్ థా
వోహీ ఫూల్ హమ్‌నే చునా గుల్ సితాసే  ఆ : ॥ఇషారో॥

**మంచిపాటకి, కమర్షియల్ పాటకి నిర్వచనం వేరు అయిపోతోంది - ఆ రెండూ ఒకే పాటలో ఉండడం సాధ్యమేనని ఆ రోజుల్లో నిరూపించిన పాట యిది. అందుకు సాక్ష్యం నలభై ఏళ్ళగా వన్నె తగ్గని తనమే! ఈ పాటలో సితార్‌కి, తార్‌షెనాయ్‌కి మంచి ప్రాధాన్యత ఉంది. సితార్ గురించి అందరికీ తెలుసు. కానీ తార్‌షెనాయ్ గురించి శ్రోతలలో అవగాహన తక్కువ. ఆ వాద్యం వాయు పూరకమైన షెహనాయ్‌లా ధ్వనిస్తుంది. కానీ తీగపై కమాన్‌తో పలికించాల్సి ఉంటుంది. ఆ తార్‌షెనాయ్ పలికితే ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే ఈ పాట రెండో చరణం (ఓహ్ మొహబ్బత్ జో కర్‌తే హమ్)ని పూర్తిగా వినండి. లైను లైనుకి మధ్య ఇంటర్‌లూడ్‌లా వినిపిస్తుంటుంది.**

## చిత్రం: మేరే సనమ్ (1965)

రచన: మజ్రూహ్ సుల్తాన్‌పురి  గానం: ఆశాభోస్లే

జాయియే ఆప్ కహా జాయేంగె
ఏ నజర్ లౌట్‌కె ఫిర్ ఆయేగి
ఏ నజర్ లౌట్‌కె ఫిర్ ఆయేగి
దూర్ తక్ ఆప్ కె పీఛే పీఛే
దూర్ తక్ ఆప్ కె పీఛే పీఛే
మేరి ఆవాజ్ చెలీ జాయేగి  ॥జాయియే॥
ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...
ఆప్ కో ప్యార్ మెరా యాద్ జహా ఆయేగా
కోయీ కాంటా వోహి దామన్ సె లిపట్ జాయేగా
కోయీ కాంటా వోహి దామన్ సె లిపట్ జాయేగా॥జాయియే॥
జబ్ వుఠోగే మెరి బేతాబ్ నిగాహో కి తరాహ్
రోక్ లేంగి కోయి డాలి మెరి బాహోంకి తరాహ్ (2) ॥జాయియే॥
దేఖియె చైన్ మిలేగా న కహి దిల్ కె సివా
ఆప్‌కా కోయి నహి, కోయి నహి దిల్ కె సివా (2) ॥జాయియే॥

## చిత్రం: నీరాజనం (1989)

రచన: సి.నారాయణరెడ్డి  గానం: బాలు, జానకి

నిను చూడక నేనుండలేను (2)
ఈ జన్మలో మరి ఆ జన్మలో (2)
ఇక ఏ జన్మకైనా ఇలాగే...  ॥నిను॥
ఏ హరివిల్లు విరబూసినా నీ దరహాసమనుకుంటిని
ఏ చిరుగాలి కదలాడినా నీ చరణాల శృతి వింటిని
నీ ప్రతిరాకలో ఎన్ని శశి రేఖలో (2)  ॥నిను చూడక॥
నీ జత గూడి నడయాడగా జగమూగింది సెలయేరుగా
ఒక క్షణమైన నిను వీడినా మది తొణికింది కన్నీరుగా
మన ప్రతి సంగమం ఎంత హృదయంగమం (2)
ఆ: ॥నిను చూడక॥

## చిత్రం: ఫిర్ వోహీ దిల్‌లాయాహూ(1963)

రచన: మజ్రూ సుల్తాన్‌పురి  గానం: రఫీ

లాఖోం హై నిగాహ్‌మె జిందగికి రాహ్‌మె సనమ్ హసీన్ జవా
హోటోంమె గులాబ్ హై అంఖోమె శరాబ్‌హై
లేకిన్ వో బాత్ కహా  ॥లాఖో హై॥
లట్ హై కిసీకీ జాదుకా జాల్ రంగ్ డాలె దిల్‌పె కిసీకా జమాల్
తౌబా ఏ నిగాహె, కె రోక్‌తీ హై రాహె (2)
దెఖొ లేలేకె తీర్ కమాన్ హోయ్  ॥లాఖో ॥
జానూన దీవానా మై దిల్‌కా కౌన్‌హై ఖయాలోంకి మలికా (2)
భిగి భిగి రుత్‌కి ఛావో తలె మాన్ లో కహి వో ఆన్ మిలె (2)
కైసె పెహచాను, కి నామ్ నహీ జాను (2)
కిసె ఢూంఢె మెరె అరమాన్  ॥లాఖో॥
కభి కభి వో ఏక్ మాహ్ జబి డోల్తి హై దిల్ కె పాస్ కహి (2)
హైజో యహీ బాతే తో హోంగి ములాకాతే  ॥హైజో॥
కభి యహా నహితో వహా... హోయ్ ॥లాఖో హై నిగాహ్ మె॥

## చిత్రం: సావన్ కి ఘటా (1965)

రచన:యస్.హెచ్.బిహారి  గానం: ఆశాభోస్లే

హోల్లే హోల్లే సాజనా ధీరె ధీరె బాల్‌మా
హోహోహో ఊఁ ఊఁ ఊఁ
జర హోల్లే హోల్లే చల్లో మొరే సాజ్‌నా
హమ్‌భీ పీఛే హై తుమ్హారె  ॥జర॥
కైసి భీగి భీగి ఋత్ హై సుహాని కైసే ప్యారే నజారే  ॥జర॥
పడ్‌గయీ జనాబ్ మైతో ఆప్‌కే గలే
అబ్‌తో నిభాయే బగైర్ నచలే  ॥పడ్॥
ప్యార్‌కె సఫర్ మె హోతేహి రహేంగె జగ్‌డే హజార్ సనమ్
ప్యార్‌కె దివానె చల్తేహి రహేంగే ఫిర్‌భి మిలాకె కదమ్ సజ్‌నా
హోతేహి రహేంగె మీఠి నజర్ కె మీఠి మీఠే ఇషారె  ॥జర॥
దేఖ్‌లీ హుజూర్ మైనే ఆప్‌కి వఫా
బాతోంహి బాతోంమె హోగయీ కఫా  ॥దేఖ్‌లీ॥
దిల్‌కొతో దిల్‌బర్ లేహిచుకీ హు దిల్‌కో కరానలో
ముఝే మేరా ప్యార్ దో
దునియా తవార్‌దో
లేనేకి బాత్ కరో సజ్‌నా
తుమ్ జో నహితో కైసే లగేగీ
జీవన్ నయ్యా కినారె  ॥జర॥



# బాపు విశ్వరూపం 4

**బా**పు అనగానే అందమైన అమ్మాయిల బొమ్మలు, దేవుళ్ల బొమ్మలు మాత్రమే గుర్తుకువస్తాయి కొందరికి.

కథ సబ్జక్ట్ బట్టి, సందర్భం వచ్చినప్పుడు బాపు సమాజం పట్ల తన అవగాహనను తెలియపరచారు. పేద ప్రజల నిర్భాగ్యపు బ్రతుకులకు కుంచెతో రూపం కల్పించారు. క్రింద నిచ్చిన ఉదాహరణలు చూడండి. అవే ఆయిల్‌పెయింటింగులుగా అంతర్జాతీయ కాన్వాస్‌కి ఎక్కి ఉంటే ప్రపంచ ప్రఖ్యాతులయ్యేవారు బాపు. ఎందుకంటే లిపికి పరిమితులున్నాయి. చిత్రానికి లేవు. విశ్వంలో ఏ మూలనున్న పేదవాడి కైనా ఆకలి బాధ, ఆకలి భాష ఒక్కటే! ఈ బొమ్మలతో ఐడెంటిఫై చేసుకుంటాడు.

ఈ జనవరి 26 కు భారత్ రిపబ్లిక్ ఏర్పడి 53 ఏళ్లు కావస్తోంది. అయినా అకలిచావులను మట్టుపెట్టలేకపోయాం. సమాజంలోని హీనుల, దీనుల దురవస్థ గురించి వేదికలెక్కి ఉపన్యసించకపోయినా, వ్యక్తిగత సంభాషణలలో బాపు గారు ఎంతో ఆవేదన వ్యక్తపరుస్తారు. చిన్నపిల్లలకు వీడియోపాఠాలు వంటి కష్టతరమైన ప్రాజెక్టు బాపు, రమణలు అంగీకరించడానికి కారణం - వారికి సమాజ స్థితిగతుల పట్ల గల ఆవేదనే!

ఎంతటి ఆవేదన లేకపోతే ఈ చిత్రాలు రూపుదిద్దుకునే వంటారు !?







ఒకదాంట్లో ఓ పేదవాడు కొరతవేయబడి వున్నాడు. అతను శిలవ ఎక్కినది మన పాపాలకోసమే! ( స్వామి వివేకానంద చెప్పినదే!) అతని స్థితిగతులపట్ల మనం చూపిన నిర్లక్ష్యం వల్లనే! మరొక చిత్రంలో తనను కబళించజూసే విషసర్పం తో పోరాడుతున్నాడు. అది నిత్య సంఘర్షణ! ఆ ఆట ఆపేందుకు వీలులేదు. వదిలిపెట్టినా ఆ చిలువ అతన్ని మ్రింగకమానదు. ఆ చివర పేదలు ఎక్కువగా నమ్ముకునేది భూమినే. ఆర్థిక కారణాల వల్ల స్వంతదారులు ఆ భూమిని పంచుకున్నప్పుడు దాని వల్ల నష్టపోయేది ఎవరో వేరే చెప్పాలా?









ఈనాటి పౌరుడి స్థితి చూడండి. ఖాళీ కడుపుతోనే జీవితాన్ని ఈడ్చుకు వచ్చేస్తున్నాడు.ఆ చివర రేపటిపౌరుడి ఈ నాటి దుస్థితి. వేరే ఎక్స్‌రేలు అక్కరలేదు. సూర్యకాంతి చాలు అతను నడిచే అస్థిపంజరం అని చూపడానికి. మధ్యలో ధనికులు పేదలను హింసించే విధం చూడండి. కొందరికి పేదల రక్తం రెడ్‌వైన్ అయితే, మరి కొందరికి వారి కళేబరాలు పులిగోరు పతకాలు!

నాలుగు దశాబ్దాల నాటి మాట ఇది. బొంబాయిలోని లెక్కలేనన్ని దారూ ఖానా (మద్య విక్రయ కేంద్రం)ల్లో అదొకటి. దాని యజమానికి ఒకటే సినిమా పిచ్చి. ఎప్పటికైనా తాను ఓ సినిమా తీస్తాననే ఆకాంక్ష అతనిలో బలంగా ఉండేది. అందుకేనేమో సినిమా వాళ్లంటే అతనికి మహా అభిమానం. సినీరంగంలో అడుగుపెట్టాలని వచ్చిన అనేక మంది ఔత్సాహికులకు ఆ దారూఖానా అడ్డా అయింది. వారందరికీ ఆ యజమాని ఉచితంగా మద్యం పోసేవాడు. అక్కడికొచ్చే వారిలో సుభాష్ ఘాయ్, శత్రుఘ్నసిన్హా వంటి వారున్నారు. వారంతా తరువాతి కాలంలో బాలివుడ్ సినీ ప్రముఖులై పోయారు. అలా అక్కడికి వచ్చేవారిలో 19 ఏళ్ల కుర్రవాడు ఉన్నాడు. అతను టికెట్‌కి డబ్బులు లేక మధ్యప్రదేశ్ నుండి రైల్లో టీ.సీ.ని బతిమాలి బొంబాయికి వచ్చాడు. ఓ సత్రం యజమానిని బతిమాలి ఉచిత నివాసం ఏర్పరచుకున్నాడు. అతను ప్రసిద్ధ ఉర్దూ కవి జన్ నిసార్ అక్తర్ కుమారుడు. తండ్రిలాగే తన భావోద్వేగాలకు అక్షర రూపమిచ్చి కవిత్వం రాయనారంభించాడు. ఆకలి, ఆశయం, ప్రేమ, ఏకాంత వేదన, దుఃఖంను అత్యంత హృద్యంగా కవిత్వీకరించేవాడు. అయితే అంత త్వరగా సినిమాకు రచనలు చేసేందుకు అతనికెవ్వరూ అవకాశమివ్వలేదు. ఎలాగైనా సినిమాలకు పనిచేయాలని కమాల్ అమ్రోహి స్టూడియోలో క్లాపర్ బాయ్‌గా చేరాడు. ఒకరోజు అతనికి ఓ మూల 'పాకీజా' చిత్రానికి వాడిన దుస్తులు, లభించిన అవార్డులు కనిపించాయి. ఆనందోద్వేగాలతో వాటిని చేతుల్లోకి తీసుకున్న ఆ కుర్రవాడు నేనూ భవిష్యత్తులో ఇలాంటి ఉన్నత దశకు చేరుకోగలనా అని మనసులోనే అనుకున్నాడు.అతని కలలు త్వరలో నిజమవుతాయని అతనికి తెలియదు. నాటి ఆ పిల్లవాడే సుప్రసిద్ధ సినీ స్క్రిప్ట్ రచయితగా, గేయ రచయితగా ఎదిగిన "జావేద్ అక్తర్".

జనవరి 17న జావేద్ అక్తర్ 58వ జన్మదినం సందర్భంగా...



క్రియేటివ్ సినీరైటర్

# జావేద్ అక్తర్

**1945** జనవరి 17న గ్వాలియర్‌లో జన్మించారు జావేద్. ఆయన పుట్టిన మరుక్షణమే కొడుకు పుట్టాడన్న వార్త వినగానే నిసార్ అక్తర్ తన మిత్రులతో కలిసి ఆసుపత్రికి వెళ్లాడు. ముస్లిం కుటుంబాల్లో శిశువు పుట్టగానే చెవిలో ఆజాన్ చదివి వినిపిస్తారు. కానీ జావేద్ చెవిలో అతని తండ్రి కమ్యూనిస్టు మానిఫెస్టోలోని ఓ పేరాను చెవిలో చదివి వినిపించారు. ఈ సంఘటనే అతనిని నాస్తికత్వం, అభ్యుదయం వైపు మళ్లించింది. భోపాల్‌లోని సోఫియా కాలేజ్‌లో చదువుకున్నారు జావేద్ అక్తర్.

కవిత్వంతో కలం యాత్ర ప్రారంభించిన జావేద్ అక్తర్ తండ్రి గొప్ప కవి. వారి ఇల్లే ఓ పెద్ద గ్రంథాలయం. కె.ఎ.అబ్బాస్ "ఇంక్విలాబ్" గోర్కి "అమ్మ", గోగోల్, చెకోవ్, పుష్కిన్, కిషన్ చందర్, రాజేందర్‌సింగ్ బెడి, ఇస్మత్ చుగ్తాయ్ వంటి వారి రచనలు చదివి సాహిత్యాభిలాషను పెంచుకున్నారు. సినీరంగంలో తన అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు 1964 అక్టోబర్ 4న బొంబాయిలో కాలుమోపిన ఆయన తొలుత కమాల్ అమ్రోహీ వద్ద నెలకు 50 రూపాయల వేతనంపై క్లాపర్ బాయ్‌గా కుదిరారు. 1965లో ఎస్.ఎం. సాగర్ వద్ద అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరారు. సాగర్ తీసిన "సర్ హది లుటేరా" చిత్రానికి స్క్రిప్ట్ రైటర్‌గా కుదిరారు. ఈ చిత్రంలో హీరో సలీంఖాన్. ఆనాటి పరిచయం తరువాత జావేద్ సలీంతో కలిసి "సలీం-జావేద్"గా జోడి రచయితలుగా కొనసాగాలనుకున్నారు.

సలీంతో కలిసి జావేద్ తొలుత బి-గ్రేడ్ సినిమాలకు పనిచేయడం ప్రారంభించి 60 దశకాంతం నాటికి తమ ప్రతిభను నిరూపించుకుని ఇండస్ట్రీలో స్థిరపడ్డారు. 1970 దశకంలో తమ కలం పదునుతో అద్భుతమైన పాత్రలను సృజించారు. రాజేష్‌ఖన్నా నటించిన 'హాథీమేరా సాథీ'



"హవాహవాయీ" (మిస్టర్ ఇండియా) పాటతో
గేయ రచయితగా జావేద్ హవా ప్రారంభమయింది.



భార్య శబానా ఆజ్మీతో

సూపర్‌హిట్‌తో ఎదురులేకుండా పోయింది.

పోతే హిందీ సినీ సీమలో అమితాబ్ ఫెనామినా సృష్టించింది సలీం-జావేద్ లే. "షోలే", "జంజీర్", "దీవార్" చిత్రాలు అమితాబ్‌కు స్టార్‌డమ్ కల్పించి పెట్టాయి. దీవార్‌లోని, 'విజయ్', జంజీర్‌లోని 'తేజ' షోలేలోని 'గబ్బర్‌సింగ్' పాత్రలు నేటికి సినీ అభిమానులకు మరుపురావు. అమితాబ్ ఒక సందర్భంలో నా 'నటనా జీవితంలో రెండవ దశలో సలీం-జావేద్‌ల రచనలతో తయారైన చిత్రాలతోనే పైకెదిగాను.అయితే వారిద్దరూ విడిపోవడం నా కెరీర్‌కు ఇబ్బంది కలిగింది. ఎందుకంటే వారిద్దరూ శక్తివంతమైన రచయితలు' అని పేర్కొన్నారు. సలీంతో కలసి జావేద్ ఇంకా 'అందాజ్', 'సీతా ఔర్ గీతా', 'ఆభీదావ్', 'యాదోంకి బారాత్' చిత్రాలకు రచన చేసి 1980లో వారిరువురూ విడిపోయారు. ఆ తరువాత సలీం 'నామ్' వంటి చిత్రాలకు రచన చేసినా రాణించలేక పోయారు.

కాగా జావేద్ సినీ రచనా జైత్రయాత్ర నిరాటంకంగా కొనసాగింది. త్రిశూల్, మషాల్, శక్తి, విధాత (1982), సిల్‌సిలా, అర్జున్, బేతాబ్, మిస్టర్ ఇండియా, స్వర్గ్ సె సుందర్, మై ఆజాద్ హూ, చివరిసారిగా 'ప్రేమ్' చిత్రానికి స్క్రిప్ట్ సమకూర్చారు. అయితే జావేద్ అక్తర్ 'మిస్టర్ ఇండియా' చిత్రం నుండి గేయరచయితగా కొత్త అవతారం ఎత్తి సంచలనం సృష్టించారు. శ్రీదేవిపై చిత్రీకరించిన "హవాహవాయి" పాట ఓ సంచలనం. ఆ తరువాత తేజాబ్‌లో "ఏక్ దో తీన్" పాటతో మాధురీ దీక్షిత్ కూడా నెంబర్‌వన్ స్థానానికి చేరుకుంది. తరువాత "దర్మియాన్"లో టాబు కోసం ఓ పాట రాశారాయన.

గజిబిజి పదాల అల్లికలే డిమాండ్ కలిగి ఉన్న నేటి కమర్షియల్ సినీ రంగంలో నిలద్రొక్కుకోగలిగిన జావేద్ అక్తర్ "కళాత్మక, కమర్షియల్ చిత్రాల మధ్య అగాధ ముందనుకోను. కమర్షియల్ సినిమా కమర్షియల్‌గానే ఉండాలి. అయితే సృజనాత్మక, సౌందర్యాత్మక విలువల పట్ల నాకు గౌరవం ఉంది" అంటారు. అందుకే వ్యాపార సినిమాల్లో ఆయన రాసిన పాటల్లో ఆశ్లీలత, అనభ్యత ఉండవు. జీవితంలోని అన్ని కోణాల పట్ల ఆసక్తి చూపి అప్పుడప్పుడూ ఆహ్లాదాన్ని కూడా కోరుకునే సంపూర్ణ మానవుడి కోసమే కళ" అంటారాయన.



'దీవార్'లో అమితాబ్, ఇఫ్తికర్

హిందీ తెరపై యాంగ్రీ యంగ్‌మన్‌కు ప్రాణ ప్రతిష్ట చేసినది సలీమ్-జావేద్‌లే.

అయితే 1994 లో "1942 ఎ లవ్ స్టోరీ" చిత్రంలో రాసిన పాటలు హిట్ అవడంతో ఒక్కసారిగా చేవచ్చిన హిందీ సినీ పాటకు కొత్త జవజీవాలు ఏర్పడినవి. "ఏక్ లడ్‌కీ కో దేఖా తో ఐసా లగా" పాట ఆయనను ఒక్కసారిగా టాప్ లిరిక్ రైటర్‌ను చేసింది. 1942 ఎ లవ్ స్టోరీలోని మూడు పాటలు ఆయన ట్యూన్స్‌ను అనుసరించి రాశారు. 1942 ఎ లవ్ స్టోరీ తరువాత "పాపాకహతేహై" సినిమాలోనూ ఈయన రాసిన పాటలు ఆయా చిత్రాల విజయానికి కారణమైనవి. నిజానికి కూడా ఈ రెండు చిత్రాల తరువాత హిందీ సినిమాల్లో పాటల స్థాయి పెరిగి చెత్త పాటల రాక ఆగిపోయింది. ఇలా పాటల రచయితగా సినీరంగంలో కొత్త ధోరణులను పాదుకొల్పడం జావేద్ వల్లనే సాధ్యమైంది.

'నామ్' లోని 'చిట్టీ ఆయీ హై', 'హకీకత్' లోని 'హోకె మజ్‌బూర్ ముఝె బులాయా హోగా', బోర్డర్' లోని 'సందేసే ఆతే హై', ఔర్ ప్యార్ హోగయా, విరాసత్, సప్నే, సాజ్, దస్తక్, కభీ న కభీ, డుప్లికేట్, 'దిల్‌జలే', తదితర చిత్రాల్లోని "చందారే చందారే కభీతో జమీపర్ ఆ...బైఠేంగే బాత్ కరేంగే" "ప్యార్ హువా చుప్‌కేసే...ఏ క్యాహువా చుప్కేసే"(1942 ఎ లవ్ స్టోరీ) వంటి అద్భుతమైన పాటలు రాశా రాయన.

యాష్‌చోప్రా నుండి మొదలుకుని శ్యాంబెనెగల్, శంకర్ జైకిషన్, రమేష్ సిప్పి, ఆర్డీబర్మన్, నేటి ఎ.ఆర్.రహమాన్‌ల దాకా తన కలం బలంతో ఇండస్ట్రీలో కొనసాగుతున్న సినీ కవి జావేద్. ఇంకా విచిత్రమేమిటంటే "1942 ఎ లవ్ స్టోరీ"లోని 'ఏక్ లడ్ కీ...' పాట విడుదలైన తొలినాళ్లలో దీనికి సాహిత్యం అల్లింది ఓ 50 ఏళ్ల వ్యక్తి అంటే ఎవరూ నమ్మ లేదు. నడివయసులోని మీరు-ఈ పాటలు ఎలా రాయగలిగారంటే ఆయన



జావేద్ పాటలతో అలంకరించిన '1942-ఎ లవ్ స్టోరీ'లో అనిల్‌కపూర్, మనీషా కొయిరాలా

నవ్వుతూ "నేను ఓ ముప్పై ఏళ్లు వెనుక్కు వెళ్లి రాశానంతే" నంటారు.

1970 నుండి నేటిదాకా ఆయన ఏటా ఏదో ఒక అవార్డు అందు కుంటూనే ఉన్నారు. 1997లో "ఘర్ సె నికల్ తీ..." పాటకు ఫిలింఫేర్ అవార్డు అందుకున్నారు. 1995లో "1942 ఎ లవ్ స్టోరీ" చిత్రానికి గాను "ఫిలింఫేర్", జాతీయ స్థాయిలో ఉత్తమగేయ రచయిత అవార్డులను అందు కున్నారు. పాడిన కుమార్‌సానూకూ జాతీయ అవార్డులు వచ్చాయి. 1999లో "పద్మశ్రీ"తో భారతప్రభుత్వం సన్మానించింది. 1976లో ఢిల్లీలో జరిగిన చలన చిత్రోత్సవంలో సలీం-జావేద్‌లు రాసిన 'షోలే' గురించి ప్రసిద్ధ దర్శకులు రే వ్యాఖ్యానిస్తూ ఇటువంటి అద్భుత చిత్రం నిర్మితమవడం భారతదేశానికే గర్వకారణం అని ప్రశంసించారు. తన పాటలతో ఎందరో తారలను హీరో, హీరోయిన్లుగా మలచిన ఘనత ఆయనకే దక్కుతుంది. స్క్రిప్ట్‌రైటర్‌గా తూటాల్లాంటి మాటలతో, నరాలు బిగుసుకుపోయే సన్నివేశాలతో, పగ ప్రతీకారం మార్కు కధలతో భారతదేశంలో ఒక తరాన్ని పూర్తిగా ప్రభావితం చేసిన జావేద్ మారుతున్న ప్రేక్షకాభిరుచికి అను గుణంగా తన బాణీని మార్చుకుని నవతరాన్ని ఆకట్టుకుంటున్నారు. నవ్య చిత్రా నాయిక షబానా ఆజ్మీ జావేద్ అక్తర్ శ్రీమతియేననేది విదితమే.

హిందీ సినీ పాటకు సాహితీ విలువల సొబగులద్దిన సాహిర్, శైలేంద్ర, అంజాన్, ఇందీవర్, అసద్‌భోపాలి వంటి కవులకు ఒక మేలైన కొసమెరుపుగా చెప్పుకోదగిన వారు జావేద్ అక్తర్.

**- హెచ్.రమేష్‌బాబు**

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లి లేదు. తండ్రి అప్పులు చేశాడు. చెల్లెలు మీనా కాపురం చిక్కుల్లో పడింది. అజయ్‌కి బాల్యంలోనే తల్లి, ఇటీవలే తండ్రి పోయాడు. మేనేజర్ భానోజీదే పెత్తనమంతా. ఒక సంవత్సరం పాటు తమతమ స్థానాలను మార్చుకుని పరిస్థితులను ఎదుర్కోవాలని ఇద్దరూ నిశ్చయించుకుంటారు. మీనాను అత్తవారింటికి వెళ్లి బావ బుజ్జిని బెదిరిస్తాడు అజయ్. బుజ్జి తండ్రికి తెలియకుండా వచ్చి మీనాను కలుస్తాడు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజరు భానోజీ నగలు కాజేసాడని, దొంగ వీలునామా సృష్టించాడని కనుగొంటాడు. పరిస్థితులు అదుపులోకి తీసుకొనేంత వరకు భానోజీతో సన్నిహితంగా ఉండమని అత్తయ్య ఉపదేశిస్తుంది. (ఇక చదవండి)



అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు

సీరియల్ - నవల 9



**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

తన ఉద్యమానికి అత్తయ్య ఆమోదం, ఆశీస్సుకూడా లభ్యం కావడంతో, ఆవిడ చెప్పిన ప్రకారం స్వయంగా కూడా వ్యవహారాలు చక్కబెట్టుకోడం ప్రారంభించాడు విజయ్.

రాబడి పన్నుకోసం భానోజీగారు చేయబోయిన భారీ ఋణం మానిపించాక, ఒకనాడు విజయ్ తిన్నగా ఇన్‌కంటాక్సు ఆఫీసుకు వెళ్ళాడు. వెళ్ళేముందు, కొన్నేళ్లుగా అజయ్ తండ్రి ఎంతెంత పన్ను కట్టిందీ, వేళ ప్రకారం కట్టిందీ లేనిదీ చిఠా పుస్తకాలలో చూసుకున్నాడు.

'నేను అమెరికానుంచి తిరిగి వచ్చేసరికి, ఇన్ని చిక్కులు ఒక్కసారిగా ఎదుర్కోవలసి వచ్చింది. ఇంతవరకూ గడువుకు ముందే ఇన్‌కంటాక్సు చెల్లిస్తూ వచ్చాం. ఇప్పుడు దయచేసి కొంత వ్యవధి ఇచ్చారంటే, వాయిదాలమీద టాక్సులంతా చెల్లిస్తాను' అన్నాడు.

'ఐ అండర్‌స్టాండ్ మిస్టరజయ్‌బాబూ కానీ, ఆఖరివాయిదా చెల్లించేవరకూ మీ ఆస్తి అన్యాక్రాంతం చెయ్యనని సెక్యూరిటీ బాండు రాసివ్వాల్సి ఉంటుంది' అన్నాడు ఆఫీసరు.

'అలాగే'

'అయితే, డాక్యుమెంటు తయారు చేయించి తెప్పిస్తాను, సంతకం చేసి వెడుదురుగాని.'

విజయ్ సందిగ్ధంలో పడ్డాడు. బాండు రాసేముందు అజయ్‌కి చెప్పాలి. ఇలాంటి ముఖ్యపత్రంపైన, అతని సంతకం అతనే పెట్టడం మంచిది. తను చేస్తే అది అపరాధం కావచ్చు...

'మా లాయర్ని కూడా కన్సల్టుచేసి రేపు ఉదయం వస్తాను' అన్నాడు.

* * *

'మా లాయరు' గారు మాంఛి హుషారుగా ఉన్నారు. ఆయన కొత్త జీవితంలో కొత్త సమస్యలతో ఆడుకుంటున్నారు. ఒక్కొక్కటే గెలుచుకుంటున్నారు.

తను 'మెట్టిన' ఇంటిని ఆనంద పరచడంతో ఆనందం పొంది, పుట్టినింటిని, దాని గొడవలను పూర్తిగా మర్చిపోయారు. చదివిన చదువు సార్థకం అయ్యేలా పనిచేస్తున్నారు.



బి.కామ్ చదివిన విజయ్ ఎలాంటి ఉద్యోగాలు వెదకి, ఏవి దొరక్క నిస్పృహ చెందాడో తెలీదుగాని, లక్షాధికారి అజయ్‌బాబూ, అమెరికా వెళ్ళి ఆటోమొబైల్ ఇంజనీరింగ్ చదివిన అజయ్‌బాబూ అయిదారొందలు జీతం అందుకునే అర్హతగల అజయ్‌బాబూ అవసరాన్ని బట్టి, ఆపద గడవడానికి, ఒక చిన్న గరాజ్‌లో వంద రూపాయల మెకానిక్ ఉద్యోగం చేపట్టడానికి వెనుకాడలేదు. అది గౌరవ హాని అనుకోలేదు. పైగా తన కుటుంబం వీధిన పడకుండా గౌరవం కాపాడుతున్నది అదేనని నమ్మి అనందించాడు.



హడావుడిగా ముస్తాబవుతున్నాడు అజయ్. ఝూమ్మని ఈల పాట పాడుకుంటున్నాడు. మీనా లోపల వంట చేస్తోంది.

'మీనా! అయిపోయింది టైము. కారేజీ ఏది?'

'సర్దేస్తున్నాను అన్నయ్యా! ఒక్క క్షణం' అంది మీనా.



గుమ్మంలో కారు హారన్ వినపడి, అజయ్ వీధిలోకి తొంగి చూశాడు. తానెరిగున్న స్వరం, తానెరిగున్న

కారు ఒక్కసారిగా ఆశ్చర్యపోయి వచ్చి, ఆనందపడి లేచి వీధిలోకి పరుగెత్తాడు. తన కారు, తన మాజీ దుస్తుల్లో తన మిత్రుడు.



'హల్లో! విజయ్ ఏమిటిలా వూడిపడ్డారు? ఇంటిమీద బెంగ పెట్టుకున్నారా?' అన్నాడు అజయ్ ఉత్సాహంగా నవ్వి.

విజయ్ ఒక్క క్షణంసేపు అజయ్‌ని తేరిపార చూశాడు... తను తన యింట్లో వున్నప్పుడు ఇంత ఉత్సాహంగా ఎన్నడూ లేడు. ఎక్కడిదీ ధైర్యం? ఎక్కడిదీ ఉత్సాహం?...

'బెంగ గాదు. పెద్ద చిక్కులో పడ్డాను' అన్నాడు తేరుకుని.

అజయ్ కొంచెం ముందుకు వంగాడు.



కారులో విజయ్ తన ఫెల్ట్‌హేట్ ఇంకొంచెం కిందికి లాక్కున్నాడు. ఎవరైనా హఠాత్తుగా ఇద్దరినీ చూసి కెవ్వుమనకుండా.

'ఇన్‌కంటాక్సు, వాయిదాలమీద చెల్లించేందుకు పర్మిషన్ తెచ్చాను. సెక్యూరిటీ బాండుమీద సంతకం పెట్టమన్నారు. నేను సంతకం చేస్తే తేడా తెలిసిపోవచ్చు' అన్నాడు నెమ్మదిగా.

'దానికేముంది! గప్‌చిప్‌గా నేనే వెళ్ళి సంతకం చేసి వస్తాను' అన్నాడు అజయ్.

'తప్పదు మరి. అందుకే మీకు అజయ్‌బాబు డ్రెస్ తెచ్చాను' అంటూ ఒక చిన్న సూట్ కేసు అందించాడు విజయ్.



అజయ్ ఆ పెట్టి తీసుకుంటూ నవ్వాడు.

'అయితే, అజయ్‌బాబూ! దారిద్ర్యపు జీవితం ఎలా వుంది?' అన్నాడు విజయ్.

అజయ్ పకాలున నవ్వాడు-విజయగర్వంతో నవ్వాడు. 'సగం దరిద్రం తీరిపోయింది. ఇప్పుడు శ్రీవారు ఉద్యోగం చేస్తున్నారు. ఉద్యోగం-కృష్ణా గరాజ్ వర్క్సులో మెకానిక్' అంటూ సగర్వంగా తన ఖాకీ చొక్కాను మరోసారి సర్దుకున్నాడు.

"బాగుంది. అక్కడ అంత ఐశ్వర్యం పెట్టుకుని, ఇక్కడ మెకానిక్‌గా పనిచేస్తున్నారన్నమాట. మిమ్మల్ని చూసి సంతోషించాలా? జాలిపడాలా?" అన్నాడు విజయ్-బాధను నిట్టూరుస్తూ.

"కాదు; అభినందించాలి. అమెరికాలో మూడేళ్ళు ఇంజనీరింగు చదివాను. ఎందుకు వృథాపోవాలి?"

"కొడుకు ప్రయోజకుడయ్యాడని మా నాన్న సంతోషిస్తున్నాడా?'' అన్నాడు విజయ్.



అజయ్ నవ్వాడు. ''ఆహా! ఇదంతా ఆ శ్రీరాముని దయ చేతను అంటాడు. ఉద్యోగం ధర్మమా అని భక్తులకు ప్రసాదాలు ఘనంగా అందుతున్నాయి''

విజయ్ ఏదో అనబోతూ ఉండగా, "అన్నయ్యా" అంటూ మీనా వీధిలోకి వచ్చింది. విజయ్ తన టోపి కిందకి దించుకుని తలవంచేసుకున్నాడు.



"ఇక్కడున్నావా. అయిదు నిమిషాలు ఆగావంటే భోజనం వడ్డిస్తాను" అంది మీనా.

దీపంలా వెలిగిపోతున్న చెల్లెల్ని చూసి విజయ్ హృదయం ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

"లేదమ్మా. జమీందారు గారు వచ్చారు. అర్జంటుగా కారు రిపేరు చెయ్యాలట. భోజనం కారియర్‌లో నువ్వే తీసుకురా. ఈ సూట్‌కేసు లోపల పెట్టు. బావ వస్తేనే వచ్చేదాకా ఉండమనూ. మాట్లాడాలి. మీ కబుర్లలో చెప్పటం మర్చిపోయావ్'' అన్నాడు అజయ్.



"పో అన్నయ్యా" అంటూ, సిగ్గుతో లోపలికి పరుగెత్తింది మీనా.

"అజయ్! అయితే, చెల్లెలి కాపురం సరిదిద్దారన్నమాట. మీ మేలు మర్చిపోలేను. నా జీవితాంతం మీకు ఋణపడి వుంటాను. నిజంగా మా చెల్లెమ్మ అదృష్టవంతురాలు" అన్నాడు విజయ్.

"నో, నో! మీ చెల్లెలు కాదు. మా చెల్లెలు. ఇప్పుడు మీనా ఎంత ఆనందంగా ఉందనుకున్నారు?"

"ఉండదూ మరి? ఇంతమంచి అన్నయ్య దొరికాక-" అన్నాడు విజయ్.

అంత మంచి చెల్లెలు దొరకడం వల్ల అజయ్ ఎంత ఆనందపడుతున్నాడో, దానివల్ల అతని జీవితంలో అలవాట్లలో, దృక్పథాలలో ఎన్ని మార్పులు వచ్చాయో అజయ్‌కే తెలుసు.

మొన్నటిదాకా ఆస్తి లావాదేవీల చిక్కులు తప్పించుకుందికి, చుట్టూ వున్నవారు తవ్వే గోతులకు దూరంగా ఉండడానికి, భ్రాంతీ, బ్రాందీ సేవించేవాడు. ఇప్పుడు జీవితం పట్ల, కాయకష్టం పట్ల, కష్టపడితే వచ్చేఫలితం పట్ల, తోటి మనుషుల పట్ల గౌరవం ఏర్పడింది. ఆత్మవిశ్వాసం బలపడింది. పగటి కలలలోకి పారిపోయే దురలవాటు పోయింది. చేతగాని వేళ బ్రాంది సేవించే అలవాటు కూడా పోయింది. కొత్తలో ఒకటి రెండు రోజులు బుద్ధి.... బార్ రూముల మీదికి షికారెళ్ళింది కాని, చేత డబ్బు లేదు. ధరలు ఆకాశాన్నంటాయి.... ప్రొహిబిటివ్ రేట్స్ అన్న మాటకి కొత్త అర్థం తోచింది. నవ్వుకున్నాడు. పైగా తను ఆ రొంపిలో పడితే తన చెల్లెలు మీనా, తండ్రి దాసుగారు-ఇక తలెత్తుకుంటారా! తన మొహం చూస్తారా అని భయం వేసింది. అసహ్యం కలిగింది. వాళ్ళ జీవితం బాగుచేయబోయి తన జీవితం కూడా బాగుచేసుకున్నాడు...

మొత్తం మీద బాగు చెయ్యడమే అతని నిత్య వ్యాసంగం అయిపోయింది. కృష్ణా గరాజ్ వర్క్సులో కార్లు, ఆటోలు అయితేనేం, ఇటు జీవితాలయినేం-మరమ్మతు వ్యాసంగం. లొంగని సమస్య అంటే మరీ సరదా. దాన్ని జయించి, దానిమీద సవారి చేసేదాకా ఊరుకోడు.

రెండు రోజుల్నించి అతనికి లొంగక తిప్పలు పెడుతున్న తాజా సమస్య ఒక డొక్కు ఆటోరిక్షా. లొంగకపోవడానికి దానికి చాలా బలం వుందని కాదు. మరీ శిథిలం అయిపోయింది. ఈ పక్క తంతే, ఆ పక్క రేకు ఊడేలా వుంది.




ఫోర్మన్ "విజయ్", తన కింది వర్కర్లకు పనులు పురమాయిస్తూ, నలహాలిస్తూ హోరాహోరీగా ఆటోతో కుస్తీ పడుతున్నాడు. కొంచెం అవతలగా ఓ లారీ మీద పనిచేస్తున్న ప్రకాష్ అటొచ్చి చూసి నవ్వాడు. "ఇంకా ఈ కీలు గుర్రంతోనే తంటాలు పడుతున్నావా విజయ్?" అంటూ.

"గుర్రం బాగానే ఉంది. కీళ్ళే కొంచెం లూజ్ అయ్యాయి. సరిచేశానులే" అన్నాడు అజయ్.

"అసలు నా అనుమానం, బండి కదుల్తుందా అని!"

"ఇన్‌సల్ట్ ఇన్‌సల్ట్. ఇప్పుడు ట్రయలుకి తీసుకెళ్తున్నాను చూడు. గగారిన్ అంతరిక్ష యాత్ర చేసినట్టు, హైద్రాబాదంతా ఆటో రిక్షా యాత్ర చేసి వస్తాను."

"గుడ్ లక్. వెళ్ళిరా!"

అజయ్ సీటులో కూర్చుని ఇంజన్ స్టార్టు చెయ్యబోయి, నవ్వి, 'అలాచూస్తావేం బ్రదర్. కొంచెం తొయ్యాలి మరి ఊ. ఓ చెయివేయ్" అన్నాడు.

ప్రకాష్ ఓ చెయ్యి వేశాడు. ఆటోరిక్షా, 'అంతరిక్షా' అంత హడావుడిచేసి భూనభాలదరగొట్టి ముందు దూకింది.

నైజాం స్త్రీల కళాశాల ప్రాంతానికి వచ్చేసరికి, ఆటో రిక్షా ఉత్సాహం హెచ్చించింది. స్థల మహత్యం కావచ్చు. బస్‌స్టాప్‌లో చూడచక్కని చిన్నదొకతె, ఒక్కర్తె నిలబడింది. చూడగానే, కాలేజీ పిల్ల అనిపించేలా వుంది; కాలేజీ పిల్లలు, అలా చూడగానే తమని గుర్తు పట్టేలా ఉండాలని ఉద్దేశ పూర్వకంగా ముస్తాబవుతారా అన్నది గిట్టనివాళ్ళు అడగాల్సిన ప్రశ్న. ఆ పిల్ల మాత్రం దారిన పోయే దానయ్యలు తనని రెండోమారు చూసి, ఈల వేస్తున్నారా అని గమనించే ధోరణిలో లేదు. బస్ కోసం చాలా ఆత్రంగా ఎదురుచూస్తోంది. ఇంకారాలేదని విసుక్కుంటూ ఉండకపోతే, ఆమె విశాల నయనాలు చూసినవారు "ఇవి సరోజాలే" అనుకునేవారు. ఆటో రిక్షాని చూడగానే, సరోజాలు విప్పారాయి. అందమైన చెయ్యి 'పతాకహస్తం' (భరతనాట్యం బాపతు కాదు) పట్టి అందంగా ఊగి, ఆగమని సైగ చేసింది. కాని, అది ఆమెను దాటి సాగిపోవడంతో, ఇంకో అందమైన చెయ్యి కూడా పైకిలేచి, రెండో దాంతో కలిసి చప్పట్లు కొట్టింది.



"ఏయ్... ఆటో రిక్షా" అంది ఆ పిల్ల సుతారంగా.

ఐదారు గజాల అవతల ఆటో ఆగింది. ఈమె శ్రావ్యమైన పిలుపు దానికి వినబడిందనడానికి సావకాశం లేదు. ఇంతకుముందు చూసిన దానికే ముగ్ధురాలైపోయి ఆగి ఉండాలి.



"అద్దెకు గాడీ కట్టేవాళ్ళకి అంత స్పీడేమిటి, ఆపమన్నా వినిపించుకోకుండా" అందా పిల్ల ధుమ ధుమ లాడుతూ.

రథసారథి అజయ్, అపరాధిలా తలాడించాడు. "తమర్ని చూడగానే ఠకీమని ఆపుదామనుకున్నానండి. కాని తస్సాదియ్యా. రోల్సు రాయిస్. ఆగందే. తమర్ని ఎక్కడికి తీసుకెళ్ళాలండి?" అన్నాడు చక్రల్లాంటి కళ్ళు తమషాగా తిప్పుతూ.

"సైఫాబాద్ పోనీ" అంటూ బండిలో ఎక్కి కూర్చుంది.... సరోజదళనేత్రి.

"అయితే దిగండి నేను సికందరాబాద్ పోతున్నా" అన్నాడు అజయ్.

"ఏమిటయ్యా నీవాలకం. డబ్బు పుచ్చుకొని తీసుకెళ్ళడాని కూడా గీర్వాణమే?" అందా పిల్ల కోపంగా తలెగరేస్తూ.

"అంతగా అవసరం అయితే రానూపోనూ ఛార్జీలు ఇవ్వండి తీసుకెళతాను" అన్నాడు పిల్లాడు మరీ తిక్కగా.

"ఇంకా నయం మా ఇంటిదాకా ఇవ్వమన్నావుగాదు. వెళ్ళవోయ్ వెళ్ళు. మరోటి దొరక్కపోదు."

"మీకు తెలీదుకాబోలు. ఇవాళ ఆటోరిక్షాల స్ట్రైక్."

"నిజం! అయితే నువ్వెలా కదుతున్నావ్" అందాపిల్ల తెలివిగా.

కాలేజి పిల్లే సందేహం లేదనుకున్నాడు అజయ్. దూరంగా బస్సు కనబడింది. ఇంకో నిముషం పోతే ఆటో రిక్షా కూడా రావచ్చు.

"ఎక్కండెక్కండి. మీకు తోచిందే ఇవ్వచ్చులెండి. మీకు మాత్రం తెలీదా" అన్నాడు కంగారుగా.

"అలా దారికిరా" అంటూ బండెక్కిందా అమ్మాయి.

రథాన్నొక తోపుతోసి, ఇంజన్‌ని మేల్కొలిపి, "ఇంతకీ సైఫాబాద్‌లో ఎక్కడకండి?" అన్నాడు అజయ్.

"కృష్ణాగరాజ్ వర్క్స్ లేదూ అక్కడికి."

"కృష్ణా గరాజ్‌కా!" అన్నాడు అజయ్ ఉలికిపడి.

"అవును. ఏం?"

"ఏం లేదండి అదయితే నాకు బాగా తెలుసు. నా గాడీని అక్కడికే సర్వీసింగ్‌కి ఇస్తూ వుంటాను" అంటూ ఒక్క ఊపుతో ఆటోని ముందుకు నడిపాడు.

ఎంత జోరుగా పోయినా ఆ పిల్ల అనూమినూ అనటం లేదు. విసుగెత్తి, కొంత దూరం పోయాక, హఠాత్తుగా బ్రేకు వేశాడు. ఆటోరిక్షా హైజంప్ సాధకం చేసింది ఒక్కసారిగా. బండిలో పిల్ల కెవ్వుమంది.



అజయ్ తృప్తిగా నవ్వాడు. "అదేమిటండీ, బ్రేకువేస్తే అంత కంగారూ?' అన్నాడు ఆనందంగా.

"ఇదేం బ్రేకయ్యా! మనిషి ఎగిరిపడేట్టు?'' అరిచింది అమ్మాయి.

"నిన్ననే రిపేరు చేయించానండీ! బ్రేకులు సరిగా పనిచేస్తున్నాయో లేదోనని-"



ఎవడో పోకిరీ అన్నట్టు ముఖం చిట్లించుకుంది-సరోజదళనేత్రి. ఇంకో నిమిషానికి బండి హోరుచేస్తూ, అంతకు రెండింతలుగా హోరుమంటున్న వర్క్‌షాప్ దగ్గర ఆగింది.

"ఉ, ఎంతైంది. చెప్పు" అంది అమ్మాయి దిగి.

నాగేశ్వరరావు సరసన నటించడానికి ఇద్దరు హీరోయిన్స్ కావాలి. వారిలో ఒకరుగా రాజసులోచనను బుక్ చేశారు. రెండవ పాత్రకు హీరోయిన్ దొరకటం కష్టం అయింది.

చాలామందిని చూశారు. ఒకవైపు షూటింగ్ ప్రారంభమైంది. ఇంక నాలుగు రోజుల్లో సెకండ్ హీరోయిన్ సెట్‌లో ఎంటర్ అవ్వాలి.

ఒకరోజు వాహినీ స్టూడియోలో షూటింగ్ జరుగుతుండగా పక్క ఫ్లోర్‌లో వేరే షూటింగ్ నుండి వచ్చింది ఇ.వి.సరోజ. "వణక్కం సార్... ఎన్న సార్ నీంగళ్ సింగిల్ వెర్షన్ దా ఎడికరింగే; ఎనక్కు వేషమే ఇల్లామపోచ్చి"- నమస్కరిస్తూనే నిట్టూర్చింది. దుక్కిపాటి మధుసూదనరావు ఒక్కసారి ఇ.వి.సరోజను పరిశీలనగా చూశారు. ఆ అమ్మాయి అంతకు ముందు 'తోడికోడళ్లు' చిత్రంలో డాన్స్ చేసింది. 'వెలుగు నీడలు' తమిళ వర్షన్‌లో నాగేశ్వరరావు భార్యగా (తెలుగు వర్షన్‌లో గిరిజ) నటించింది.

'ఈ చిత్రంలో హీరోయిన్ వేషం ఇస్తాము చేస్తావా!' అన్నారు మధుసూదనరావు. ఆశ్చర్యంగా నమ్మలేనట్లుగా చూస్తూ 'మీరు ఒక్కవర్షన్ కదా తీస్తుంది. నాకు తెలుగురాదు కదా'- అంది అరవంలో...

'అదంతా నీకెందుకు? నువు చేస్తావా చెప్పు' అన్నారాయన. ఆనందంతో ఎగిరి గంతేసింది ఆ అమ్మాయి. వెంటనే ఫ్లోర్‌లోకి వెళ్లి సెకండ్ హీరోయిన్ దొరికింది అని ప్రకటించేశారు మధుసూదనరావు.

"ఎవరు?" - అన్నారు అందరూ ఆసక్తిగా.

"ఇ.వి.సరోజ."

'ఆ అమ్మాయికి తెలుగు అక్షరం ముక్క కూడా రాదు కదా!' సందేహం వెలిబుచ్చారు ఆదుర్తి సుబ్బారావు, నాగేశ్వరరావు. మధుసూదనరావు జోక్ చేస్తున్నారనుకున్నారు వారంతా. "అదంతా నేను చూసుకుంటాను. మీకు అంగీకారమేనా చెప్పండి" అనుమతి కోరారు మధుసూదనరావు.

క్షణంసేపు ఆలోచించి ఓ.కె. అన్నారు ఆదుర్తి. వెంటనే ఆ అమ్మాయిని ఖాయం చేశారు. ఆ అమ్మాయి ధరించే పాత్ర డైలాగ్‌లన్నీ తమిళంలో వ్రాయించి ప్రాక్టీస్ చేయించే బాధ్యతను తనూ, అసోసియేట్ డైరెక్టర్ కె.విశ్వనాథ్ తీసుకున్నారు. ఆ పాత్రకు ఎవరితో డబ్బింగ్ చేయించాలనుకున్నారో ఆ ఆర్టిస్ట్‌ను పిలిపించి, ఆమె డైలాగ్‌లన్నీ రిహార్సల్ చేయించి, అదే మాడ్యులేషన్‌లో టేప్ చేయించి ఆ టేప్ సహాయంతో తమిళలిపిలో రాసుకున్న డైలాగులు ఇ.వి.సరోజతో ప్రాక్టీస్ చేయించారు.

షూటింగ్ సమయానికి లిప్ మూవ్‌మెంట్‌తో సహా పర్‌ఫెక్ట్‌గా తయారుచేశారు ఇ.వి.సరోజను.

ఈ విధంగా ఇ.వి.సరోజను తెలుగులో హీరోయిన్‌గా పరిచయం చేసింది అన్నపూర్ణ సంస్థ.

"మీటర్ పని చెయ్యటం లేదు. మీకు తోచిందివ్వండి" అన్నాడు అబ్బాయి! స్టయిలిష్‌గా జేబుల్లో చేతులు పెట్టుకుని.

"ఈ మాత్రం దానికేనా డబుల్ ఛార్జీలడిగావు?"

అంటూ పర్సు తీసి చిల్లర తియ్యసాగింది ఆ అమ్మాయి.

"అదేమిటి భాయీ! మా చెల్లెలి దగ్గర డబ్బు కొట్టేస్తున్నావ్"

అజయ్ వెనక్కి తిరిగాడు ప్రకాష్.

"ఓ, మీ సిస్టరేనా? అందుకేనేమో అంత టెక్కు" అన్నాడు అజయ్.

పద్మ మాట్లాడలేదు.

"ఏం లేదు బ్రదర్. ఆడపిల్ల అలసిపోతుందని లిఫ్టు ఇచ్చాను. కనీసం థాంక్స్ అయినా చెప్పకుండా డ్రైవర్ అని ఇన్‌సల్టు చేస్తోంది" అన్నాడు అజయ్.

"పద్మా! ఆయన మా మెకానిక్ మిస్టర్ విజయ్."

పద్మాక్షులు అలవోకగా చూశాయి. వాటిలో కృతజ్ఞత, క్షమించమన్న వేడుకోలుకాక, మరి ఒకటి రెండూ అర్థాలూ తాత్పర్యాలూ కల్తీ అయిన వయినం ఆ చూపుల నందుకొన్న చిరునామా దారుడికే తెలుసు. "మెనీ మెనీ థాంక్స్" అని రాగయుక్తంగా ప్రకటించిన ముత్యాల నరాలలో సింగ్‌సాంగ్ రాగం ఒకటే కాక, మరికొన్ని రాగాలు-నరాగం, అనురాగం లాంటివి-మిళాయింపయ్యాయన్న వైనం కూడా అతగానికే తెలుసు.



తెలుసుకున్న వైనం, క్షణంలో సగంలో ప్రసారితాలయిన తిరుగుటపా చూపులు చదువుకొన్న పద్మకే తెలుసు.



అంతలోనే పద్మ చూపులు అజయ్ భుజాలు దాటి అవతలకి వెళ్ళాయి.

"అరె! నువ్వా మీనా! ఇక్కడకొచ్చావేం? ఈ కారియర్ ఎవరికి?" అంది పద్మ.

"మా అన్నయ్యకి" అంటూ మీనా వచ్చింది.

"ఓ అలాగా... మీనా! ఈయన మా అన్నయ్య ప్రకాష్. ఈ గరాజ్‌లోనే పని"

"భలే... మా అన్నయ్య ఫ్రెండు మీ అన్నయ్యన్నమాట"

ఆశ్చర్యంలోంచి అప్పుడే మేలుకున్న అజయ్, "ఇంతకీ మీరు ఒకరికొకరు ఎలా తెలుసు?" అన్నాడు.

"చెప్పవే మీనా. వాళ్ళు పరిచయాలు చెయ్యకపోయినా మనం ఫ్రెండ్సుమనీ"

"పద్మ హైస్కూలులో నా క్లాసుమేటన్నయ్యా" అంది మీనా.

"ఇన్నాళ్ళూ చెప్పలేదేం పద్మా" అన్నాడు ప్రకాష్.

"బాగుంది. ఎవరికో చెల్లెలుంటే అది మా మీనాయే అవుతుందని కలగన్నానా" అంది పద్మ-'ఎవరికో' వంక ఓరగా చూస్తూ.

'ఎవరికో' గారూ ఆ పనే చేస్తున్నందువల్ల పద్మ సిగ్గుపడి వాచీ చూసుకుని "రండన్నయ్యా నాకు టైమవుతుంది. రా మీనా భోంచేస్తూ మాట్లాడుకుందాం" అంది కంగారుగా.

"ఏం బ్రదర్, ఇవ్వాళ ఇక్కడ భోజనం అంటున్నారు. ఏమిటి విశేషం?" అన్నాడు అజయ్. ప్రకాషే జవాబు చెప్పేశాడు.

.... ఇవాళ్టినుంచీ పద్మకు పరీక్షలు. ఇంట్లో వంట పెట్టుకుంటే కుదరదని భోజనానికి ఇక్కడికే రమ్మన్నాట్ట...

"అయితే, పరీక్షలయ్యేదాకా మనకి బంతిభోజనాలన్నమాట" అన్నాడు అజయ్-బంతిపూల రథం లాంటి, తనలో మనోరథం లాంటి పద్మకేసి నూటేభై పదకొండోసారి ఓరకంట చూస్తూ....

**(ఇంకా వుంది)**

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు




శ్రీ భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్.

❖ కుస్తీ పట్టే ఖనిజం?

✦ గ్రాఫైట్

వి.మంజురాణి, హైద్రాబాద్

❖ కొంప కొల్లేరు అయితే?

✦ ఏం ఫర్వాలేదు... కొల్లేరులో చేపలు ఎక్కువ కాబట్టి అవి అమ్ముకుని బ్రతకొచ్చు.

నిశాపతి, హైద్రాబాద్.

❖ నారా చంద్రబాబునాయుడుగారు అన్ని విషయాల్లో తెగ దూసుకెళ్లిపోతారు. అదెలా సాధ్యపడుతుందాయనకు?

✦ ఆయన పేరులో 'నారాచం' అనే పదం ఉంది. నారాచం అంటే...'బాణం' అన్నమాట. మరి దూసుకెళ్లిపోవడం వింతేముంది ?

## డబుల్‌రోల్




'చిరాకు'గా వున్నప్పుడు నాదగ్గరకి 'రాకు'

- బి.వి.రావు, రుద్రారం.

అతను అందర్నీ 'దగా' చేసి 'ఎదగాలి' అని అనుకొంటాడు.

- హిప్పి & నిషి, బాలాజీనగర్

'దోర' కాయలలో 'ఇదోరకం'

- బి.వి.సౌజన్య, జవహర్‌నగర్ కాలనీ.



## చిలిపి లిపి




KKC - కేకేసి (కేక వేసి)

బి.వి.రావు, రుద్రారం.

Row Tea - రోటీ

Row Gum - రోగం

వై.కీర్తిసాగర్, ఏలూరు.

## ఈ రూటే వేరు




లోగో - తక్కువగావెళ్ళు

- బి.శ్రీరాం, రుద్రారం.

వేవ్ రెయిన్ - అలజడి

- ఎల్.శ్రీనివాసరెడ్డి, కొంగర కలాన్

సమ్‌టైమ్స్ - లెక్కల సమయాలు

- దేవరం సతీష్ కుమార్, జగిత్యాల

## చిలిపి కవిత

ఫెయిలయ్యే విద్యార్థికి పరీక్ష రాసినప్పుడే
తెలిసిపోతాయి తను చేసిన పొరపాట్లు
హార్ట్‌ఫెయిలయ్యే మనిషికి ముందే
పట్టేస్తాయి చెమట్లు
ఏ ఫెయిల్యూర్‌కైనా ముందే
ఉంటుంది ఇంటిమేషను
హైద్రాబాదులో ట్రాఫిక్ సిగ్నల్స్ ఫెయిల్యూర్‌కి
మాత్రం ఉండనే ఉండదు ఇండికేషను

ఎమ్.శ్రేష్ట

- హైదరాబాద్




## పేరు -రిపేరు




నీలాంబరి - పిలిస్తేపలుకుతా - ఆడుతూ పాడుతూ - నిన్నేచేరుకుంటా.

అమృత - మనసంతా నువ్వే - కనులు మూసినా నీవాయే.

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

పెళ్ళాం ఊరెళితే - సందడే సందడి

**- పులగం చిన్నారాయణ, ఫిలిం జర్నలిస్ట్, హైద్రాబాద్.**

## పేరడీ పేరేడ్



డ్రింకరా మందు శరీరాపరా
బారు విహారా హరా బీరేశ్వరా
మందులో ముందని
ముందరే మందని
మందుయె లోకమనీ
మందే తోడని మందే నీడని
మందుయె ప్రాణమని
మందోపాసన చేసిన వాడవు
నా వాడవు నీవైతే
మందు లేనిదే మనుగడేదని
ఉందిరా శాస్త్ర సూక్తిరా
మధు చరిత్రలో దేవదాసు కథ
శిలాక్షరాలుగా నిలిచి వుండేరా
విని తపించరా ॥డ్రింకరా॥
బుసబుస పొంచే తెల్లని నురగే
చల్లని బీరే కాబోలు
గడగడ త్రాగే తెల్లని ద్రవము
జిన్ను పానకము కాబోలు
చేతిలోని సీసుండంగా
నోటిలోని గ్లాసుండంగా
ఆ..సురా పానమే గ్రోలంగా
ఆ..దేవదేవులే చూడంగా......ఆ.... ॥డ్రింకరా॥

ఈ పాట రాసిందెవరో నాకు తెలీదు. 1984 నుంచీ చుట్టుపక్కల వూళ్లలో ఎక్కడ ఏ ఫంక్షన్ జరిగినా - మా గురువు గారు మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మగారితో హరికథలో తబలా వాయించడానికి వెళ్లినా - ప్రోగ్రామ్ మధ్యలో ఈ పాట పాడుతుండే వాణ్ణి. 'హాసం'లోని ఈ శీర్షికలో శ్రేష్ట రాస్తున్న పేరడీలు చూసి ఇన్‌స్పైర్ అయి - ఈ పాట నాకే కాకుండా చాలా మందికి తెలియాలని పంపు తున్నాను. ఈ పేరడీని ఎవరు రాసారో నాకు తెలిపిన వారికి కృతజ్ఞతలు.

**-చంద్రబోస్, సినీ గీత రచయిత**

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల




## పద్యాల్లో ఏడుపులు

జీవితం దుఃఖమయం. ప్రతిజీవి ఏడుస్తూ పుట్టి ఏడుస్తూ, ఏడిపిస్తూ రాలిపోతుంది. ఇది రోదన శీలం కలది కాబట్టి రోదసి అయ్యింది. ఈ దుఃఖాన్ని నాశనం చేసేవాడు కాబట్టి "రుద్ ద్రావయతి రుద్రః"- శివుడు రుద్రుడయ్యాడు. స్వర్గానికి 'నాకం' అనిపేరు. అంటే దుఃఖం లేనిదని అర్థం. అందుకే అంతా ఆనందాన్ని వెదుక్కుంటూ ఉంటారు. ఆ ప్రయత్నంలోనే జీవితం గడిచిపోతూ వుంటుంది.

ఏడుపు మీద అపారమైన సాహిత్య సృష్టి జరిగింది. వాల్మీకి మహర్షి శోకమే శ్లోకమై, అదికావ్యమైన రామాయణానికి కారణమయ్యింది. తెలుగు సాహిత్యంలో కవులు ఏడుపును చాలా బాగా పోషించారు. శ్రీనాథ మహాకవి కాశీ ఖండంలో-

కొసరి వసంతకాలమున కోయిల క్రోల్చిన భంగినేడ్చెన
బ్బిసరుహ నేత్ర కొండ చఱిఁ బెద్ద యెలుంగున వెక్కి వెక్కి వె
క్క సమగు మన్యువేగమునఁ గాటుక కన్నుల నీరు సోనలై
యుసిరిక కాయలంతలు పయోధరముల్
దిగజాఱునట్లుగన్!!

అంటాడు. ఉసిరికాయలంత కన్నీటిబొట్లు రాలిపడేలా పెద్ద గొంతుతో వసంత కోకిల్లా వెక్కి వెక్కి ఏడ్చిందట! భీమఖండంలో - ఏడు రోజుల పాటు అన్నం దొరక్క అలమటించే వ్యాసుని అన్న పూర్ణా దేవి ఒక యిల్లాలై పిలిచి-

"ఏడు దినంబు లన్నమున కెడ్డము పుట్టిన
యంత మాత్రలో నేడుచు చున్నవాడవు మునీశ్వర!
నేడును నీదు ధీరతుల్ పాడరి పోయెనే?" అని

మందలిస్తుంది. శివరాత్రి మాహాత్మ్యం కావ్యంలో శ్రీనాథుడు నాయికని-

ఏల ఏడ్చెదు చెప్పవే యిందు వదన!
విపుల శోక భరంబున వెక్కి వెక్కి
త్రాట గుచ్చిన కొత్తముత్యాల వోలె
చన్నుగవ నున్న వీ బాష్ప జలకణములు!!

అంటాడు. రాలే కన్నీటిబొట్లు కొత్త ముత్యాల్లా వున్నాయట! పోతన మహాకవి- కన్నీరు పెట్టుకుంటూ కనిపించిన సరస్వతీదేవిని "కాటుక కంటినీరు చనుఁగట్టు పయింబడ నేల యేడ్చెదో, కైటభ దైత్య మర్దనుని గాదిలి కోడల?" అని ఊరడించాడు. అంతేకాదు, తన నారాయణ శతకంలో "మౌనం బొప్ప జపించు వేద మటవీ మధ్యంబులో నేడ్వగున్" అంటాడు. హరిపాద సేవ లేకుండా వేదాన్ని జపించటం అడవిలో ఏడుపులాంటిదంటాడు. ధూర్జటికవి కొడుకుల్లేరని ఏడ్చేవాళ్లనుద్దేశించి-"కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవన భ్రాంతులై. కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్

బడాసెన్?" అని బుద్ధి చెప్పాడు.

అల్లసాని పెద్దన తన మనుచరిత్ర కావ్యంలో, ముక్కు తిమ్మన తన పారిజాతాపహరణం కావ్యంలో, భట్టుమూర్తి తన వసుచరిత్ర కావ్యంలో తమతమ కథానాయికల ఏడుపుల్ని గూర్చి చాలా అందమైన పద్యాలు రాశారు.

పాటున కింతులోర్తురె! కృపా రహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము శోకె కనుంగొనుమంచు(జూపి య
ప్పాటల గంధి వేదన నెపంబిడి యేడ్చె కల స్వనంబుతో
మీటిన విచ్చు గబ్బి చను మిట్టల నత్రులు చిందు వందగన్!!

అని పెద్దన రాస్తే-

ఈసున బుట్టి డెందమున హెచ్చిన కోప దవానలంబుచే
గాసిలి యేడ్చె ప్రాణవిభుకట్టెదురన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయి చేల చెరంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకాలే ధ్వనిన్ !!

అని ముక్కు తిమ్మన రాస్తే-

ఆ జాబిల్లి వెలుంగు వెల్లి కలడాయన్ లేక రాకా నిశా
రాజశ్రీ సఖమైన మోమున బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చె కిన్నెర వధూ రాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికా రవ సుధా పూరంబు తోరంబు గాన్!!

అని భట్టుమూర్తి రాశాడు. ఈ మూడు పద్యాల్లోనూ కధానాయిక లెలా ఏడ్చారనే విషయాన్ని తీసి పక్కన పెట్టి, తెనాలి రామకృష్ణ కవి - 'అలసాని పెద్దన అటు-ఇటూగా ఏడ్చాడు. ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా ఏడ్చాడు. భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడ'ని రాయలవారి సభలో వెల్లడించటం గిలిగింతలు పెడుతుంది.

తురగా వెంకమరాజు అనే కవి ఒకసారి తాళ్లూరులో ఒక కమ్మవారింట పెళ్లి జరుగుతుంటే కవిసత్కారం చేస్తారని ఆశించి వెళ్తే, ఆ యజమాని "ఇప్పుడీ కవుల ఏడుపేమిటి? వెళ్లు!" అని కసురుకున్నాడట! వెంటనే తురగా కవి కోపంతో

పెండ్లి పేరంటాండ్రు పెనురంకులకు నేడ్వ
బాజా భజంత్రీలు పప్పుకేడ్వ
రాజబంధువులంత రంకు ముండల కేడ్వ
బాజారువెలదులు పసుపుకేడ్వ
వచ్చిపోయేడి వారు వక్క లాకులకేడ్వ
గుగ్గిళ్లకై పెండ్లి గుఱ్ఱమేడ్వ
పల్లకి బోయిలు భత్యాలకై యేడ్వ
బలు పురోహితుడు నేబులకు నేడ్వ
హారతి రూకల కాడుబిడ్డలు నేడ్వ
కుఱ్రవాండ్రందరు కూటికేడ్వ
అల్లుడనాథ యంచత్తమామలు నేడ్వ
కట్నంబుకై గ్రామకరణ మేడ్వ
పెద్దమగండని పెండ్లి కూతురునేడ్వ
పిల్ల చిన్నదటంచు పెనిమిటేడ్వ
చాల్పుగానిన్ని యేడ్పుల సాగె(బెండ్లి
సరస తాళ్లూరు లోపల విరసముగను
నర్ర పేరయ్య చేసే నీ నాటి కహహ!
కమ్మకులమున జన్మించి ఘనులు నవ్వ!!

అని ఓ పెద్ద పద్యం చెప్పి తిట్టుకుంటూ పోయాడట! పాపం! ఆ నర్రా పేరయ్య ఎవడో! అనవసరంగా కొరివితో తల గోక్కున్నాడు. సుమతీ శతక కారుడు ఆడవారి నేడిపించటం మంచిది కాదంటూ-

కులకాంత తోడ నెప్పుడు
కలహింపకు పట్టి తప్పు ఘటియింపకు మీ
కలకంఠి కంఠి కన్నీ
రొలికిన సిరియింట నుండ నొల్లదు సుమతీ!!

అంటాడు. కరుణశ్రీగారి 'పుష్పవిలాసం' కవిత పువ్వుల ఏడుపే కదా! ఆయన కరుణరస పోషణలో దిట్ట. 'కుంతీ కుమారి' కవితలో

దొరలు నానంద బాష్పాలొ పొరలు దుఃఖ
బాష్పములొగాని యవి గుర్తుపట్టలేము
రాలుచున్నవి ఆమె నేత్రాలనుండి
బాలకుని ముద్దు చెక్కుటద్దాలమీద!!

అంటారు. ఆత్రేయ- "నవ్వినా ఏడ్చినా కన్నీళ్లే వస్తాయి.

ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా" అన్నాడు. కరుణశ్రీ గారివి గుర్తుపట్టలేని కన్నీరు. 'ఊర్మిళా కుమారి' కవితలో ఆయన ఊర్మిళని ఓదారుస్తూ-

పైట చెఱంగుతో పుడమిపై బడకుండగ నద్దు కొమ్ము నే
కాటుక కన్నుదామరల కాలువలై ప్రవహించువేడి క
న్నీటి కణాలు, క్రింద పడనీయకు! ఉత్తమ సాధ్వివైన నీ
బోటి వధూటి బాష్పములు భూమి భరింపగ లేదు సోదరీ!!

అంటూ గొప్ప పద్యం చెప్పారు. ఇక, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవిత మూర్తీభవించిన శోకదేవతలా కనిపిస్తుంది. "కన్నీటి కెరటాల వెన్నెలేల?" అని ప్రశ్నించుకుంటూ, "నాకు కన్నీటి సరుల దొంతరలు గలవు" అని ప్రకటించుకుంటూ ఏడ్వ ఏడ్వలేక ఏడ్చుకుంటూ "ఒక్క కోకిలమ్మ కోయని యేడ్చె" అనటమే కాకుండా "కురియుమురా కన్నీటిని, మరి మరి విలపింపుమురా!" అంటూ మనకు కూడా సలహాయిస్తారు. జాషువాగారు 'శ్మశానవాటిక'లో "కన్నీటంబడి క్రాగిపోయినవి నిక్కంబిందు పాషాణముల్" అనటమే కాకుండా- "ఏడువ కన్న! నిన్నువలె నేడిచినా రొకమారు భూపతుల్ గూడ" అని పురిటికందు నూరడించారు. 'దీపావళి' కావ్యంలో వేదులవారు

ఎడ తెరిపిలేని కన్నీటి జడుల(దడిసి
పంకి లమ్మైన జీవన ప్రాంగణమున
గొంతు విప్పక లోలోన కుమిలి కుమిలి
యెంత యేడ్చిన పగిలిపోదీ యెడంద!!

అంటారు. ఆయనది జీవన ప్రాంగణం బురదైపోయేటంత ఏడుపు! భావ కవుల కవితల్లోనే కాకుండా స్మృతి కావ్యాల్లో కూడా కావల్సినంత ఏడుపుంది.

"బాలానాం రోదనం బలం"- పిల్లలకి ఏడుపే బలం కాగా పండితులు..



"బోద్ధారో మత్సర గ్రస్తాః"- అని అసూయతో ఏడుస్తారు. అలాగే తక్కువ వారు ఎక్కువ వారిని చూసి ఏడుస్తుంటారని-

తక్కువ తరగతి గల నరు
డెక్కువ యగువాని గాంచి యేడ్చుచునుండున్
చక్కగ కరి వీధింజన
కుక్కలుగని మొఱగకున్నె గువ్వల చెన్నా!!

అని చెన్నడు చెప్తాడు. అంటే ఏడుపు వెనక చాలా అర్థాలుంటాయని అర్థం చేసుకోవాలి. సంస్కృతంలో అర్థగాంభీర్యంతోవున్న రెండు శ్లోకాలు పరిచయం చేస్తాను.

కేశవం పతితం దృష్ట్వా-భీమం చైవ గతాయుషం
రురుదుః కౌరవాస్సర్వే పాండవాః హర్ష నిర్భరాః!!

ఈ శ్లోకానికి చనిపోయిపడిన కేశవుని, భీముని చూసి కౌరవులందరూ ఏడిస్తే, పాండవులంతా సంతోషించారని అర్థం కానీ ఆ తాత్పర్యం ఇక్కడ పొసగదు. అసలు అర్థమేమిటంటే, నీటిలో పడి భయంకరంగా వున్న శవాన్ని చూసి (కే+శవం=నీటిలో శవం) (భీమ=భయంకరం), నక్కలు (కౌరవ=నక్క) ఏడిస్తే, కొంగలు (పాండవ=కొంగ) సంతోషించాయి.

ఇలాగే, రామాయణ కథతో మరో శ్లోకం చూడండి.

హతో హనుమతా రామః సీతా సా హర్ష నిర్భరా
రుదంతి రాక్షసాస్సర్వే హాహా రామో హతో హతః!!

ఈ శ్లోకానికి రాముడు హనుమంతుని చేత హతుడైతే సీత సంతోషించి, రాక్షసులందరూ ఏడుస్తున్నారని అర్థం. కానీ అసలు అర్థం వేరు. ఏమిటంటే- ("హనుమతా+ఆరామః" - హనుమంతునిచే నాశనమైన ఆరామం అంటే వనం) ఆరామం నాశనమయ్యిందని రాక్షసులంతా ఏడుస్తుంటే సీత సంతోషించిందని అర్థం.

ఒక కవిగారు అంత్యదశలో వుండగా ఆయన అభిమానులు వచ్చి 'మీరెప్పుడూ మీ శ్రీమతి మీద కవిత్వం చెప్పలేదు. ఇప్పుడైనా ఏదైనా చెప్పండ'ని అడిగారట. వెంటనే ఆయన-

"ఆనాడు నా వెంట రమ్మంటే ఏడ్చింది
ఈనాడు నా వెంట రాలేక ఏడ్చింది." అని చెప్పి కన్నుమూశాడట! మా గురువులు బ్రహ్మశ్రీ చల్లా కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ కృష్ణశతకంలో-

ఎవని యేడ్పు వానిదే యందువేగాని
యేల చెప్పవిట్టు లేడ్పుమనుచు
నింత చెప్పరాని వింత గుణాలు నీ
కేడ నుండి వచ్చికూడె కృష్ణ!!

అని విషాదాన్ని వేదాంతీకరించారు. నేను నా 'రుద్రాక్షలు' కావ్యంలో "కన్నీళ్ల రుచి తెలియకుండా కవి ఎలా అవుతాడు?" అన్నాను. అంతే కాదు, మరోచోట- "ఎవ్వరెవ్వరి నోదార్తురెంత దనుక? ఎవరి యేడుపు వారిని ఏడ్వనిమ్ము" అని కూడా అన్నాను. ఏదైనా సరే, విషాదంతో మొదలై వేదాంతంతో ముగిసిపోతుంది. అది తాత్విక స్థితి.

చివరగా ఓ జోక్:- ఓ కుర్రాడు ఏడుస్తున్నాడు "ఎందుకేడుస్తున్నా?" వంటే "నా తమ్ముడు రూపాయి బిళ్ల మింగేశా"డని మళ్లీ గట్టిగా ఏడుస్తున్నాడు. "వాడు కదా మిగింది. నీ కెందుకురా అంత ఏడుపు?" అంటే "అది నా రూపాయి బిళ్ల" అంటూ మళ్లీ ఏడుపు! ■




# హాస్యాభిషేకం




మల్లాది వెంకట కృష్ణమూర్తి కొత్తపుస్తకం- 'హాస్యాభిషేకం' అనే జోక్స్ కలెక్షన్ బుక్‌లో ఆయన పలురకాల జోకులు అందించారు. ఆపుస్తకంలో మూర్ఖులపై జోక్స్ అందించిన హాస్యానికి మచ్చుతునకలు కొన్ని :-

వెంగళ్రావు తన మిత్రుడితో కలిసి అడవికి వ్యాహ్యాళికి వెళ్లారు. మిత్రుడు ఓ సింహాన్ని చూసి దానిమీదకో రాతిని విసిరాడు. అది దానికి తలగడంతో పెద్దగా అరుస్తూ మీదికి రాసాగింది.
"చెట్టెక్కు త్వరగా" చెప్పాడు మిత్రుడు వెంగళ్రావుతో.
"నేనెందుకు ఎక్కాలి? రాయి విసిరింది నీవు కాబట్టి, అది నీ మీదకి వస్తోంది" జవాబు చెప్పాడు వెంగళ్రావు.

* * *

ఒకరోజు న్యూయార్క్‌లోని పంతొమ్మిదో అంతస్తులోని ఓ ఆఫీసులో పనిచేస్తున్న ఒకతనితో ఎవరో కిందినించి అరుస్తూ చెప్పారు. "శ్రీనివాస్ గారు! మీ అమ్మాయి ఆమని యాక్సిడెంట్లో మరణించింది."
అది విని ఆదుర్దా పడ్డ అతను ఏం చేయాలో తోచక, పైనించి కిందికి దూకేసాడు. క్రింద పడుతుండగా పదో అంతస్తుకి చేరుకున్నాక, తనకి ఆమని అనే అమ్మాయి లేదని గుర్తొచ్చింది. అయిదో అంతస్తుకి చేరుకోగానే తనకసలు పెళ్ళే కాలేదని గుర్తుకు వచ్చింది. ఒకటో అంతస్తుకి చేరుకోగానే తన పేరు శ్రీనివాస్ కాదని వెంగళ్రావని గుర్తుకు వచ్చింది.

* * *



వెంగళ్రావు ఓ చీరల షాపులో సేల్స్‌మేన్‌గా చేరాడు. ఆ షాపు యజమాని తను కొత్తగా కొన్న ఫోర్డ్ కారులో వచ్చాడు. కారు బయట పార్కు చేసి ఆయన పూజ చేయడానికి దేవుడి పూజా మందిరం వైపు వెళ్లాడు. కొద్ది నిమిషాల తర్వాత వెంగళ్రావు ఆయన దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు.
"సార్! సార్! మీ కొత్త కారుని దొంగలు ఎత్తుకెళ్ళారు"
"అరే! మరి నీవు వాళ్ళని ఆపలేదే!" ప్రశ్నించారాయన గంభీరంగా.
"అంతకంటే మంచి చేశాను సార్! ఆ కారు లైసెన్స్ నెంబరు రాసుకున్నాను" చెప్పాడు వెంగళ్రావు.

* * *

వెంగళ్రావు పొరుగింటివాడు తన బెడ్‌రూం గోడలకి పింక్‌రంగు వేయించదలచుకున్నాడు. వెంగళ్రావు కూడా తన ఇంట్లోని బెడ్‌రూంకి పింక్‌రంగు వేయించు కున్నాడని, తమ ఇద్దరి బెడ్‌రూంసైజు ఒక్కటే అని తెలుసుకున్నాక అతను వెంగళ్రావునని అడిగాడు బెడ్‌రూంకి ఎన్ని లీటర్లు రంగు కొన్నారని.
"పద్దెనిమిది లీటర్లు" జవాబు చెప్పాడు వెంగళ్రావు.
అతను 18 లీటర్ల రంగు కొన్నాడు. కాని ఆరు లీటర్లు మిగిలిపోవడంతో, తేడా ఎక్కడ ఉందో అర్థంకాక వెంగళ్రావుని మళ్ళీ కలిసి అడిగాడు.
"18 లీటర్లు రంగుకొంటే ఆరు లీటర్లు మిగిలిందేమిటి?"
"ఎందుకు మిగలదు? నాకూ ఆరు లీటర్లు మిగిలాయి" జవాబు చెప్పాడు వెంగళ్రావు.

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకమైన ఎన్.టి.ఆర్. అవార్డును హృషికేశ్ ముఖర్జీకి ప్రకటించిన సందర్భంగా....



## 'జిందగీ కైసీ హై పహేలీ హాయ్'



హృషికేశ్ ముఖర్జీ

| | |
|---|---|
| చిత్రం | : ఆనంద్ (1970) |
| రచన | : యోగేశ్ |
| సంగీతం | : సలిల్ చౌధురి |
| గానం | : మన్నాడే, బృందం |
| అభినయం | : రాజేష్ ఖన్నా, అమితాబ్ బచ్చన్, సుమితా సన్యాల్ |

జిందగీ కైసీ హై పహేలీ హాయ్
కభీతో హసాయే, కభీ యే రులాయే ॥జిందగీ॥

తో భీ దేఖో మన్ నహీం జాగే
పీఛే పీఛే సప్‌నోం కే భాగే ॥తో భీ॥

ఇక్ దిన్ సప్‌నోం కా రాహీ
చలా జాయే సప్‌నోం సే ఆగే కహాఁ ॥జిందగీ॥

జిన్‌హోంనే సజాయే యహాఁ మేలే
సుఖ్ దుఃఖ్ సంగ్ సంగ్ ఝేలే ॥జిన్‌హోంనే॥

వోహీ చున్‌కర్ ఖామోషీ
యూఁ చలే జాయేఁ అకేలే కహాఁ ॥జిందగీ॥

హృషికేశ్ ముఖర్జీ తన గురువైన బిమల్‌రాయ్ పంథాలో చక్కని సాంఘిక చిత్రాలు తీసినంత నేర్పుతోనే మంచి కామెడీ చిత్రాలు కూడా తీశారు. కంటతడి పెట్టించే పాత్రలు, గిలిగింతలు పెట్టే పాత్రలు, గుండెల్లో బాధ దాచుకుని చిరునవ్వులు చిందించే పాత్రలు, ఔదార్యం గల పాత్రలే కానీ ఆయన చిత్రాలలో దుష్టపాత్రలు చాలా తక్కువ కనిపిస్తాయి. నైతిక విలువలు, కుటుంబ విలువలకు ప్రాధాన్యతనిచ్చే ఈ పాత్రలతో ఆయన చిత్రాలు సహజత్వానికి దగ్గరగా ఉంటాయి. సినిమా మాధ్యమంపై ఆయనకున్న పట్టు ఎలాంటిదంటే సూపర్‌స్టార్లు కూడా ఆయన చిత్రాలలో నటించడానికి ఎదురుచూస్తూ ఉండేవారు. ఆయన మీద ఉన్న నమ్మకంతో కథ ఏమిటని కూడా అడగకుండా నటించేవారు. సినిమా రంగానికి ఆయన అందించిన సేవలకు గుర్తింపుగా భారత ప్రభుత్వం ఆయనకు









పద్మవిభూషణ్, దాదా సాహెబ్ ఫాల్కే అవార్డుల వంటి అత్యున్నత పురస్కారాలు ఇచ్చి సత్కరించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆయనకు ఎన్.టి.ఆర్. అవార్డు ఇవ్వబోతోంది.

1922లో కలకత్తాలో జన్మించిన హృషికేశ్ ముఖర్జీ తొలుత బిమల్‌రాయ్ వద్ద అసిస్టెంట్ డైరెక్టర్‌గా, ఎడిటర్‌గా పనిచేశారు. దర్శకుడిగా ఆయన తొలిచిత్రం 'ముసాఫిర్' (1957). ప్రయోగాత్మకమైన ఈ చిత్రంలో దిలీప్‌కుమార్ నటించారు. ప్రఖ్యాత మలయాళం చిత్రం 'చెమ్మీన్' నిర్మాణ సమయంలో హృషికేశ్ ముఖర్జీ ఎంతో సహకారం అందించారు. మొదట్లో ప్రధానంగా సాంఘిక ఇతివృత్తాలతో చిత్రాలు రూపొందించారు. తరువాత తక్కువ బడ్జెట్‌తో కుటుంబ కథా చిత్రాలు, హాస్య ప్రధాన చిత్రాలు తీశారు. 'అనాడీ', 'అనుపమ', 'సత్యకామ్', 'ఆనంద్', 'గుడ్డీ', 'అభిమాన్', 'నమక్‌హరామ్', 'చుప్‌కే చుప్‌కే', 'గోల్‌మాల్', 'ఖూబ్‌సూరత్' వంటి క్లాసిక్ చిత్రాలను అందించారు. సెన్సార్ బోర్డ్, నేషనల్ ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌లకు ఛైర్మన్‌గా పనిచేశారు. 1999లో చాలాకాలం విరామం తర్వాత 'ఝూఠ్ బోలే కౌవా కాటే' చిత్రానికి దర్శకత్వం వహించారు.

'ఆనంద్' చిత్రకథ హృషికేశ్ ముఖర్జీకి మంచి స్నేహితుడైన రాజ్‌కపూర్‌కి ఎదురైన అనుభవాల నుంచి పుట్టిన కథ. రాజ్‌కపూర్ మిత్రుడొకరు తీవ్ర అస్వస్థతలో ఉండి కూడా నవ్వుతూ నవ్విస్తూ ఉండడం, ఆయన కోసం రాజ్‌కపూర్ కలవరపడటం చూసి ముఖర్జీ ఈ చిత్ర కథను రూపొందించారు. ఆనంద్ క్యాన్సర్ వ్యాధిసోకిన ఒక అనాథ యువకుడు. ఆర్నెల్ల కంటే ఎక్కువ బతకనని అతనికి తెలుసు.  చికిత్స కోసం ఢిల్లీ నుంచి బొంబాయి రావడంలో అతని ముఖ్య ఉద్దేశం బొంబాయి చూడాలనే. తాను బతికి ఉన్న కొన్నాళ్ళూ హాయిగా ఉండాలనుకునే స్వభావం అతనిది. బొంబాయిలో అతనికి డాక్టర్ భాస్కర్ బెనర్జీతో పరిచయమవుతుంది. క్యాన్సర్ స్పెషలిస్ట్ అయిన భాస్కర్ తను నయం చేయలేని కేసుల వల్ల, తన చుట్టూ ఉన్న పేదరికం, ఆకలి వల్ల నిస్సహాయత అనుభవిస్తూ అసంతృప్తితో ఉంటాడు. ఆనంద్ స్వభావం చూసి చకితుడవుతాడు. హాస్పిటల్‌లోని మరో డాక్టర్, అతని భార్య, హాస్పిటల్‌లోని సిస్టర్ ఆనంద్ కలుపుగోలుతనానికి, మంచితనానికి ముచ్చటపడి అతణ్ని ఆదరిస్తారు. వీరందరికి అతని పరిస్థితి గురించి తెలిసే దృశ్యాలను, వారి ప్రతిక్రియలను ఎంతో ప్రావీణ్యంతో మలిచారు ముఖర్జీ. భాస్కర్ ఆనంద్‌ని విడిచి ఉండలేనంతగా అతనికి దగ్గరవుతాడు. భాస్కర్ ప్రేమించిన అమ్మాయి తల్లితో మాట్లాడి ఆనంద్ వారి పెళ్ళి కుదురుస్తాడు. తన గురించి అందరూ ఎంత ఆరాటపడుతున్నారో వారందరూ బాగుండాలని అతనూ అంతే తాపత్రయపడతాడు. అతనికి ఒక ప్రేయసి ఉండేదని, తన వ్యాధిగురించి తెలిసి ఆమెకు వేరే పెళ్ళి చేశారని తర్వాత చెప్పటంతో అతని ఔన్నత్యాన్ని ఇనుమడింపజేశారు ముఖర్జీ. చివరికి మరణించేటప్పుడు కూడా తను చనిపోతే భాస్కర్ తట్టుకోలేడని బాధపడతాడు ఆనంద్. అతను చనిపోయే సమయానికి భాస్కర్ పక్కన లేకపోవడం, వారిద్దరూ అంతకుముందు రికార్డ్ చేసుకున్న టేప్ వింటూ ఆనంద్ చనిపోవడం, భాస్కర్ తిరిగి వచ్చి ఆనంద్‌ని మాట్లాడమని కుదపటం, టేప్‌లోంచి 'బాబూ మొషాయ్' అంటూ ఆనంద్ మాటలు వినబడటం-ఇవన్నీ ఈ కథకు పతాక సన్నివేశమంటే ఇలాగే ఉండాలనిపించే విధంగా చిత్రీకరించారు ముఖర్జీ. ఈకథా సారాన్ని వేదాంత ధోరణిలో ఒక్క పాటలో రాయించుకుని 'జిందగీ కైసీ హై పహేలీ' పాటను రూపొందించారు. చిత్రీకరణలో జీవితానికి సంకేతంగా గాలి పడగలను వాడుకున్నారు. దారం వదలగానే ఆకాశంలోకి సాగిపోయే గాలి పడగలలాగే ఒకనాడు అన్నీ వదిలి వెళ్ళిపోతాడు మనిషి. అది ఎప్పుడు అనేది అప్రస్తుతమనేది ఆనంద్ ఫిలాసఫీ. ఆనంద్‌గా రాజేష్‌ఖన్నా, భాస్కర్‌గా అమితాబ్ బచ్చన్ నటించారు. ముఖర్జీ తొలి చిత్రానికి పనిచేసిన సలిల్ చౌధురి ఈ చిత్రానికి సంగీతం అందించారు.

జిందగీ అంటే జీవితం. పహేలీ అంటే చిక్కు ప్రశ్న. హఁసాయే అంటే నవ్విస్తుంది అని. రులాయే అంటే ఏడిపిస్తుంది అని.

'జీవితం ఎలాంటి చిక్కు ప్రశ్నో కదా!
నవ్విస్తుంది ఓసారి, ఏడిపిస్తుంది ఓసారి'

జీవితం పరమార్థం ఏమిటనేది మనిషికి అనాదిగా ఒక చిక్కు ప్రశ్నగానే ఉంది. సుఖ దుఃఖాలను అనుభవిస్తూ సాగిపోతుంటాడు మనిషి.

మన్ అంటే మనసు. జాగ్‌నా అంటే మేలుకోవటం. పీఛే అంటే వెంట. సప్‌నే అంటే కలలు. భాగ్‌నా అంటే పరుగెత్తటం. రాహీ అంటే బాటసారి.

'అయినా మనసు మేలుకోదు
కలల వెంట పరుగు మానుకోదు
ఒకరోజు ఈ కలల బాటసారి
వెళ్ళిపోతాడు కలల్ని దాటి ఎక్కడికో'

జీవితాన్ని పూర్తిగా నియంత్రించలేనని తెలిసి కూడా మనిషి ఎన్నో కలలు కంటాడు. అవి నిజం చేసుకోవటానికి ఆరాటపడతాడు. ఒక కోరిక తీరితే మరొకటి పుట్టుకొస్తుంది. చివరికి ఒక రోజు తన కోరికల్ని వదిలేసి వెళ్ళిపోతాడు.

మేలా అంటే జాతర. అనేక రకాల కార్యకలాపాలు జరిగే ఒక చిన్న లోకమనే అర్థం చెప్పుకోవచ్చు. సంగ్ సంగ్ అంటే కలిసి. ఖామోషి అంటే మౌనం. అకేలీ అంటే ఒంటరిగా అని.

'ప్రపంచమనే ఈ సంతలో
ఆనందంతో కేరింతలు కొట్టి
దుఃఖంతో రోదించిన వారే
కొంతకాలానికి మౌనాన్ని ఆశ్రయించి
ఒంటరిగా తరలిపోతారు ఎక్కడికో!

తమ బంధుమిత్రులతో తమదైన ప్రపంచం ఏర్పర్చుకుంటారు. సుఖదుఃఖాలను ఎదుర్కొంటూ ఉంటారు. ఎంత పరివారం ఉన్నా చివరికి ఒంటరిగానే వెళ్ళిపోతారు. ఆనంద్, భాస్కర్, అతని ప్రేయసి బీచ్‌కి వెళ్ళినపుడు ఆనంద్ పాడే పాట ఇది. అప్పుడే అతని వ్యాధి గురించి తెలిసిన భాస్కర్ ప్రేయసి ఇంత చలాకీ మనిషిని వదిలి దేవుడు కూడా ఉండలేకే అతణ్ని తన వద్దకు రప్పించుకుంటున్నాడేమో అంటుంది. ఆమె భావాలకు, భాస్కర్ భావాలకు, ఆనంద్ భావాలకు అద్దం పడుతుంది ఈ పాట. సుఖదుఃఖాలను సూచించడానికి సముద్రాన్ని చూపించటం, చివరికి ఆనంద్ చనిపోయినపుడు టేప్ తెగిపోయి గిర్రున తిరగటం వంటి టచెస్ హృషికేశ్ ముఖర్జీ ప్రతిభకు తార్కాణాలు.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1950

నౌషాద్ స్వరపరిచిన 'బాబుల్', 'దాస్తాన్' చిత్రాలు అద్భుత విజయాలను సాధించాయి. నౌషాద్, షకీల్ ల భాగస్వామ్యం స్థిరపడింది. 'మషాల్' చిత్రంలోని 'ఊపర్ గగన్ విశాల్' పాటతో ఎస్.డి.బర్మన్, మన్నాదే ల కాంబినేషన్ చక్కటి విజయాన్ని సాధించింది. హిందీసీమ వదిలివెళ్ళిపోవాలనే ఐడియా బర్మన్ డ్రాప్ చేయడం జరిగింది.

'అఫ్సర్' చిత్రానికి సంగీతం ఇవ్వడంతో దేవ్ ఆనంద్ స్వంత నిర్మాణ సంస్థ నవకేతన్‌తో ఎస్.డి. బంధానికి పునాది పడింది.

విశ్వామిత్తర్ అదిల్ రాసిన 'జట్ ఖోల్ దే', 'సాధూ కే ఘర్ చోకరియా దో' అనే రెండు వ్యంగ్య గీతాలను ప్రసిద్ధ క్యారెక్టర్ ఆర్టిస్ట్ మన్‌మోహన్ కృష్ణ గానం చేసారు. 'నైనా దీవానే', 'ఏక్ నహీమానే' లు హిట్ కావడంతో సురయ్యా తన అగ్రస్థానాన్ని కొనసాగించింది.


మదన్ మోహన్

హిందీ సినీ సంగీతంలో విశిష్టగౌరవాన్ని సంపాదించుకున్న మదన్‌మోహన్ 'ఆంఖే' చిత్రం ద్వారా రంగప్రవేశం. ఆ చిత్రంలో పనిచేసిన గీత రచయితలలో ఒకరైన రాజా మెహదీ అలీఖాన్‌తో కలిసి తర్వాత ఒక టీముగా ఏర్పడి చక్కటి గీతాలను అందించారు. ఈ చిత్రంలోనే 'ముఝ్ సే నైన్ మిలానా బిప పాస్ కర్కే' అనే కామిక్ పాట కూడా ఉంది.


రాజ్ ఖోస్లా

దర్శకుడు రాజ్ ఖోస్లా 'రైల్ మేఁ జియా మోరా' పాట ద్వారా సింగర్‌గా పరిచయమయ్యారు. దరిమిలా రాజ్ ఖోస్లా, మదన్‌మోహన్, రాజా మెహదీ అలీఖాన్‌లు 'వో కౌన్ థీ', 'మేరా సాయా' వంటి మ్యూజికల్ హిట్ చిత్రాలు అందించారు.

'అర్జూ' మ్యూజికల్‌గా సూపర్‌హిట్ అయింది. 'ఏ దిల్ ముఝే ఐసీ జగహ్ లే చల్' పాట తలత్ మెహమూద్‌కు చక్కటి బ్రేకినిచ్చింది. అనిల్ బిశ్వాస్ ఆఖరి సక్సెస్ ఇదే అనుకోవచ్చు.


తలత్ మెహమూద్

రోషన్ రెండవ చిత్రం 'బావరే నైన్' హిట్ కావటంతో ఆయన ఇక్కడ స్థిరపడటానికి మార్గం ఏర్పడింది. 'ఖయాలోఁ మేఁ కిసీకీ', 'తేరీ దునియా మేఁ దిల్ లగ్తా నహీఁ' వంటి అజరామరమైన పాటలు ఈ చిత్రంలోనివే.

ఎక్కువకాలం సాగకపోయినా ఉజ్వలంగా వెలిగిన ఖేమ్‌చంద్ ప్రకాష్ కెరియర్‌లో ఆఖరి చిత్రాలు 'సతీ నర్మదా',' బిజిలీ', 'జాన్ పెహచాన్'లు విడుదలయ్యాయి.

'డోల్తీ నయ్యా' చిత్రానికి 8 మంది గీత రచయితలు పనిచేయటం ఓ రికార్డయితే, అదే సంవత్సరం 'రామ్ దర్శన్' అనే భక్తి చిత్రానికి 6గురు సంగీత దర్శకులు పనిచేయటం మరో విశేషం.


నూతన్

'హమారీ బేటీ' చిత్రం ద్వారా నూతన్ సినీ రంగ ప్రవేశం. అదే చిత్రంలో 'తుఝే క్యా దుల్హా భాయే రీ బాంకీ దుల్హనియా' అనే పాటకూడా పాడారు. స్నేహల్ భట్కర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

'జోగన్' చిత్రం సూపర్‌హిట్ అయింది. బులో.సి.రాణి సంగీత నిర్దేశకత్వంలో రూపొందిన 15 పాటలలో 12 పాటలను గీతారాయ్ పాడటం విశేషం.


'జోగన్' చిత్రం లో
దిలీప్‌కుమార్, నర్గీస్

సి.రామచంద్ర స్వర రచనలో వెలువడిన 'సమాధి', 'సర్‌గమ్' ,' సంగ్రామ్', 'సంగీతా' చిత్రాలు విడుదలయితే మొదటి మూడు సంగీతపరంగా హిట్! లతా, అమీర్‌బాయి ల డ్యూయెట్ 'గోరే గోరే ఓ బాంకీ చోరే' , 'మైహూఁ ఎక్ ఖల్లాసి'( రామచంద్ర కూడా పాడారు) పాటలు పెద్ద హిట్ అయ్యాయి.

'పర్‌దేశ్' హిట్ కావటం గులామ్ మొహమద్ ('పాకీజా' ఫేమ్) కు దక్కిన పెద్ద విజయం.

హన్స్‌రాజ్ బహల్ చిత్రం 'కిస్‌కి యాద్' ద్వారా గీత రచయిత వర్మా మాలిక్ హిందీ చిత్ర రంగ ప్రవేశం. గతంలో వీరిద్దరి కాంబినేషన్‌లోనే పంజాబీలో రూపుదిద్దుకున్న 'జగ్గు', 'లచ్చి' చక్కటి విజయాలను సాధించాయి.

పర్సనల్ లైఫ్‌కూ ప్రాధాన్యత ఇచ్చే

# సిలైన్ డియాన్



మార్చి నుంచి స్టేజి షోలు ప్రారంభం



**'టైటానిక్' సినిమా తెలియని వారు లేరు. దాని థీమ్ సాంగ్ 'మై హార్ట్ విల్ గో ఆన్..' టీవీల్లో మారుమ్రోగిపోయింది. ఆ పాట గాయకురాలిగా సిలైన్ డియాన్ పేరు సామాన్య జనాలకందరికీ కూడా తెలిసిపోయింది.**

కానీ మ్యూజిక్ ఇండస్ట్రీ వాళ్లకి ఇంకా చాలా విషయాలు తెలుసు. తన పేరుంటే చాలు రికార్డులు బ్రహ్మాండంగా అమ్ముడుపోతాయని, ఇప్పటి దాకా 14 కోట్ల ఆల్బమ్స్ అమ్ముడుపోయాయని తెలుసు.

అటువంటి సింగర్ స్టేజి మీద పెర్‌ఫామ్ చేస్తుంటే ప్రజలు ఎలా పొంగిపోతారో నిర్వాహకులకూ తెలుసు. అందుకే ఈ మార్చి నుండి ఓ గ్రాండ్ షో ప్రారంభం కాబోతోంది.

లాస్ వెగాస్ లోని సీజర్స్ పాలెస్‌లో మార్చి 2003 నుండి ప్రారంభం

- 4000 సీట్ల కెపాసిటీతో కస్టమ్ డిజైన్డ్ ఆడిటోరియమ్ అది
- డియాన్‌తో మూడు సంవత్సరాల కాంట్రాక్టు
- ఈ మూడు సంవత్సరాలలో 600 షోలు ఇస్తుందామె
- ఫ్రాంకో డ్రేగోన్ దర్శకత్వం వహిస్తున్నాడు
- డయాన్‌తో బాటు 50-60 మంది పెర్‌ఫార్మర్స్ ఉంటారు

ఈ ఎరేంజిమెంటులో ఓ సౌకర్యం ఏమిటంటే ప్రతీరాత్రి ఆమె ఇంటికి వెళ్లి భర్త రెనె ఏంజిలిల్ , కుమారుడు రెనె ఛార్లెస్ ను చూసుకోవచ్చు. కొడుక్కి ఈ పక్షంలో జనవరి 25కి రెండేళ్లు నిండుతాయి. రెనెతో 1994 డిసెంబరు 17 న వివాహమయ్యింది. అదో తమాషా కథ!

- క్విబెక్‌లో పుట్టిన డియాన్ చైల్డ్ ప్రాడిజీ
- 5 సం.ల వయసులోనే ఫ్రెంచ్-కెనడియన్ సాంగ్స్ స్టేజిమీద పాడింది
- 12 సం.ల వయసులో రికార్డు చేసిన డెమో టేప్ క్విబెక్‌లో మ్యూజిక్ వ్యాపారి రెనెకు చేరింది
- ఆమె డెబ్యూ ఆల్బమ్ తనే చేయాలని నిశ్చయించుకున్నాడు
- డబ్బు సరిపోకపోతే ఇల్లు తాకట్టు పెట్టాడు.
- అలా ప్రారంభమయిన వారి బంధం మరింత గట్టిపడి భార్యాభర్తలయారు,
- ఇప్పుడు డియాన్‌కు 34 యేళ్లు. ఇప్పటిదాకా కలిసేవున్నారు

దానికి డియాన్ తీసుకునే జాగ్రత్తలు చెప్పుకుని తీరాలి

1999 న్యూ ఇయర్ రోజున పబ్లిక్ పెర్‌ఫామెన్స్ ఇచ్చాక రెండేళ్లపాటు షో బిజినెస్‌కు దూరంగా ఉంది. ఆ కాలంలో తన వ్యక్తిగత జీవితానికి ప్రాధాన్యం ఇచ్చింది. గోల్ఫ్ ఆడుకుంది. పిల్లవాడికి కని, వాడి ముద్దు ముచ్చటలతో గడిపింది.

ఇన్నేళ్ల విరామం తర్వాత రిలీజయినా 'ఎ న్యూ డే హేజ్ కమ్' (2002) ప్రజాదరణ పొందింది.

- 1982 లో యమాహా వరల్డ్ సాంగ్ ఫెస్టివల్ (టోక్యో) లో గోల్డ్ మెడల్
- 1983లో ఆమె పాట 'డి అమూర్..' 7 లక్షల కాపీలు అమ్ముడుపోవడంతో ఫ్రాన్స్‌లో అవార్డు
- ఈ గౌరవం పొందిన తొలి కెనడియన్ సింగర్ డియానే!
- డబ్లిన్‌లో 1988లో జరిగిన యూరోవిజన్ పాటల పోటీలో బహుమతి

## ఆల్బమ్స్

- ✔ 1990 లో తొలి ఇంగ్లీషు ఆల్బమ్ 'యూనిజాన్' విడుదల
- ✔ సింగిల్ 'వేర్ డజ్ మై హార్ట్ బీట్ నౌ' అమెరికాలో టాప్ ఫైవ్‌లో ఒకటి.
- ✔ 1992 లో రెండో ఆల్బమ్ 'సెలైన్ డియాన్'.
- ✔ దానిలోని 4 పాటలు టాప్ 40 హిట్స్ లో చోటు చేసుకున్నాయి
- ✔ పెబో బ్రైసన్‌తో కలిసిపాడిన 'బ్యూటీ అండ్ ది బీస్ట్..' గ్రామీ అవార్డు గెలుచుకుంది
- ✔ 1993 లో 'ది కలర్ ఆఫ్ మై లవ్' విడుదల.
- ✔ ఆ ఆల్బమ్‌లోని సింగిల్ 'ది పవర్ ఆఫ్ లవ్..' హాట్ 100 లో నాలుగువారాల పాటు నెం.1 గా నిలిచింది.
- ✔ 1996 లో 'ఫాలింగ్ ఇంటూ యూ' విడుదల.
- ✔ 1997 లో రిలీజయిన 'టైటానిక్' సౌండ్‌ట్రాక్, 'లెట్స్ టాక్ ఎబౌట్ లవ్' రెండూ హిట్సే
- ✔ టైటానిక్ పాటకు బెస్ట్ ఒరిజినల్ సాంగ్‌గా ఆస్కార్ బహుమతి లభించింది
- ✔ డియాన్‌కు ఇది రెండో ఆస్కార్ - తొలిది 'ది బ్యూటీ అండ్ ది బీస్ట్' పాటకై!
- ✔ 'లెటజ్ టాక్ అబౌట్ లవ్' 2 కోట్ల 80 లక్షల కాపీలు అమ్ముడుపోయింది.
- ✔ 1998 లో 'దీజ్ ఆర్ స్పెషల్ టైమ్స్' ఆల్బమ్ విడుదల
- ✔ 1999 లో 'ఆల్ ది వే..' ఇది అన్నిటికంటె పెద్ద హిట్.

గత ఏడాది మధ్యలో రిలీజయిన 'ఎ న్యూ డే హేజ్ కమ్' కూడా సక్సెసే!



## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : ఆదిత్య
వెల : రూ. 38/-




విడుదల : సోహన్
వెల : రూ. 38/-




విడుదల : ఆదిత్య
వెల : రూ. 30/-




విడుదల : బ్లిస్
వెల : రూ. 19.99/-




విడుదల : మయూరి
వెల : రూ. 38/-

# న్యూస్ వ్యూస్

## చిత్రకు పుత్రికోదయం



బహుభాషా గాయని చిత్ర డిసెంబరు 19న ఒక ఆడపిల్లకు జన్మనిచ్చారు. మాతాశిశువులు క్షేమం. ఈసందర్భంగా చిత్ర దంపతులకు సినీ సంగీత ప్రియులందరి తరఫున 'హాసం' శుభాకాంక్షలను తెలుపుతోంది.

గాయకుడు రాజేష్ హీరోగా

## "ఓరి నీ ప్రేమ బంగారం కానూ..."



'ఎటో వెళ్ళిపోయింది మనసు' (నిన్నే పెళ్ళాడతా), 'బాగున్నారా బాగున్నారా... బావగారు బాగున్నారా' (మాస్టర్) 'గుడిగంటలు మోగిన వేళ', 'ఓ ప్రేమ ఎందుకని' (నిన్నే ప్రేమిస్తా), 'మేఘమై నేను వచ్చాను' (నువ్వు వస్తావని), 'కవ్వించకే ఓ ప్రేమా' (రాజా) వంటి ఎన్నో గీతాలను ఆలపించి ఆంధ్ర ప్రేక్షకులను అలరించిన నేపథ్య గాయకుడు రాజేష్ ఇప్పుడు తెరపై హీరోగా కనిపించడానికి రంగం సిద్ధమైంది. నూతన చిత్ర నిర్మాణ సంస్థ 'మైత్రీటాకీస్' దీనికి సన్నాహాలు చేస్తోంది.

ప్రముఖ హాస్యనటుడు ఏవీయస్, సుప్రసిద్ధ సంగీత దర్శకుడు మణిశర్మలు నెలకొల్పిన ఈ బ్యానర్‌లో రాజేష్ హీరోగా పరిచయం కాబోతున్నారు. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషలలో నేపథ్య గాయకునిగా ఇప్పటివరకు దాదాపు మూడు వేలకు పైగా పాటలను పాడిన రాజేష్, తెలుగు, కన్నడ రాష్ట్ర ప్రభుత్వ అవార్డ్‌ను కూడా అందుకున్నారు. తెరవెనుక నేపథ్య గాయకునిగానే కాక తెరపై హీరోగా అలరించడానికి సిద్ధమైన రాజేష్ ఈ సందర్భంగా మాట్లాడుతూ కన్నడ, తమిళ భాషల్లో హీరోగా ఎన్నో అవకాశాలు వచ్చినప్పటికీ తెలుగులో ఏవీయస్, మణిశర్మ గార్ల కాంబినేషన్, చిత్రకథ ఎంతగానో నచ్చటం వల్ల అంగీకరించినట్లు తెలిపారు.

ఈ వినోదాత్మక సంగీతభరిత ప్రేమకథా చిత్రం 'ఓరి నీ ప్రేమ బంగారం కానూ' జనవరిలో పాటల రికార్డింగ్ జరుపుకుని, ఫిబ్రవరి 10 నుంచి షూటింగ్ కార్యక్రమాలను ప్రారంభించుకుని సింగిల్ షెడ్యూల్‌లో నిర్మాణ కార్యక్రమాలను పూర్తి చేసుకుంటుందని చిత్ర దర్శకుడు ఏవీయస్ తెలిపారు. హీరోయిన్‌తో పాటు ఇతర నటీనటుల వివరాలు త్వరలో ప్రకటించడం జరుగుతుంది.

రచన: సాహితి **1** గానం : శంకర్ మహదేవన్

చందు :అందాలొలికే శ్రీమతిగారూ చిరుబుర్రు మీకేలా
ఓయిలాలో... ఓయిలాలో... ॥2॥
పండువంటి భార్యామణికి బుంగమూతి కోపాలా
ఓయిలాలో... ఓయిలాలో... ॥2॥
గజ : ఓసోస్! ఇంతోటి బీసీనాటి పాటకేనా... బీబీసీ బిల్డప్ ఇచ్చారు?
చం : అర్ధదే నీతొ... నేను బీటు కొట్టానంటే ఈ స్టేటే దద్దరిల్లిపోవాలి అరే...ఏసుకోరా...
చం : ఏందిబై ఏందిబై పెండ్లమంటే ఏందిబై...
జరబద్రం వినరోయ్ జగమేలే అమ్రోరురోయ్
బాలు: ఇంటి వెలుగు శ్రీమతోయ్ అచ్చతెలుగు సామెతోయ్
ఆలి అంటె ఎవరోయ్ ఆ ఆదిపరాశక్తిరోయ్
చం : చేతిలో... త్రిశూలం లేకపోయినా
తన మనసెంతో... విశాలం జరదేఖోనా...
ము: ఈ దునియాలో... వీళ్ళుమనకు భార్యలు కావడమే లక్కురో ॥2॥
చం: మీ ఆకు పూజ మహిమవల్లె మంచిగున్ననే
కా: నువ్వు అందాల భార్యవని పొంగిపోతినే
బాలు: ఎన్ని జన్మలెత్తిన నీ రుణం తీరునే
కా: నువ్వేదికొన్న కిమ్మనక గమ్మునుందునే
ము : అష్టలక్ష్మి ఇష్టలక్ష్మి గృహలక్ష్మిలు మీరేకదా ॥ ఏందిబై ॥
చం: భార్యగా... సేవలెన్నో చేసుకుంటు సహనమెంతో చూపుకునే
ఆడదాని స్థానమెంత గొప్పదిరో...
తల్లిగా... స్త్రీమూర్తి విలువ ఎవరెస్టు ఎత్తురో
బాలు: దేవతలెవరంటే శ్రీమతులేరో
కా: దేవుడు మనకిచ్చిన బహుమతులేరో
బా: మన సతులు గుణవతులు భారతాన పతివ్రతలు
సతులేకద పతులకు కొండంత అండరో
తను లేకుంటే మగ బతుకొక బుదిబండరో ॥2॥
చం: చెంగుచెంగుమంటు చక్కని పావలు చంకనెక్కితే సందదేరో... ॥ ఏందిబై ॥
బా : హైషెబా... లేత జున్ను ముక్కలాంటి మొక్కజొన్న పొత్తులాంటి
గుమ్మపాల పొంగులాంటి పోరిరో
చం: హాయ్‌రబ్బా... హొయలు చూస్తె బల్‌కిస్‌మిస్ ప్యారిరో
కా: సీటు చూస్తె మస్తేమే బస్తీ సవాల్
బా : చాందినీ రూప్‌లో కుస్తాబహార్
చం: అది అడుగెడితే చార్మినారే అయిపోతది సోనాటవరే
కా: లగిజిగి జడ ఎగిసిపడే జిలుగు వయారీ
ఇది బిగి నడుములు మెలికపడే సిలుకు సఫారీ ॥2॥
చం: దీని రంగు చూసి మేని పొంగు చూసి
పాగలైతిరా నాదిల్‌పూరా
బాలు: అరె...ఏందిబై ఏందిబై గల్లజూస్తవేందిబై
మస్తుగుంది రంబాయ్ దాన్ని దీస్కబోర ముంబాయ్ ॥2॥ ॥ ఏందిబై ॥



రచన: పోతుల రవికిరణ్ **5** గానం:మాల్గాడి శుభ, గంగ, రాధిక

గజ : బోండానా... బజ్జీనా...
వసు : బెంగాలీ... మిర్చీనా...
ప్రియ: కలకత్తా.. కాళీన్నా...
వసు: రుచులను ఘరిగి బుసలు కొడుతూ తెలియని మత్తులో తూగుతారా...
ప్రియ: రసికత పెరిగి రమణులంటూ ఊసరవెల్లిగ మారుతారా...
గజ: భార్యంటే అలుసారా...? ॥బోండానా॥
వసు: సావిత్రి, అనసూయ... కాలమసలు కాదిదిలే మీకు మేము ఎక్కువలే
గజ : మీ ఫేసుకు మీసాలా...
ప్రియ: ఐశ్వర్య అందాలు మిటకరించి చూస్తారే గుటకలేస్తూ ఉంటారే
వసు: మీరంతటి హీరోలా...
గజ : మేమంటూ లేకుంటే మీరంటూ ఉంటారా
వసు : రుచులను ఘరిగి బుసలు కొడుతూ తెలియని మత్తులో తూగుతారా
ప్రియ: రసికత పెరిగి రమణులంటూ ఊసరవెల్లిగ మారుతారా
ముగ్గురు : సతి ఉంటే సవతేలా...? ॥బోండానా॥
ప్రియ: మీరెంతటివారైనా కాంతదాసులేకదరా
కాంక్షలింక చాలునురా కథలెందుకురా మగడా...
గజ: రంగంలో దింపిది రంగసాని ఎవరైనా
గొంతుకొరికి చంపయినా బెజవాడ దుర్గనేరా
వసు: కన్నుల్లో మేమున్నా... గుండెల్లో వేరొకరా...
ప్రియ: రుచులను మరిగి బసులు కొడుతూ తెలియని మత్తులో తూగుతారా...
వసు: రసికత పెరిగి రమణులంటూ ఊసరవెల్లిగ మారుతారా...
ము : సతి అంటే సవతేలా...? ॥బోండానా॥

రచన: కృష్ణసాయి **6** గానం: అనురాధ శ్రీరామ్, నిత్య సంతోషిణి

హని : హాయ్.. గైస్ అంజు : హాయ్... హాండ్సమ్
మంజు: హాయ్... స్వీట్ హార్ట్ హని : హాయ్... స్మార్టీ
ముగ్గురూ : హాయ్ హాయ్ టీనేజ్ సీజన్... డోంట్ ఆస్క్ ఎనీ రీజన్ ॥2॥
డ్రీమ్‌సాంగ్... పాడేద్దాం... షేక్‌డాన్స్ ఆడేద్దాం...
ఫ్రీబర్డ్స్... ఐపోదాం ఫ్లయింగ్ కిస్... ఇచ్చేద్దాం...
చికుబుకునడకల... షకలక హొయలుతో... పసిఫిక్ అందం చూపిస్తాం.॥హాయ్॥
హని : జీన్సుల్లో.. క్యాట్ వాకింగ్ జంక్షన్లో... బాయ్స్ వెయిటింగ్
అంజు : పబ్బుల్లో.. చిట్ చాటింగ్ డిస్కోల్లో... డ్రమ్స్ డాన్సింగ్...
మంజు: సెన్సేషన్... మా ఇంట్రడక్షన్ ఎట్రాక్షన్... మాలోని ఫ్యాషన్
హని : ఎవ్రీవన్.. ఎంజాయ్ అకేషన్
అంజు: ఎ.టి.ఎమ్... కార్డు ఉందిలే... ఏదైనా మాకు సాధ్యమే
మంజు: స్పైసీ గార్ల్స్‌కి... సాటిమేములే... సిల్లీథింగ్స్... ఇష్టమేనులే... ॥డ్రీమ్‌సాంగ్॥
అంజు : టైంపాస్‌కి... కాలేజీ... ఎంజాయ్‌కే... టీనేజీ...
మంజు: ఎఫ్.టి.వి.... టూ ఈజీ ఎం.టి.వి... సోక్రేజీ
హని : ఈమెయిల్లో... సిగ్నల్స్ ఇస్తాం... నాన్‌స్టాప్‌గా చాటింగు చేస్తాం
బాయిస్‌తో... బాంగ్రాలు చేస్తాం...
అంజు : పార్టీస్ లవ్‌కి... గ్రామ్‌ఫోను... సిక్స్టీస్ లవ్‌కి... టెలిఫోను
మంజు: ఎయిటీస్ లవ్‌కి... మైక్రోఫక్షను... లేటెస్ట్ లవ్‌కి... సెల్‌ఫోను
హని : I Want you... I miss you
I love you handsome... ॥డ్రీమ్‌సాంగ్॥



రచన: చంద్రబోస్ **1** గానం: ఎస్.పి.బాలు, చిత్ర

తనన....ఆహా.....ఏహే ఏహే...
అ: ఓసారి నీ చేయ్యేతాకి ఓసారి నీ చెంపేనొక్కి
ఓసారి యింకేదో చెయ్యాలా
ఆ: ఓసారి నీ కాలేతొక్కి ఓసారి నీ ఒళ్లే రక్కి ఓసారి ఏదేదో కావాలా
అ: పొగరే.... ఆ: దిగనీ
అ: సొగసే... ఆ: కందనీ...అనుభూతి మనదైన వేళ ఏహే ఏహే... ॥ఓ సారి॥
అ: ముద్దాడనా
ఆ: పెదవిని వలదని నడుమును ముద్దాడుకో
అ: వాటేయనా
ఆ: ఎదురుగ వలదని వెనుకగ వాటేసుకో
అ: చిన్నంగ నీ చెవిని స్పృశియించనా నున్నంగా నీ వేళ్లు నిమిరేయనా
ఆ పై లంఘించి విజృంభించి వివరించనా ఏహే ఏహే...
నిదురా... ఆ: వదిలే
అ: బెదురా.... ఆ: లేదులే...చూడాలి శృంగార మేళా ॥ఓ సారి॥
ఆ: వేధించనా
అ: సరసము సగమున విడిపడి వేధించుకో
ఆ: వడ్డించనా
అ: అడగని క్షణమున ఎగబడి వడ్డించుకో
ఆ: నా కట్టు వస్త్రాలు వదిలేయనా నీ గట్టి ఒత్తిళ్లు ధరియించనా
అంతా అయిపోతే తెగసిగ్గేసి తలవంచనా ఏహే ఏహే...
అ: వ్రతమే.... ఆ: చెడనీ
అ: ఫలమే.... ఆ: అందనీ...చేరాలి స్వర్గాల మూల ॥ఓ సారి॥

రచన: చంద్రబోస్ **2** గానం: కళ్యాణ్ మాలిక్, సునీత

ఆ: చందమామ కథలో చదివా రెక్కల గుర్రాలుంటాయని
నమ్మడానికి ఎంత బాగుందో
బాలమిత్ర కథలో చదివా పగడపు దీవులు వుంటాయని నమ్మడానికి ఎంత బాగుందో
నా కోసం రెక్కల గుర్రం ఎక్కి వస్తావని పగడపు దీవికి నువ్వే నన్ను తీసుకెళ్తావని
యిక ఏనాటికి అక్కడే మనం వుంటామని నమ్మడానికి ఎంత బాగుందో ॥2॥
అ: నువ్వే నాకు ముద్దొస్తావని నేనే నీకు ముద్దిస్తానని నమ్మడానికి ఎంత బాగుందో ॥2॥
ఆ: వరహాల బాటలోన రతనాల తోటలోన వజ్రాల మేడలోన బంగరు గదిలోన
ఆ: విరితేనెల్లో పాలల్లో తానాలాడేసి
అ: నెలవంకల్లో వెన్నేల్లే భోంచేసి
ఆ: నలు దిక్కుల్లో చుక్కల్లే చిలుకలు చుట్టేసి
అ: చిలకే కొరికి
ఆ: దరికే జరిగి మురిపెం పెరిగి మరినువ్వే నాకు ముద్దిస్తావని
ముద్దుల్లోన ముద్దవుతావని ॥నమ్మడానికి॥
ఆ: ఎగిరేటి ఏనుగొచ్చి పలికేటి జింకలొచ్చి నడిచేటి చేపలొచ్చి అడవికి రమ్మనగా
అ: ఆ కోనల్లో కొమ్మల్లో ఊయ్యాలూగేసి

రచన: చంద్రబోస్ **6** గానం:ఎస్.పి.చరణ్

కనిపించవమ్మా...ఓ పూలకొమ్మా వస్తున్నా... నీకోసం
వినిపించుకోమ్మా... ఓ జాబిలమ్మా యిస్తున్నా... సందేశం
చీకటే మూసిన ఆకసం నేనని జరిగిన కథ యీరోజు వివరించనీ... ॥కనిపించవమ్మా॥
నాలో... లోలో...నీమమతల నీగురుతుల దేవతకళ కొలువుండనీ
ఎన్నో ...ఎన్నెన్నో...విధిరాతల చెడుచేతల విషజ్వాలలు రగిలాయనీ
నీ చూపు నిప్పుల్లో దూకేసినా నా కంటి నీళ్లల్లో నే తేలనా
మదినే తెరచి ప్రమిదే చేసి మన వలపుల దీపాన్ని వెలిగించనా.... ॥కనిపించ॥
నేనే... విన్నా... అనురాగపు తెరచాటున అనుమానం వుంటుందనీ
నేడే...అంటున్నా... అనుమానపు తెర వీడగ అనుబంధం బిగిసేననీ
మేఘాన దాగున్న ముత్యానిగా శిశిరాన దాగున్న చైత్రానిగా
ఎదుటే పడనీ మసకే వీడనీ నువ్వు నిలిచిన హృదయాన్ని చూపించనీ...॥కనిపించ॥

రచన: చంద్రబోస్ **7** గానం : కీరవాణి, గంగ

ఒలపింక్ క్రీడల్లో పేకాటకే పెద్ద పీట వేస్తే
ఒసామా బిన్ లాడెన్ అన్నమయ్య వి.సి.డి. చూస్తుంటే
మడోన్నా మావుళ్ళమ్మ జాతరకొచ్చి ఫోక్ సాంగ్ కొడితే
సహారా ఎయిర్‌లైన్స్ సత్తెనపల్లి సంతలోన ఆఫీసే తెరిచేస్తే ॥విడ్డూరం॥
గులాబి రేకుల్తో గుండె జబ్బుకే మందే కనిపెడితే
జిలేబి పానకంతో నడిచే కారులు ఇండియాకు వస్తే
మసాలా దోసెల మీద పచ్చడి మీద పి.హెచ్.డి. చేస్తే
పొలంలో దుక్కిని దున్నే రైతుకి సైతం లక్షల్లోనే సెల్లు బిల్లు వస్తే ॥విడ్డూరం॥
సినీ తారలు వాన పాటలో నాభి చూపకుంటే - బొడ్డూరం...బొడ్డూరం...బొడ్డూరం
సిటీ రోడ్లపై యమా స్పీడులో పడవలు వెళుతుంటే- తెడ్డూరం
బందరు లోని మిఠాయి కొట్లో స్వీటే లేకుంటే - లడ్డూరం
బాడీలోని రక్తం రంగు బ్లాకే అయిపోతే - రెడ్డూరం
తెలుగు ఫిల్మ్‌లో తెలుగు పాటలు తెలుగు తెలిసిన తెలుగు వాళ్లతో
ఈ రోజుల్లో పాడించారంటే ॥విడ్డూరం॥
కరెంటు బల్బులపై మణుగురు పురుగులు యుద్ధం ప్రకటిస్తే
సిమెంటు రేకులతోటి కాకులు చిలకలు గూళ్లు కట్టుకుంటే
కొమ్మపై కోకిల గొంతుకు జలుబే చేసి విక్స్ వాడుతుంటే
నాన్‌వెజ్ తినడం నేను మానేసానని పులి కుందేలుకి ఫోన్ చేసి చెబితే॥విడ్డూరం॥
పుంజు పెట్ట సరసమాడగా ఆమ్లెట్ పుడుతుంటే - గుడ్డూరం...గుడ్డూరం...గుడ్డూరం
తెలుగు భాషలో అక్షరాలుగా ఎక్స్ వై లు వుంటే - జెడ్డూరం
ఉగాది పచ్చడి చిల్లి చికెన్ కలిసి వడ్డిస్తే - పుడ్డూరం
డన్‌లప్ కంపనీ తాటాకులతో చాపలు చేస్తుంటే - బెడ్డూరం
సోమవారము మొదలు పెట్టిన చిత్రహింసల టీ.వి సీరియల్
మంగళవారమే ముగింపుకొచ్చేస్తే ॥విడ్డూరం॥

వ: సందడే... సందడి... సందడే... సందడి
ఈ పోరగాళ్ళు ఒక్కచోట చేరెనంటే ॥సందడే॥
ఈ తుంటరోళ్ళే చేయి చేయి కలిసెనంటే
పనికిరాని ఇత్తడినైనా.. బంగారం చేస్తారూ...
చాణుక్యుడి మనవలు వీళ్ళు.. ఐడియాలు వేస్తారు...
అద్భుతాలు చేస్తారు... వీళ్ళకెవరు సాటిలేరురా... ॥సందడే॥
చ : హాటే... హాట్... కన్నె మనసునీ... క్షణాలలో పట్టేస్తారూ...
స్వీట్... స్వీట్... సాంగ్ పాడుతూ... నిషాలలో.. ముంచేస్తారూ...
కోరుకున్న కానుకేదో చేతబెట్టి
కట్టుకున్న దానికళ్ళు కప్పుతారూ
మూడుకళ్ళ శివుడికైన అందకుండా...
ముద్దుగుమ్మ తోటి ట్రాకు నడుపుతారు...
ఇంటి పుద్దు ఆ వైపు... ఫాస్టు పుద్దు యీవైపు
రెండు నోళ్ళ కేటుగాళ్ళు వీళ్ళేనయా...
వీళ్ళు... ఎక్కడున్నా అంతులేని సందడేనయా... ॥సందడే॥
చ : ఫ్లేటే... తిరగబడ్డదీ పసందుగా ఓ సంసారీ
తాడే... త్రాచుపాములా వెంటాడితే ఏందారీ
కడుపులోని బాధనేమో కక్కలేరు...
కళ్ళముందు సాగుతోంది చూడలేరు...
సీటు కింద మంటనేమో ఆర్పలేరూ..
స్వీట్‌గాళ్స్‌తో రొమాన్సు చెయ్యలేరూ...
పేకమేడ కట్టారూ కూలిపోయి చెడ్డారూ
అబ్బదీని తస్సదియ్య ఏమిసేసురో... అరె
ముందునుయ్యి... వెనక గొయ్యి వింత చూడరో... ॥సందడే॥

రచన: సామవేదం షణ్ముఖశర్మ **4** గానం: టిప్పు, సుజాత

ఆ:అ: ఐ యామ్ ఇన్ లవ్
ఆమె: .........జౌనా... జౌనా.... ప్రేమలోనా అపుడే పడ్డానా...
అ : ఏదేమైనా ఈ హిరానా తప్పదమ్మ ఎప్పుడైనా...
ఆ : ఇన్నాళ్ళుగ ఎదలో దాగిన రూపం ఎదురై కనబడగా... ॥జౌనా॥
ఆ : అంతా నీవ్వే కాగా... ఆనందం నువ్వైరాగా నీ సొంతమై చేరుకున్నాగా...
ఎటు నువ్వెళుతూ వున్నా... నువెళ్లే దారుల్లోన నీ నీడనై నేనున్నా...
అ : నువ్వే నవ్వంగానె... నే దోసిలి పడుతూ వున్నా...
ముత్యాలనే అందుకున్నా...
నీ చెక్కిలి నొక్కుల్లోన నే చిక్కుకుపోతూ వున్నా... నీ చెంతనె చేరుకున్నా...
ఆ : హృదయమా... అంతలేని పయిలోకి పయనమా...
అ : ప్రియతమా... అంతే పట్టనివ్వదమ్మప్రేమమహిమ ॥జౌనా॥
అ : కనురెప్పల్లో దూరీ... నా కలగా నువ్వు చేరి
నా లోకమే నువ్వుగా మారీ...
పువ్వుల పరిమళమంత నీ జాడను అందిస్తుంటే నీ జంటనే చేరాలీ...
ఆ : నాలుగు దిక్కుల్లోనా నీ చిత్రాలే చూడాలి
నా గుండెలో నువ్వుండాలీ...
నా ఊపిరిలో... గాలి నీ పేరే జపియించాలి నీ కోసమే బ్రతకాలి...
అ: చిటికెలో... నీ చేతులో బందించావే మనసునీ
ఆ: చిలిపిగా... నీ మాయల్లో ముంచేశావే మదిని



రచన: కృష్ణసాయి **2** గానం : రఘు కుంచె, సందీప్, నిత్య సంతోషిణి

అ : రావే రాజకుమారి...
ఆ : రారా రాజకుమారా...
అ : రావే రాజకుమరి స్కూటరుపై అలా షికారు చేసొద్దాం ఛలో వయ్యారి
ఆ : రారా రాజకుమారా అయ్యేలే నేతయారూ ఇంట్లోకెన్నో కొనాలి తమరూ
గజ: అహహా... రంగుల టీవీ
అ : టీవీ... టీవీ... చూస్తే కళ్ళకు హాని దేవీ
ప్రి: ఒహోహొహో... వాషింగ్ మెషినూ
అ : వాషింగ్... మెషినూ... డ్రైక్లీనింగ్‌లో ఏవన్ నేను...
వ : అహహా... మిక్సర్ గ్రైండర్
అ : మిక్సర్... గ్రైండర్... లేదా పక్కింట్లో పెట్టేసేయ్ టెండర్ ॥రావే॥
వ : అహహా... చల్లని కూలర్
అ : కూలర్... కూలర్... సమ్మర్ పోనీ చూద్దాం డియ్యర్
గజ: ఒహొహో... లేటెస్ట్ ఫ్రిజ్జు
అ : ఫ్రిజ్జు... ఫ్రిజ్జు... కొందామంటే లేదే గుజ్జు...
ప్రి: అహహా... డబలు కాటూ...
అ : డబలూ... కాటూ... ఫస్ట్‌నైటు అయ్యాక కొంటాన్లే ఒట్టు.. ॥రావే॥
గజ: అహహా... వజ్రపు రింగూ...
అ : రింగూ... రింగూ... ఐశ్వర్యరాయికె... అది సరి తూగూ...
ప్రి: లలలలలా ఫారిన్ సెంటూ...
అ : సెంటూ... సెంటూ... చర్మరోగాల ఆయింట్మెంటూ...
వ : అహహా... గాగ్రా ఛోళీ
అ : ఛోళీ.. ఛోళీ వాణ్మొ చెయ్యలీ ఆ బ్యాంకే ఛోరీ... ॥రావే॥
ప్రి: నా టైం బ్యాడు వీడేం మొగుడూ...
అ : బిర్లా కాదే నీ హజ్బెండూ...
వ : ఏదీ కొనడు పైగా ఫ్రాడూ...
అ : ఐతే ఐస్‌క్రీం కొంటా చూడూ
గ : పేటకు మీసం మూరెడు పెంచి వంచించాడే నిలువున ముంచీ...
ప్రి.వ: ఛీచిఛీఛీ... సిగ్గేలేదా
ఇ : థూథుథుథూ... రోషం రాదా
ము: ఛాఛఛఛా... బిల్డప్ అంతా
అ : సారి... సో సారి... ఎక్స్‌ట్రీమ్‌లీ సారి!!!

రచన: భువనచంద్ర **3** గానం : శ్రీరామ్, కుషీ మురళి, హనుమంతరావు

సాకీ: కాలికేస్తే వేలికేసి వేలికేస్తే కాలికేయు
గోలుమాలు గాళ్ళ బేచ్ వచ్చెచూడరా..
కంటిలోని పాపనైన కళ్ళముందె మాయచేయు
కోడెగాళ్ళ వింతగాథ చూడుసోదరా..
మహా మాయగాళ్ళు... మాటలెన్నో చెప్తారు...
వీళ్ళతోటి పెట్టుకోకురా...



రచన: చంద్రబోస్ **5** గానం:ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

తలకు కొబ్బరి నూనెతో, ఫుల్ హ్యాండ్ షర్టుతో
చేతులో విక్రమ్ గైడ్‌తో, జేబులో సిటీబస్సు పాస్‌తో
కదలి వస్తున్న ఓ తెలుగు విద్యార్థి....
చదవడానికెందుకురా తొందరా, లవ్వు చేయడమే నేర్చుకోరా ముందరా...॥2॥
ఫస్ట్ పీరియడ్ లవ్ తెలుగు...ఇందులో...
అమ్మాయిని మాటలోకెట్టా దించాలో అమ్మాయి అందాన్ని ఎట్టా పొగడాలో
ఎట్టా దించాలో ఎట్టా పొగడాలో
ఆ పిల్లకు ప్రేమలేఖ ఎట్టారాయాలో
ఫస్ట్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో ఫస్ట్ సైట్లోనే లవ్వు చేసుకో
సెకండ్ పీరియడ్ లవ్ మాథమాటిక్స్
అమ్మాయితో అనుబంధం కూడేదెట్టాగో
అమ్మాయితో మొహమాటం తీసేదెట్టాగో కూడేదెట్టాగో తీసేదెట్టాగో
ఆ పిల్ల ఫ్రెండ్స్‌ని భాగించేదెట్టాగో
సెకండ్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో సెకండ్ ఛాటే నువ్వు దూసుకెళ్లిపో
థర్డ్ పీరియడ్ లవ్ హిస్టరీ
అమ్మాయి నాన్నగారు ఏంచేస్తుంటాడో
అమ్మడికి ఆస్తిపాస్తులెంతెంతున్నాయో ఏంచేస్తుంటాడో ఎంతెతున్నాయో
ఆ పిల్లకు పెళ్లికాని అన్నయ్యలు ఎందరో
థర్డ్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో హోర్డ్‌వర్కే చేసి లవ్వు గెలుచుకో ॥చదవ॥
పోర్త్ పీరియడ్ లవ్ ఫిజిక్స్
మాగ్నెట్‌లా మనవైపు ఎట్టా లాగాలో
తన ఒంట్లో కరెంటును ఎట్టా పెంచాలో ఎట్టా లాగాలో ఎట్టా పెంచాలో
యాక్షనుకు రియాక్షను ఎట్టా యివ్వాలో
ఫోర్త్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో గుర్తు వుండేలా పర్స్ చూపుకో
ఫిఫ్త్ పీరియడ్ లవ్ కెమిస్ట్రీ
విడిపోని లవ్ బాండ్ ఎట్టావేయ్యాలో
ఒకటయ్యే ఈక్వేషన్ ఎప్పుడు రాయాలో
ఎట్టావేయ్యాలో ఎప్పుడు రాయాలో
ఆపైన ప్రాక్టికల్స్ ఏమేం చెయ్యాలో
ఫిఫ్త్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో
డెస్ట్ పెంచేసుకో డేర్ చేసుకో
లాస్ట్ పీరియడ్ లవ్‌స్పోర్ట్స్
అమ్మాయి ఇంటిగోడ ఎట్టా దూకాలో
ఎవడైనా అడ్డొస్తే ఎట్టా కొట్టాలో ఎట్టా దూకాలో ఎట్టా కొట్టాలో
అమ్మాయిని తీసుకొని ఎట్టా పురకాలో
లాస్ట్ పీరియడ్‌లోన నువ్వు తెలుసుకో
లాస్ట్‌దాకా తనతో లైఫ్ పంచుకో ॥చదవ॥



ఆ: ఆ కొమ్మల్లో పళ్లన్నీ రుచి చూసి
అ: ఆ పళ్లల్లో మైకంతో మోహం కమ్మేసి
ఆ: చలిగా గిలిగా తొలిగా త్వరగా అటుగా యిటుగా మరి నువ్వే నాకు ముద్దిస్తావని
తడి వేదాలు ముద్రిస్తావని ॥నమ్మదానికి॥

రచన: చంద్రబోస్ **3** గానం : కీరవాణి, గంగ

అ:ఒక మనసుతో మనసుకి ముడి ఎట్టా వేసావు
ఆ ముడి ఒక కొంగుముడయ్యేదాకా పూరుకోవు....ప్రేమా.... ॥ఒక॥
అ:పసిపాపలో ముసినవ్వులా కపటాలు లేని ప్రేమ
ముని మాపులో మరుమల్లెలా మలినాలు లేని ప్రేమ
ఆ:అర చేతిలో నెలవంకలా తెరచాటు లేని ప్రేమ
నది గొంతులో అల పాటలా తడబాటు లేని ప్రేమ
అ/ఆ:మనసుల కలిమిడి ఫలితం ప్రేమ
తనువుల తాకిడి కాదు సుమా
అనంత జీవ యాత్రలోన తోడు ప్రేమ...ప్రేమా...॥ఒక॥
అ:అధరాలలో తడిమెరుపులా మెరిసేది కాదు ప్రేమ
హృదయాలలో ధ్రువతారలా అలరారుతుంది ప్రేమ
ఆ:పరువాలతో కరచాలనం చేసేది కాదు ప్రేమ
ప్రాణాలలో స్థిరబంధనం నెలకొల్పుతుంది ప్రేమ
అ/ఆ:మమతల అమృత వర్షిణి ప్రేమ
కోర్కెల అలజడి కాదు సుమా
నిశీధిలోను విడిపోని నీడ ప్రేమ ప్రేమా.. ॥ఒక॥

రచన: చంద్రబోస్ **4** గానం: స్మిత

నవమల్లిక నేనై పూచానోయ్
నా పరిమళమంతా దాచానోయ్
గ్రహించే గాలివి నువ్వై, స్పృశించే చినుకువి నువ్వై
ధరించే సిగవై చేరుకోరా సుందరా...
నువ్వే ముఖ చిత్రం అయిన పుస్తకమై వున్నాను
ప్రతీ ఒక పేజీ వదలక చదువుకుపొమ్మన్నాను ॥నవ॥
శ్వాస మరిగిందోయ్ ఆశ తరిమిందోయ్
ఘోష గుండెల చాటున పెరిగిందోయ్
పైట నిలబడదోయ్ మాట తడబడెనోయ్
పూట గడవని పరువం అడిగిందోయ్
రోజు నీపేరే రామనామంలా ఆలపించాను నమ్మరా
ఒక్క రోజైనా సీతలా నన్ను స్వీకరిస్తేనే చాలురా ॥నువ్వే ముఖ॥ ॥నవ॥
పువ్వు పూజకని పండు విందుకని నీకు తెలుసును కదరా సుందరుడా
నేను మగువనని నాది సొగసు అని అంతా తెలిసిన మీదట ఎందుకిలా
పరులకో న్యాయం నాకు ఓ న్యాయం ప్రియతమా నీకు న్యాయమా
నేను మగ అయితే నువ్వు మగువైతే తక్షణం నిన్నే ఏలనా ॥నువ్వే ముఖ॥ ॥నవ॥

ఆదిత్యరామ్ మూవీస్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

Adityaram's

# సందడే సందడి

Non-Stop Entertainment

ఆదిత్య రామ్ A.M.I.E ముప్పలనేని శివ



ఆదిత్య రామ్



ముప్పలనేని శివ



భువనచంద్ర

## తారాగణం

జగపతిబాబు, రాజేంద్రప్రసాద్, శివాజి, ఊర్వశి, రాశి, సంఘవి, కోవై సరళ, సోనాలి జోషి, సోనీ రాజ్, స్వప్న మాధురి, తెలంగాణ శకుంతల, కోటా శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఆలీ, యం.యస్.నారాయణ, సూర్య



పోతుల రవికిరణ్



సాహితి



కోటి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ-మాటలు | : రాజేంద్రసింగ్ బాబు |
| సంగీతం | : కోటి |
| మాటలు | : చింతపల్లి రమణ |
| కెమెరా | : సి.హెచ్.రమణరాజు |
| పాటలు | : భువనచంద్ర. సాహితి, పోతుల రవికిరణ్, సాయి కృష్ణ, సామవేదం షణ్ముకశర్మ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : రమేష్ రాజా యం. |
| మేకప్ | : రాజేష్, సతీష్ |
| డాన్స్ | : శంకర్, స్వర్ణలత, ప్రదీప్ |
| ఫైట్స్ | : స్టంట్ శివ |
| కాస్ట్యూమ్స్ | : ఇర్షాద్-నరేంద్ర కుమార్ |
| స్టిల్స్ | : కె.విజయకుమార్ |
| ఆర్ట్ | : కె.వెంకటేశ్వరరావు |
| పి.ఆర్.ఓ. | : జగన్ |
| పబ్లిసిటీ డిజైనర్ | : రామ్ డిజి గ్రాఫిక్స్ |
| ఎడిటర్ | : కె.రమేష్ |
| క్యాషియర్ | : సి.యస్.ఆర్.బాబు |
| నిర్మాణ నిర్వహణ | : కె.పైడిబాబు |
| నిర్మాత | : ఆదిత్యారామ్ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ముప్పలనేని శివ |



## తారాగణం

రవితేజ, వాణి, సంగీత, బెనర్జీ, అజయ్‌రత్నం, సన, ప్రీతినిగమ్, ప్రభావతి, విద్య, చంద్రమౌళి, కళ్ళు కృష్ణారావు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| పాటలు | : చంద్రబోస్ |
| సంగీతం | : ఎం.ఎం.కీరవాణి |
| నిర్వహణ | : కె.వి.సుబ్బారావు |
| ఆర్ట్ | : యోగమహి |
| ఫైట్స్ | : రామ్-లక్ష్మణ్ |
| డాన్స్ | : రేఖా చిన్ని ప్రకాష్, అమ్మ రాజశేఖర్ |
| ఎడిటింగ్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫోటోగ్రఫీ | : రాజేష్ యాదవ్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : రాం ప్రసాద్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | :యలమంచిలి శేఖర్‌బాబు, కిరణ్‌బాబు, యలమాటి కాశీ |
| క్యాషియర్ | : అచ్యుతరావు |
| కో -డైరక్టర్ | : రవిచంద్ర |
| అసోసియేట్ డైరక్టర్ | : సురేష్ |
| రచనా సహకారం | : కెన్నడీ |
| అనువాదా సహకారం | : సాహితి |
| ఎఫెక్ట్స్ | : నారాయణ |
| సాంగ్స్ రికార్డింగ్ | : కోదండపాణి ఆడియోలాబ్ |
| పి.ఆర్.ఓ. | : పసుపులేటి రామారావు |
| కాస్ట్యూమ్స్ | : అంజిబాబు |
| మేకప్ | : శ్రీనివాస్ రాజు, వసంత |
| నిర్మాత | : బి.వి.యస్.యన్.ప్రసాద్ |
| కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం | : అగస్త్యన్ |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# ఈ అబ్బాయి చాలా మంచోడు





బి.వి.యస్.యన్.ప్రసాద్



అగస్త్యన్



యం.యం.కీరవాణి



చంద్రబోస్

న్యూస్ వ్యూస్

## హాస్య, సంగీత చిత్రాల ద్వారా "సంతోషం" పొందిన ఫిలిం డిస్ట్రిబ్యూటర్

పశ్చిమగోదావరి జిల్లాలో ఎస్.కె.పిక్చర్స్ పంపిణీ సంస్థను స్థాపించి అనతికాలంలోనే మంచి గుర్తింపు గల సంస్థగా తీర్చిదిద్దిన 'సంతోషం' పత్రిక పబ్లిషర్ & ఎడిటర్ సురేష్ కొండేటి తన సంస్థ విజయోత్సాహాన్ని తన సహచర పాత్రికేయ బృందంతో జరుపుకున్నారు. డిసెంబర్ 30వ తేది 2002 కు వీడ్కోలు తెలుపుతూ...2003కు స్వాగతం పలుకుతున్న శుభతరుణంలో జరిగిన ఈ వేడుకలకు యావత్ సినీ పాత్రికేయులంతా కలిసిరావడం ఓ విశేషం. వాసిరాజు ప్రకాశం ముఖ్య అతిథిగా విచ్చేసి-పత్రికా నిర్వాహణలో ఆర్థిక పరమైన సమస్యలే కాకుండా వృత్తిపరమైన ఎన్నో విమర్శలను ఎదుర్కొవలసివస్తుందని వాటన్నింటిని అధిగమించి ఎస్.కె.పిక్చర్స్ పంపిణీ సంస్థను స్థాపించి సక్సెస్ కావడం చాలా ఆనందించదగిన పరిణామం అని అన్నారు.

ఎస్.కె.పిక్చర్స్ అధినేత, సంతోషం సినీపత్రిక సంపాదకుడు సురేష్ కొండేటి మాట్లాడుతూ "లోగడ పశ్చిమ గోదావరి జిల్లాలో నేను కొన్ని చిత్రాలు పంపిణీ చేసినప్పటికీ, ఎస్.కె. పిక్చర్స్ విజయయాత్ర ప్రారంభమైంది మాత్రం "స్టూడెంట్ నెం.1" చిత్రంతో. నిజానికి ఆ చిత్రం పంపిణీ హక్కుల కోసం జిల్లాలోని ఎన్నో ప్రముఖ పంపిణీ సంస్థలు పోటీపడ్డాయి. అయినప్పటికీ నన్ను ప్రోత్స హించాలనే ఉద్దేశ్యంతో, నా మీద అభిమానంతో రాఘవేంద్రరావుగారు, అశ్వనీదత్‌గారు "స్టూడెంట్ నెం.1" డిస్ట్రిబ్యూషన్ రైట్స్ ఇచ్చారు. ఆ చిత్రం సంచలన విజయం సాధించి, మా సంస్థకి చక్కని గుర్తింపు తెచ్చిపెట్టింది. 'స్టూడెంట్ నెం.1' చిత్రం అయిదు కేంద్రాల్లో వంద రోజులు విజయవంతంగా ప్రదర్శించబడింది. 2002లో పశ్చిమగోదావరి జిల్లాలో మా ఎస్.కె.పిక్చర్స్ ద్వారా విడుదలయిన 'సంతోషం', 'అల్లరిరాముడు', 'ఇడియట్', 'తొట్టిగ్యాంగ్' చిత్రాలు విజయవంతమై నాతోపాటు ఎగ్జిబి టర్లందరికీ మంచి లాభాలు తెచ్చిపెట్టాయి. అన్నింటికి మించి 'సురేష్ కొండేటి కొంటే ఆ సినిమా హిట్' అనే సెంటిమెంట్ సినిమా పరిశ్రమలో ఏర్పడినందుకు ఆనందంతో నా కళ్ళు చెమరుస్తునాయి. నేను డిస్ట్రిబ్యూషన్ చేసే సినిమాలు తక్కువే అయినా, ఎన్ని సక్సెస్‌ఫుల్ సినిమాలు చేశామనేదే నాకు ముఖ్యం. ఈ మధ్య మెగాస్టార్ చిరంజీవిగారు 'సంతోషం' శతదినోత్సవంలో మాట్లాడుతూ "వేగం ఎక్కువయితే దానితో పాటు రిస్క్ ఎక్కువ అవుతుంది. నేర్పుగా గమ్యం చేరుకున్నవాళ్ళకే విజయం లభిస్తుంది" అని చెప్పిన మాటలు నాకు మరింత స్ఫూర్తి కలిగించాయి. ఆ దిశలోనే తక్కువ చిత్రాలు చేస్తూ, నాతో పాటు నలుగురికి నాలుగు డబ్బులు తెచ్చిపెట్టే సక్సెస్ ఫుల్ చిత్రాలు చేయాలని ఆశగా వుంది" అని అన్నారు.



'హాసం' పత్రిక సంపాదకులు రాజా మాట్లాడుతూ "సురేష్ కొండేటి 'వార్త'లో పరిచయం అయ్యాడు. 'భవిష్యత్తులో నీవు సినిమా పత్రిక పెడతావని, కారు కొంటావని చెప్పాను. అవి నిజ మయ్యాయి. ఇప్పుడు ఇంకో విషయం చెబుతున్నాను. చిరంజీవితో సురేష్ కొండేటి సినిమా నిర్మిస్తాడు. తప్పకుండా ఇది జరుగు తుందని జరగాలని కోరు కుంటున్నాను." అని అన్నారు.

సూపర్‌హిట్ పత్రిక ఎడిటర్ బి.ఎ.రాజు మాట్లాడుతూ "ఎవరు ఏమనుకున్నా ప్రతి పనిని పాజిటివ్ దృక్పథంతో తీసుకొని తను అనుకున్న లక్ష్యాన్ని పొందే వ్యక్తి సురేష్ కొండేటి. ఒకే ఏడాది నాలుగు విజయవంతమైన చిత్రాలను వరుసగా తమ సంస్థద్వారా పంపిణీ చేయడం గ్రేట్‌గా ఫీలవు తున్నాను" అని అన్నారు.

'సితార' ఇన్‌ఛార్జ్ ఎడిటర్ మోహన్ గోటేటి మాట్లాడుతూ "వృత్తిలో దూసుకుపోయే గుణం నిండుగా సురేష్‌లో వుంది. అతనితో తమ ప్రాజెక్ట్సును రూపొందించడానికి చాలామంది ప్రముఖులు ఈ రోజు వున్నారు" అని అన్నారు.

'శివరంజని' ఎగ్జిక్యూటివ్ ఎడిటర్ నాగేంద్ర కుమార్ మాట్లాడుతూ "సురేష్ కొండేటి కృష్ణాపత్రికలో పని చేస్తున్నప్పుడు నన్ను చిరంజీవి స్టిల్ కావాలని అడిగారు. నేను అప్పటికే స్టిల్స్ అన్నీ వేరే వాళ్ళకు ఇచ్చి ఒకే ఒక స్టిల్ నాకు అవసరం వస్తుందేమోనని భావించి వెంటనే ఇవ్వలేక పోయాను... తరువాత స్విట్జర్లాండ్‌లో షూటింగ్‌లో వున్న చిరంజీవి గారి నుండి నాకు ఫాక్స్ మేసేజ్ వచ్చింది. సురేష్ కొండేటికి స్టిల్ ఇమ్మని ! ఆ సంఘటన ఒక్కసారి నన్నునేను మరిచిపోయేలా చేసింది. అంటే... తన పనిని సమర్థవంతంగా నిర్వహించడానికి వెనుకడుగు వేయని వాడతను" అని అన్నారు.

'వృత్తిలో టైం పంక్చువాలిటీని ఖచ్చితంగా పాటించే సురేష్ భారతీయుడు చిత్రం ఆడియో ఆవిష్కరణకు చెన్నై నుండి విచ్చేసిన నిర్మాత ఎ.ఎం.రత్నంని తెల్లవారు ఝామున 3 గంటలకి ఇంటర్వ్యూ చేసి తరువాతరోజే పేపర్లో వచ్చేటట్లు చేసి అందరిని ఆశ్చర్యపరిచాడని, ఇలాంటి సంఘటనలు ఎన్నో అతడు తన కెరీర్‌లో చేశాడని' సూపర్‌హిట్ పత్రిక పాత్రికేయుడు జగన్ పేర్కొన్నారు.

సూపర్‌హిట్ పత్రిక ఫోటో గ్రాఫర్ సాయి రమేష్ మాట్లాడుతూ ఏపని చేసినా ప్లానింగ్‌తో చేయడం ఆయన అలవాటు. అతనిలో అతనికే తెలియని ఏదో పవర్ అతడిని నడిపిస్తోంది అని అన్నారు.

ఇంకా ఈ వేడుకలో చిత్రం ఎడిటర్ ఎల్.బాబూరావు, సీనియర్ పాత్రికేయులు వినాయకరావు, ప్రభు, పసుపులేటి రామారావు, పొట్లూరి వెంకట్రావు, గీత రచయిత భాస్కరభట్ల రవికుమార్, ఆంధ్రప్రభ సినీ పేజీఇన్‌చార్జ్ భగీరధ, ఇతర ఆత్మీయ మిత్రులు తమ శుభాభిందనలు తెలిపారు.

ఇంతమంది ప్రశంసలను అతి తక్కువ కాలంలో పొందిన సురేష్ కొండేటి పంపిణీ చేసిన చిత్రాలను ఒక్కసారిగా సింహావలోకనం చేసుకుంటే - వాటిలో అధిక శాతం చిత్రాలు మంచి సంగీతం, హాస్యంపై ఆధారపడినవే కావటం చెప్పుకోదగ్గ విశేషం. భవిష్యత్తులో విజయాన్ని స్వంతం చేసుకోవాలనుకొనేవారు ఈ అంశాలపై దృష్టిని సారించటం అవసరమని ఈ పాత్రికేయ సమావేశం పరోక్షంగా తెలియజేస్తోంది.


రాజా


బి.ఎ.రాజు


మోహన్ గోటేటి


నాగేంద్ర కుమార్


జగన్


సాయి
సాయిరమేష్


సత్యమూర్తి.వి
లిఫ్ట్ ప్లీజ్
ఎట్ యువర్ సర్వీస్ మిస్
థేంక్స్... ఈ రోజుల్లో కూడా ఇంత సంస్కారవంతులుండడం నిజంగా గ్రేట్
ఇతరులకు సేవ చేయడం నా జీవిత పరమావిధి. నేను చిన్నప్పట్నించీ అంతే
ఎక్కండి... ఎక్కడికి వెళ్ళాలో చెప్పండి
ఆసుపత్రికి.... నన్ను కాదు, ఈ బామ్మగారిని డ్రాప్ చెయ్యండి

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : ఆదిత్య
వెల : రూ 40/-

గతంలో డ్రైవర్‌బాబు, దాగుడుమూతల దాంపత్యం, అదిరింది అల్లుడు వంటి చిత్రాలను తీసిన నిర్మాత బి.వి.యస్.యన్. ప్రసాద్ ప్రముఖ తమిళ దర్శకుడు అగస్త్యన్ దర్శకత్వంలో రవితేజ హీరోగా నిర్మించిన 'ఈ అబ్బాయి చాలా మంచోడు' సినిమా ఆడియో విడుదలయింది. ఈ చిత్రానికి కీరవాణి సంగీత దర్శకుడు కాగా పాటలన్నిటినీ చంద్రబోస్ రాశారు.

బాలు, చిత్ర పాడిన 'ఓసారి నీ చెయ్యే తాకి' పాట హిట్ సాంగ్ ఆఫ్ ది ఆడియోగా పేర్కొనాలి. ఇప్పటికే ఈ పాట పల్లవి విజిల్ సౌండ్‌తో ఛానల్స్ ద్వారా పాపులర్ అయిపోయింది. 'వాతాపి గణపతింభజే' వంటి భక్తి గీతం ద్వారా మామూలు శ్రోతలకు కూడా పరిచయం వున్న 'హంసధ్వని' వంటి రాగాన్ని ఆధారంగా చేసుకొని ఓ శృంగార గీతాన్ని అత్యంత ఆకర్షణీయంగా రూపొందించటంలో కీరవాణి ప్రతిభ అణువణువునా తెలుస్తూనే వుంటుంది. పాటలో 'చిన్నంగ నీ చెవిని స్పృశియించనా/ఆపై లంఘించి/విజృంభించి' లాంటి వాక్యాలు, పదాలు చెవికింపుగా వినబడుతుంటే అసలీ పాట బాలూ పాడకుండా ఏ ఉత్తరాది గాయకుడి నోట పడివుంటే ఎన్ని చిత్ర హింసలతో బైటికొచ్చి వుండేదో తల్చుకుంటే ఒళ్ళుగగుర్పొస్తుంది. ఇక చంద్రబోస్...సరే..ప్రేమించటంలో "కొత్తకోణాలు" అక్షరానుభూతితో అందించాడు.

కీరవాణి సోదరుడు కళ్యాణ్ మాలిక్, సునీత పాడిన 'చందమామ కథలో చదివా' పాటలో సంగీతం సాహిత్యం సమపాళ్ళలో తూగేయి. ఎగిరేటి ఏనుగొచ్చి, పలికేటి జింకలొచ్చి, నడిచేటి చేపలొచ్చి అడవికి రమ్మనగా లాంటి- కలల్లోనూ, గ్రాఫిక్స్‌లోనే మాత్రమే సాధ్యమయ్యే-ఊహల్ని పోగేసి వాటిని 'నమ్మడానికి ఎంత బాగుందో' అని అంటుంటే-వాటిని మనోఫలకంపై ముద్రించుకుని వింటుంటే ఎంత బాగుందో!? శివరంజని రాగచ్ఛాయలలో రూపొందిన ఈ పాటలో 'తడివేదాలు' అంటూ చంద్రబోస్ చేసిన పద ప్రయోగం బావుంది.

కీరవాణి, గంగ పాడిన 'ఒక మనసుతో ఒక మనసుకి ముడి ఎట్టా వేస్తావో' పాట తెలుగు సినీ సంగీత చరిత్రలో చాలా కాలం పాటు నిలిచిపోయే పాట. ఎవరు పాడినా సరే వారికి ప్రశంసల్నీ, ప్రయిజుల్నీ తెచ్చిపెట్టే పాట. పాడుకుంటున్న కొద్దీ మనసుని మధురానుభూతితో బరువెక్కించే పాట. వింటున్న కొద్దీ చెవిలో అమృతం పోసినట్టనిపించే పాట. యమన్ కళ్యాణి రాగంలోని జీవస్వరాలన్నిటినీ రస స్పర్శతో నిమిరి అతి మృదువుగా మలచుకున్న పాట.

ఇక ఈ పాట పల్లవిని రిథమ్ లేకుండా మొదలు పెట్టి 'ప్రేమా' అనే పదం దగ్గర తబలాతో ఊపందించడం- అదే పదాన్ని ముగిస్తున్నప్పుడు వయొలిన్ వాంపింగ్‌తో ముగించటం ఎంత హాయిగా వుందో విన్నవారికీ తెలుస్తుంది. పాటలో 'ప్రేమా' అనే పదం వచ్చిన ప్రతిసారీ ఒక్కొక్క పద్ధతిలో వయొలిన్‌ని వయొలినిస్ట్ కళ్యాణ్ ద్వారా వాయింపజేసిన పద్ధతి- కీరవాణి పట్ల గౌరవాన్ని ఇనుమడింపజేస్తుంది. 'ప్రేమా' అంటూ కీరవాణి తీసిన ఆలాపన వింటుంటే-అలనాటి 'కానిస్టేబుల్ కూతురు'(1963) సినిమాలోని "చిగురాకుల ఊయలలో ఇలమరచిన ఓ చిలుకా" పాటలో పల్లవి అంతంలోనూ, చరణాల నుండి పల్లవిని అందుకునేటప్పుడూ పి.బి.శ్రీనివాస్, సుశీల తీసిన ఆలాపనలు (ముఖ్యంగా... మా చెల్లెలు బాల సుమా....ఏమెరుగని బేల సుమా... అంటూ 'సుమా' దగ్గర వచ్చే ఆలాపన) గుర్తొచ్చి ఆపాత మాధుర్యంతో హృదయం నిండిపోతుంది. పాత సంగీత దర్శకుల మెలోడీస్‌ని టేపుల్లో భద్రపరచుకుని రెగ్యులర్‌గా వింటూ మెమొరీ కార్డ్స్‌లో బలోపేతం చేసుకునే కీరవాణి వంటి ఇప్పటి సంగీత దర్శకులతో ఇలాంటి 'అనుసృజనాలు' మరింత తీయదనంతో బైటికొస్తుంటాయి. అలాగే ఈ పాటలో 'మనసుల కలిమిడి ఫలితం ప్రేమా'/ 'మమతల అమృత వర్షిణి ప్రేమ' లాంటి వాక్యాలకు జత పడిన ట్యూన్‌లోని నడక-'గోవుల గోపన్న' సినిమా కోసం ఘంటసాల స్వరపరచి సుశీల, జె.వి.రాఘవులు, తదితరులతో పాడిన 'ఈ విరి తోటల లోగిలిలో' పాటలోని 'నీ హృదయంలో నిండెను కాంతి/ ఎందుకు సందియమిటు రావేలా' అనే రెండు వేర్వేరు వాక్యాలతో ట్యూన్‌ని నడిపిన పద్ధతిని గుర్తుచేస్తుంది. ఇక సాహిత్య పరంగా చెప్పాలంటే ఇప్పటి వరకు చంద్రబోస్ రాసిన పాటలలో ఎన్నదగిన పాటయిది. సాహిత్య పరంగా విశ్లేషించాలంటే చరణాలలోని ప్రతి వాక్యాన్నీ ఉదహరించి తీరాలి. ఈ పాటద్వారా అటు కీరవాణి ఇటు చంద్రబోస్ చాలా అవార్డులను పొందే అవకాశం వుంది.

'హాయ్‌రబ్బా' స్మిత పాడిన "నవమల్లిక నేనై పూచానోయ్" పాట- ఇవాళ వస్తున్న ఇండీ పాప్ గీతాలకు ఏవిధంగాను తీసిపోని స్థాయిలో వుంది.

బాలూ పాడిన 'చదవడానికెందుకురా తొందరా లవ్వుచెయ్యడమే నేర్చుకోరా ముందరా' పాటలో మొట్టమొదట సాహిత్యం ఆకట్టేసుకుంటుంది. కాలేజీలో నేర్చే తెలుగు, మాథ్స్, హిస్టరీ,ఫిజిక్స్, కెమిస్ట్రీ, స్పోర్ట్స్ సబ్జెక్ట్‌ని ప్రేమ సోపానాలకు ముడి పెట్టి - వాటిని పీరియడ్స్‌గా విభజించి - టోటల్‌గా పాస్ అవ్వాలంటే ఏంచెయ్యాలో పాట ద్వారా తెలిపిన స్కీమింగ్ - శ్రోతలను ఆకర్షించటంలో నూటికి నూరు మార్కులు కొట్టేసి డిగ్రీని చంద్రబోస్ చేతిలో పెట్టేస్తుంది. కీరవాణి, బృందంతో పాడిన 'ఒలంపిక్ క్రీడల్లో పేకాటకే పెద్ద పీట వేస్తే' అన్న పాటతో బొడ్డూరం, తెడ్డూరం, లడ్డూరం, గుడ్డూరం, జెడ్డూరం, పుడ్డూరం, బెడ్డూరం, అంటూ రకరకాల విడ్డూరాన్ని తమాషాగా కామన్ చేయటం కొంత (మందికి) విడ్డూరంగానే వున్నా అందులోని చమత్కారాన్ని గ్రహిస్తే 'వెల్ సెడ్డూరం' అని నవ్వేసుకునే అవకాశాలు లేక పోలేదు. నిజానికి "తెలుగు ఫిల్మ్‌లో తెలుగు పాటలు తెలుగు తెలిసిన తెలుగు వాళ్ళతో ఈ రోజుల్లో పాడించారంటే విడ్డూరం" అనే వాక్యమే వెల్ సెడ్డూరం.

ఇన్ని పాటల ఇన్నిరకాల విజృంభణల మధ్య యస్.పి.చరణ్ పాడిన 'కనిపించావమ్మా' పాట, కల్పన పాడిన తిల్లాన కొంచెం వెనకబడినట్టనిపించినా ఈ రెండూ కూడా మంచివే!






"రచయిత గున్నారావ్‌ని పోలీసులు అరెస్ట్ చేసారట"
"ఏం? ఎందుకని?"
"అసలు పేరుతో ఒక పెళ్ళి, కలం పేరుతో ఇంకో పెళ్ళి చేసుకున్నాడట."



"మా అల్లుడికి మరీ అనుమానం, కోపం రా"
"ఏం జరిగింది?"
"పలకరింపుగా నవ్వా అంతే! నన్ను చూసి నవ్వుతావా అని అలిగి వెళ్ళిపోయాడు".
"అసలు అల్లుణ్ణి చూసిన తర్వాత నీ మొహంలో నవ్వెలా వచ్చింది?"

"నాకు విడాకులు కావాలి లాయర్‌గారూ"
"ఎందుకు?"
"మా ఆవిడ నాకు రోజూ గుడ్లతో ఆమ్లెట్ వేస్తోంది"
"మంచిదే కదా?"
"ఏం మంచి... ఆవిడ వేసేది బల్లిగుడ్లు, పాముగుడ్లతో.."





"ఏంటి గురూ ఎన్నడూ లేనిది ఇవ్వాళ మారువేషంతో దొంగతనానికి బయలుదేరావేంటి?"
"ఇవాళ కన్నం వేయబోయేది మా ఇంటికే"
"???"



"సిగిరెట్ తాగే వాళ్ళకన్న పక్కనుండి అది పీల్చేవాళ్ళకు కాన్సర్ వచ్చి చచ్చే అవకాశం ఎక్కువట" చైన్ స్మోకరైన భర్తతో అంది ఆండాళ్.
"అందుకేగా నేను తాగేది" భార్య మీదకు పొగ వదులుతూ చెప్పాడు.

"సార్ అర్థ రూపాయొస్తుంది" కండక్టర్‌తో చెప్పాడు గోవిందం
"నీ అడ్రస్ చెప్పు. యం.ఓ. చేస్తా. ప్రస్తుతానికి నా దగ్గర చిల్లర్లేదు"
"???"





"కట్నం పాతికవేలేగా! అదనంగా వదిరూపాయిలిచ్చారేంటి?" పెళ్ళికొచ్చిన బంధువు ఆశ్చర్యపోతూ అడిగాడు.
"ఓ అదా మా అల్లుడు ఆటోడ్రైవర్‌లే. మీటర్ మీద పదన్నమాట."

## హ్యూమర్ బాక్స్



"ఏం పిన్నీ వంటయ్యిందా?" పక్కింటావిడ్ని పలకరించింది ఆండాల్.

"లేదు. వచ్చి చేసి పెట్టకూడదూ?"



"నిన్న ఈగల మందిచ్చావ్ అది ఇల్లంతా చల్లినా ఈగలు చావలేదేమిటి?"

"భలే వారే సార్ మీరు! ఆ మందు ఈగల నోట్లో పోయాలి అప్పుడే చచ్చేది"



"మీరు పారిపోతున్న దొంగల్ని అంత ఈజీగా ఎలా పట్టుకుంటారు?" అడిగాడు ఓ పోలీస్ ఆఫీసర్ మరో ఆఫీసర్‌ని.

"వెరీ సింపుల్ సొమ్ముతో పారిపోతున్న దొంగకు వినపడేలా ఫిఫ్టీ ఫిఫ్టీ అన్నాను అంతే."



"రాత్రి సెకండ్‌షోకి నీతో వచ్చిన అమ్మాయి చెల్లెలా?"

"అవును... నా భార్యకి"



"ఛీ! ఛీ! ఇలా దొంగతనం చేసే బదులు అడుక్కు తినొచ్చుగా?"

"అలా అడుక్కోబట్టే ఈ ఖర్మ పట్టింది."



టికెట్ కలెక్టర్ అందరి దగ్గరా టిక్కెట్స్ చూస్తూ "నీ టికెట్ ఏదీ?" అడిగాడు గోవిందాన్ని.

"టికెట్ లేకుండా తిరుపతి వస్తానని ఆ వెంకన్నకు మొక్కుకున్నా సార్"



బరువు చూసుకొనే మిషన్ మీద నిలబడ్డ గోవిందం చేతిలోకి టికెట్ వచ్చింది. తన బరువు చూసుకొని వెనక్కి తిప్పి జాతకం చూసుకున్నాడు. దాంట్లో మరో తొమ్మిది గంటల్లో మీకు ప్రమాదం రాబోతోంది అని రాసి ఉంది. నిజంగానే మరో తొమ్మిది గంటల్లో అతని భార్య పుట్టింటి నుంచి తిరిగి వచ్చింది.

ఈ జోక్‌లను పంపించినవారు : కలపర్తి సత్యం, ఏలూరు

# సద్దాం ఆంటీ ఇంటి కథ

సీరియల్ 24

- మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ



అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బు ఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేణా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య, రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావు హఠకేశం అనే కిరాయి హంతకుడిద్వారా బామ్మను చంపడానికి ప్లాను వేస్తారు. హఠకేశం ఓ పామును తీసుకొని రాత్రివేళ వెళుతుంటే దారిలో అతన్ని దొంగలు కట్టుబట్టలతో సహా దోచుకుంటారు. పోలీసులు పట్టుకుపోవడంతో అతని ప్రయత్నం విఫలమవుతుంది. రెండవరోజు మరోలా విఫలమవుతుంది. అనన్య ఆమె కొలీగ్ నిరుపమ్‌లకు ఒకరిపై మరొకరి ప్రేమ వెల్లడవుతుంది. అతను లింగమయ్య తమ్ముడన్న విషయం అనన్యకు, బామ్మకు తెలియదు. తను ఎదురు చూసే ఇల్లు బామ్మదేనని నిరుపమ్‌కి తెలియదు.

(ఇక చదవండి)

మర్నాడు సూర్యోదయం అయీకాగానే లింగమయ్య ఇంట్లో కాలింగ్ బెల్ మోగింది. అతని భార్య తలుపు తెరుస్తూ 'ఇవాళ ఓ లీటర్ చాలు' అన్నది. ఎదురుగా నిలబడింది పాలవాడు కాక నిరుపమ్ అవడంతో "ఓ! నువ్వా నాయనా? పాలవాడనుకున్నాను. ఇంత పొద్దున్నే వచ్చావేమిటి? అంతా కులాసానేనా?" ప్రశ్నించిందావిడ.

"కులాసానే పెద్దవదినా. బామ్మ సంగతి ఏమైందో కనుక్కుందామని వచ్చాను"

"మీ అన్నయ్య తెల్లారుఝామునే బయటికెళ్ళి ఇందాకే వచ్చి పడుకున్నారు. నిన్న రాత్రీ ఆ పని కాలేదుట"

"అంటే బామ్మ బతికేవుందా ఇంకా?" కొద్దిగా బాధగా ప్రశ్నించాడు.

"హాయిగా బ్రతికే వుంది. అసలేం జరిగిందంటే..." టూకీగా వివరించిందావిడ.

"ఇవాళ రాత్రి ఖచ్చితంగా ఆ పని పూర్తి చేస్తానన్నాడుట హరికేశం... మీ అన్నయ్యని లేపనా?"

"ఒద్దొదినా. విషయం తెలుసుకుందామని వచ్చానంతే"

"నీ తొందర నాకు అర్థమైంది. అంతకు రెట్టింపు తొందరుంది నాకు. ఆ మహాతల్లికి చావు ఎప్పుడు రాసి పెట్టివుందో మనకా ఆస్తి ఎప్పటికి దక్కేనో" చిన్నగా నిట్టూర్చిందావిడ.

* * *

"వాటీజ్ దిస్ నాన్సెన్స్? నిన్న రాత్రి కూడా పని కాలేదా?" చిరాగ్గా ప్రశ్నించాడు సుబ్బారావు, లింగమయ్య చెప్పింది విని.

"కాలేదు సర్" ఆ ప్రశ్నకి బిక్కుబిక్కుమంటూ జవాబు చెప్పాడు అతని పక్కనే వున్న హరికేశం.

"నీకు పేకాటకి అర్ధరాత్రి తప్ప తీరిక దొరకడం లేదా? డ్యూటీలో ఉండగా అసలు పేకముక్కలెందుకు ఆడుతున్నావ్?" అరిచాడు సుబ్బారావు అతనిమీద.

"మీ తోడు సార్. పేకాట జోలికే వెళ్ళలేదు. నిజంగా ఆ పిచ్చివాడు నా మీద పచ్చటి...."

"సర్లే. ఆపావు" ఇంకాస్త చిరాగ్గా అరుస్తూ అడ్డుపడ్డాడు లింగమయ్య. చటుక్కున హరికేశం కింద వున్న గోనెసంచీ మూతని విప్పి దాన్ని సుబ్బారావు టేబుల్ మీదకి కుమ్మరించాడు. అందులోంచి గోధుమవన్నె తాచుపాము టేబుల్ మీదకి జారి పడింది. క్షణాల్లో అది పడగ విప్పి తలని అటు ఇటు తిప్పి చూడసాగింది. తనకి మూడడుగుల దూరంలో వున్న ఆ పాముని చూడగానే సుబ్బారావు పై ప్రాణాలు పైనే పోయాయి.

"తా... తా... పా... పా... ము... ము..." అన్న శబ్దాలు ఆయన నోటిలోంచి వెలువడ్డాయి.

"ఏదీ అబద్ధం కాదు సార్. మా పల్లెకి వెళ్ళి నేను పాముని కొనడం నిజం. ఇది కోరలు తీసిన సినిమా పాము కాదు సార్. మాంచి కసిగా వున్న కోడెనాగు సార్. ఒక్క కాటుకి దిగే విషం నలుగురిని చంపడానికి సరిపోతుంది సార్..."

"తియ్యి. దాన్ని ముందు తియ్యి, లేకపోతే ఆయన హార్ట్ అటాక్‌తో చస్తాడు" అరిచాడు తేరుకున్న లింగమయ్య రెండడుగులు వెనక్కి వేసి.

అప్పటికే అది నాలుగైదుసార్లు బుసకొట్టి ఎవర్ని కాటేయాలా అన్నట్లుగా లింగమయ్య, సుబ్బారావుల వంక తలని మార్చి మార్చి తిప్పి

**కొత్త చెప్పులు ఎప్పుడు బాగా కరుస్తాయి?**
**- ఇంటిల్లిపాదికీ కొనాల్సి వచ్చినప్పుడు.**
**ఈ జోక్కి నవ్వురాకపోతే సద్దాం ఆంటీ ఇంటికథని చదివి ఈ పక్షమైనా హాయిగా నవ్వుకోండి.**

చూస్తోంది.

"దా... నీ్తి..... దా..... నీ్తి" అన్న అక్షర శబ్దాలు కూడా సుబ్బారావు నోట్లోంచి బయటకి వచ్చాయి.

ఎంతో మెళకువగా హరికేశం దాని వెనక నించి మెడ కింద మెరుపులా పట్టుకుని, దాని నోరు తెరిచి సుబ్బారావు కళ్ళకి అరడుగు దూరంలో వుంచి చెప్పాడు.

"చూడండి సార్ కోరలు"

"ముందు దాన్తీ" అరిచాడు సుబ్బారావు కుర్చీలో వెనక్కివాలిపోతూ...

హరికేశం దాన్ని తీసి గోనెసంచీలో పడేసి మూట కట్టాక సుబ్బారావు నుదుట పట్టిన చెమటని తుడుచుకుని, టేబుల్ మీది గాజుగ్లాసు మీది మూత తెరిచి గటగట మంచినీళ్ళు తాగాడు.

"నువ్వు పాము కొనలేదని అనడం లేదు నేను. ఇంకెన్నడూ పాముని సాక్ష్యంగా తీసుకురాక." చెప్పాడు లింగమయ్య హరికేశంతో.

"ఈ రాత్రికి పని ఖచ్చితంగా పూర్తి చేస్తాను సార్"

"లింగమయ్యా. ఇవాళ రాత్రి హరికేశంతో ఆ పని పూర్తి చేయించే బాధ్యత నీది. ఏం చేస్తావో మరి" ఆజ్ఞాపించాడు సుబ్బారావు.

"అలాగే సార్" ఒప్పుకున్నాడు లింగమయ్య.

* * *

ఉదయం నిద్ర లేవగానే రాజు కాఫీ కలుపుతున్న తల్లి దగ్గరికి పరిగెత్తుకు వచ్చాడు.

"మమ్మీ. రాత్రి కల్లో మళ్ళీ నాకు సాయిబాబా కనిపించాడు" చెప్పాడు ఉత్సాహంగా.

వెంటనే వాసవి మొహంలో స్వల్పంగా భయం తొంగిచూసింది. కొడుకు వంక తీక్షణంగా చూస్తూ అడిగింది.

"గుడ్ న్యూస్ చెప్పారా? లేక బ్యాడ్ న్యూసా?"

"బ్యాడ్ న్యూస్ మమ్మీ. చాలా బ్యాడ్ న్యూస్"

"అయితే నాకు చెప్పక"

"బాబా నీకు మాత్రమే చెప్పమని చెప్పాడు" గొంతు తగ్గించి చెప్పాడు రాజు.

"ఏమిటది? ఈసారి ఎవరు చస్తారట?"

"డాడీ"

"ఏమిటి??" అదిరిపడింది.

"ఇరవై ఎనిమిది గంటల్లో నా డాడీ చచ్చిపోతాడట మమ్మీ"

వాసవి నిశ్చేష్టురాలై కొడుకు వంక చూస్తూండిపోయింది. కొద్ది క్షణాల తర్వాత బలహీనమైన స్వరంతో అడిగింది.

"డాడీనా? ఇరవై ఎనిమిది గంటల్లోనా?"



"అవునమ్మా. రోడ్డు మీద ఏక్సిడెంట్‌లో పోతాడట" వివరించాడు రాజు.

"సరే. ఇది ఎవరికి చెప్పక" అని కొడుకు చేత ఒట్టు వేయించుకొంది వాసవి.

* * *

బామ్మతో తన ఫైనాన్స్ మేటర్స్ మాట్లాడే నెపంతో సాయంత్రం దాకా ఆగలేక ఉదయం ఎనిమిదిన్నర కల్లా బామ్మవాళ్ళింటికి అడ్రస్ వెతుక్కుంటూ వచ్చాడు నిరుపమ్.

స్కూటర్‌ని బయట పార్క్ చేసి గేటు తెరుచుకుని లోపలికి వెళ్ళాడు. నైటీలో వున్న బామ్మ అతన్ని చూసి చెప్పింది.

"మాకేం అక్కర్లేదు. వెళ్ళు... ఒసేయ్ అనన్యా. 'నో సేల్స్‌మేన్' అన్న బోర్డు బయట గేటుకి తగిలించమని ఎన్నిసార్లు చెప్పానీకు" అని గట్టిగా అరిచింది. అయినా వెనక్కి తిరగని అతన్ని చూసి చెప్పింది.

"మా ఇంట్లో ఫినాయిల్ వుంది చాలా. వెళ్ళమంటూంటే నీక్కాదు?"

తను ఇంటింటికి తిరిగి ఫినాయిల్ అమ్ముకునే వాడులా కనబడడంతో ఖంగుతిన్న నిరుపమ్ అంతలో తేరుకుంటూ చెప్పాడు. "నో.. నో... నేను ఏ ఫినాయిల్ కంపెనీ సేల్స్‌మెన్‌ని కాదు"

"ఫినాయిల్ కాకపోతే బాత్‌రూం క్లీనింగ్ ఏసిడ్. అదీ కొనం"

అంతలో ముందుగదిలోకి వచ్చిన అనన్య నిరుపమ్‌ని చూసి బామ్మతో చెప్పింది.

"పొరబడ్డావు బామ్మా. ఈయన నిరుపమ్ అని బాంక్‌లో నా కొలీగ్"

"ఓ... నిరుపమ్ అంటే నువ్వేనా?" అతన్ని ఎగాదిగా చూసి ప్రశ్నించింది బామ్మ.

"అవునండి"

"ఏమనుకోకు నాయనా! ఫినాయిలనో, టూత్ పేస్టనో, ఈ మధ్య నీలా టై కట్టుకుని ఇళ్ళకి కంపెనీ ప్రచారానికంటూ వచ్చే సేల్స్‌మెన్‌లు ఎక్కువై పోయారు. రా కూర్చో. టై బావుంది. ఎక్కడ కొన్నావేమిటి?"

"కొనలేదండి. పుట్టిన రోజుకి ప్రజంటేషన్‌గా వచ్చింది"

"కొనకుండా వాళ్ళకి మాత్రం ఎక్కడ నించి వస్తుంది?"

**ఇండియలో విషపూరిత పాములు నాలుగు ఉన్నాయి. ఒకటి తాచు, ఇంకొకటి కట్లపాము, మరొకటి రక్తపింజరి, ఆఖరిది?**
**- రాజకీయవేత్త**
**నిజమైన తాచుపాము ఈ పక్షం అయినా కాటేసిందా? జవాబుకై ఈ సంచికలోని ఈ సీరియల్‌ని చదవండి.**

"బామ్మా. చెప్పడం మరిచాను. నిరుపమ్ గారి దగ్గర పాతిక లక్షల దాకా ఉన్నాయి. ఎక్కడ ఎలా ఇన్వెస్ట్ చేయాలో నీ సలహా తీసుకుందామని వచ్చారు. ఆయన క్వాలిఫికేషన్‌కి ఎంత కట్నం తీసుకోవచ్చో కూడా తెలీదుట. ఆ విషయంలో నా సలహా అడిగారు. నేను నిన్నే అడిగి చెప్పాలి కదా. అందుకని డైరెక్ట్‌గా వచ్చి నిన్నే అడగమన్నాను. ఇవాళ సాయంత్రం వస్తానన్నారు కాని కొంచెం ఎర్లీగా వచ్చారు"

బామ్మ అతనివంక ఆదరంతో కూడిన చిరునవ్వుతో చూస్తూ మృదువుగా అడిగింది.

"పాతిక లక్షలా బాబూ?"

"కనీసం అండి"




"ప్రయివేట్ వ్యక్తులకి వడ్డీకి తిప్పుదామనా లేక..."

"నాకు అస్సలు బాంక్‌లు, మ్యూచ్‌వల్ ఫండ్‌లు తప్ప వేరే ఐడియా లేదండి"

"ప్రయివేట్ వ్యక్తులకి నెలకి నూటికి మూడు రూపాయల దాకా వడ్డీ గిడుతుంది. సపోజ్ పాతిక లక్షలు నాకే అప్పిచ్చావనుకో. నీకు లెక్క ప్రకారం దాని మీద నెలకి డెబ్బై అయిదు వేల రూపాయలు వడ్డీ వస్తుంది."

బ్రీఫ్‌కేస్ లోంచి కాలిక్యులేటర్‌ని తీసాడు నిరుపమ్. శ్రద్ధగా దానిమీద లెక్కవేసి చెప్పాడు.

"అంటే ఏడాదికి తొమ్మిది లక్షలన్నమాట. ఇంటూ త్రి... మూడేళ్ళలో అసలు రెట్టింపవుతుంది. ఇంటూ ఫోర్... అంటే ఆ తర్వాత నాలుగేళ్ళలో, అంటే ఏడేళ్ళలో కోటి రూపాయలవుతుందన్నమాట అది"

"లెక్క ప్రకారం అవును"

"ఇదేదో బావున్నట్లుందే? ఆ ప్రయివేట్ వ్యక్తులు ఎక్కడుంటారండి?" ప్రశ్నించాడు ఉత్సాహంగా.

"నీ ఎదుట ఉండగా గుర్తించలేవా బాబూ? ఆ పాతిక లక్షలు నాకిస్తే ఈ ఇల్లు నీకు సెక్యూరిటీగా వుంటుంది."

"బామ్మా" అరిచింది అనన్య.

"వ్యవహారం మాట్లాడుతుంటే మధ్యలో అడ్డుపడకే"

అనన్య నిరుపమ్‌తో 'ఎక్స్‌క్యూజ్ అజ్' అని బామ్మని చెయ్యిపట్టుకుని లోపలికి లాక్కెళ్ళి చెప్పింది.

"నీకేమైనా పిచ్చా బామ్మా? పాతిక లక్షలు, నెలకి మూడు రూపాయల వడ్డీతో తీసుకుని ఏం చేస్తావ్? తిరిగి వడ్డీ ఎక్కడ నించి చెల్లిస్తావ్?"

"అసల్లోంచే చెల్లిస్తానే పిచ్చిదానా. నేను పోయాక వడ్డీ పోను మిగిలే అసలు నీకు ఫ్రీగా వచ్చినట్లే. లింగమయ్య, నిరుపమ్‌లు కుస్తీలు పడుతుంటే నువ్వు సరదాగా చూద్దువుగాని"

"అది పాపం కదూ బామ్మా?"

"త్రేతాయుగంలో అయితే పాపం. కలి ప్రవేశించిన పవిత్ర భారతదేశంలో ఇప్పుడు మనం ఇలాంటి పనులే చెయ్యాలని బ్రహ్మం గారి కాలజ్ఞానంలో రాసుంది!"

"మధ్యలో ఆ పెద్దాయన పేరు ఎత్తకు. ఇంకాస్త పాపం. నీకు చేతనైతే, అతనికి తగిన సలహా ఇవ్వు. లేదా పంపించు. ఇలా గుండమ్మ కథలో రమణారెడ్డి వేషాలేయక"

"చూసావులే మా గొప్ప బ్లాక్ అండ్ వైట్ సినిమా. లేకపోతే నీకు పెళ్ళికి కట్నం ఎక్కడ నించి తేను?"

"అసలు పెళ్ళి కొడుకు కట్నం వద్దంటాడేమో కనుక్కోవచ్చుగా?"

"సర్లే"

బామ్మ ముందు గదిలోకి వంటరిగా వచ్చింది.

"అదబ్బాయ్ ఇన్వెస్ట్‌మెంట్ కథ. ఇంకేంటి విశేషాలు? పెళ్ళి ఎప్పుడు చేసుకుంటున్నావ్? ప్రేమలో పడడం లాంటివేమైనా చేసావా?'' ప్రశ్నించింది.

నిరుపమ్ సిగ్గుపడ్డాడు.

"చేసానండి" చెప్పాడు.

"ఎప్పుడు చేసావ్?"

"చాలా కాలం క్రితం"

"పిల్ల బావుంటుందా?''

"బావుంటుందండి"

''ఆ అమ్మాయికి నువ్వంటే ఇష్టమేనట?''

"ఇష్టమన్నట్లుగానే చెప్పిందండి"

"కట్నం ఎంతిస్తుందిట?''

"అది మిమ్మల్ని అడగమంది. ఎంత తీసుకోవచ్చు నేను? నా సేలరీనేమో...''

"ఆగాగు. ఓ అమ్మాయి ఓ అబ్బాయితో ప్రేమ వివాహానికి వప్పుకుందంటే. దానర్థం కట్నం ఇవ్వనని. ఇది లోకరీతి"

"అలాగాండి?''

"పెద్దలు కుదిరిస్తేనే కట్నం. ప్రేమ పెళ్ళిలో కట్నాలు, లాంఛనాలు వుండవు"

"అలాగాండి?''

"సింపుల్ రిజిస్టర్ మేరేజ్, కాండాకచో ట్రెడిషనల్ మేరేజ్ విత్ సింపుల్ మీల్స్"

"అలాగాండి?''

"లోకరీతి చెప్తున్నాను. కట్నం ఇచ్చుకోగలిగే స్థోమత వుంటే పెద్దలు కుదిర్చే సంబంధమే చేసుకుంటారు. ఇంతకీ ఆ పిల్ల పేరేంటి?''

"అనన్య చెప్పనే లేదాండీ?''

కాఫీ కప్పులతో వచ్చింది అనన్య. పేరడిగింది వాళ్ళ అనన్యని.

"ఆ పిల్ల పేరు అనన్య బామ్మా" చెప్పింది అనన్య. చాలా కేజువల్‌గా.

"మీ మనవరాలినే నేను వివాహం చేసుకోవాలనుకుంటున్నది" చెప్పాడు నిరుపమ్.

"వ్వావ్! నీ వెయిటెంత?" అడిగింది బామ్మ వెంటనే.

"మొన్న శుక్రవారానికి సిక్స్టీ ఫోరండి"

"హైట్?"

"ఫైవ్ పాయింట్ నైన్" అదీ శుక్రవారానికేనండి"

"హైట్, వెయిట్ సరిపోయాయి. కట్నంగా కేష్ ఇచ్చుకోలేం. నా తదనంతరం ఈ బిల్డింగ్ మొత్తం దానికే వస్తుంది. దాన్ని కోటి రూపాయలకి కొనడానికి రెడీగా వున్నారు పార్టీలు"

"ఇంకా ఎక్కువకే అమ్మచ్చనుకుంటానండి"

"అది మీ ఇద్దరి ఇష్టం, ప్రతిభ, అదృష్టం మీద ఆధారపడి వుంటుంది. మీ అమ్మ, నాన్నలేం చేస్తున్నారు?''

"పోయారండి"

"అలాగా? అక్కాచెల్లెళ్ళు?''

"లేరండి. మా చిన్నన్న వెంకటరత్నంతో ఉంటున్నానండి. ఆయనకి పెళ్ళయింది."

"ఈ వ్యవహారం ఆయనకి తెలుసా?"

"ఇంకా చెప్పలేదండి"

**హైద్రాబాద్ ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌లోని ఓ స్టార్‌తో డాక్టర్ మిరకిల్ ఓ మందు అమ్ముతున్నాడు. అది తాగితే రెండువందల ఏళ్ళు బ్రతుకుతారని అనౌన్స్ చేస్తున్నాడు. మైలవరం నించి వచ్చిన ఓ మేధావి అడిగాడు ఆ స్టాల్‌లోని ఓ అమ్మాయిని.**

**"ఈ మందు నిజంగా పనిచేస్తుందంటారా? డాక్టర్ గారికి కూడా పనిచేసిందా?"**

**"ఈ మందు నిజంగానే పనిచేస్తుంది సార్. డాక్టర్ మిరకిల్ గారి వయసెంతో నాకు సరిగ్గా తెలీదు. ఎందుకంటే నేను ఆయన్ని కలుసుకుంది 1872లో" జవాబు చెప్పిందాపిల్ల.**

**దాదాపు ఆ వయసు గల బామ్మ విచిత్ర కథ తెలుసుకోవాలంటే ఈ సీరియల్ చదవాలి.**

"ఆయన అనుమతి ఇవ్వకపోతే అప్పుడేం చేస్తావు?"

"నా బాగోగులు నావేనండి"

"కట్నం మీద ఆశుండచ్చుగా ఆయనకి?"

"అబ్బే. కట్నం ఇచ్చినా అది నాకే తప్ప వాడికివ్వనండి. వాడేం నన్ను పోషించలేదు. చదివించలేదు కదండి"

"మంచిది. ఇంతకీ అనన్య మీద నీకు గల ప్రేమ శాతం ఎంత? మా కది లాభమా? నష్టమా? మేం క్యాష్‌గా కాణీ కట్నం ఇచ్చుకోలేనప్పుడు?'' నవ్వుతూ అడిగింది బామ్మ.

"నాకు లెక్కలు పెద్దగా రావండి."

"పోనీ తెలిగ్గా అడుగుతానుండు. నీకు అనన్య మీద వున్న ప్రేమ ఎత్తు ఎంత? పొడవెంత? వైశాల్యం ఎంత?"

"ఇంక ఆ లెక్కకట్టలేదండి"

"ఆయన్ని కన్‌ఫ్యూజ్ చేయకు బామ్మా... నువ్వూరుకో" అనన్య చిరుకోపంగా చెప్పింది.

"అవును. నిన్నడగనే లేదు. నీకింతకీ ఇతనంటే ఇష్టమేనటే? ఇతన్ని పెళ్ళిచేసుకోడానికేం అభ్యంతరాలు లేవుగా?'' ప్రశ్నించిందావిడ. తన మనమరాలిని.

"బామ్మా. జవాబు రేపు చెప్తాను" చెప్పింది అనన్య.

"అదేం? డాక్టర్‌లా ఇరవై నాలుగ్గంటల్లో కాని ఏ సంగతీ చెప్పలేవా?" నవ్వింది బామ్మ.

"ఇవాళ తిథి అష్టమి. నాకది అచ్చిరాదు. అష్టమినాడు ఏం మొదలెట్టినా అష్టకష్టాలు పడాలి నేను. రేపు రాత్రికి నవమి వచ్చాక చెప్తాను"

"ఊరికే చూచాయగా చెప్పండి" అర్థించాడు నిరుపమ్.

"ఊహూ"

"దానికి తిథుల పట్టింపులు ఎక్కువలేవయ్యా. రైలెక్కడానికి ఉద్యోగస్తులంతా హాలిడేస్ కలిసొస్తాయో లేదో చూస్తారు. ఇది మాత్రం తిథి చూస్తుంది" నవ్వింది బామ్మ.



"కొద్దిగా పాత కాలం మనిషినే" చెప్పింది అనన్య కూడా నవ్వి.

"మరీ" సరిచేసింది బామ్మ.

"ఇరవై నాలుగు గంటల దాకా వేచి వుండడం చాలా ఇబ్బంది" చెప్పాడు నిరుపమ్.

"ఇంతకీ నీ ఆస్తి పాస్తుల వ్యవహారం గురించి చెప్పనేలేదు?" ప్రశ్నించింది బామ్మ.

"మాకో పెద్ద బిల్డింగ్ వుందండి"

"ఎంతుంటుందేంటి?"

"సుమారు ఇంతుంటుందండి. ఇంత పాతది కూడా" చెప్పాడు.

"ఎక్కడేమిటి?"

"ఇక్కడే రామ్‌నగర్‌లోనే"

"ఎక్కడుందది?" ఆసక్తిగా అడిగింది బామ్మ.

"నాకు పెద్దగా తెలీదండి. ఆ వ్యవహారాలు మా పెద్దన్నయ్య చూస్తూంటాడు"

"అలాగా? అందులో మళ్ళీ వాటాలున్నా యన్నమాట?"

"అవునండి. దాన్నమ్మితే కోటికి తక్కువ రాదు. మేం ముగ్గురం అన్నదమ్ములం కలిసి దాన్ని అమ్మి ఎవరి భాగం వాళ్ళు క్యాష్ తీసుకోవాలను కుంటున్నాం."

"ఇంత పెద్ద బిల్డింగ్ ఓ పట్టాన అమ్ముడు పోదు. టైం పడుతుంది."

"అదేం లేదండి. ఓ బిల్డర్ ఆ బిల్డింగ్ కొని దాన్ని అపార్ట్‌మెంట్స్‌గా డెవలప్ చేద్దామనుకుంటున్నాడు. నిజానికి అతనే మా పెద్దన్నని అప్రోచ్ అయ్యాడు. ఆ డీల్ వారం పది రోజుల్లో ఫైనలైజ్ అవుతుంది."

"ఇంకేం? నీ వాటా ముప్పై అయిదు లక్షల దాకా వస్తుందన్నమాట"

"అవునండి. కనీసం"

"మీ అన్నయ్య ఏం చేస్తుంటాడు?"

"ఆ బిల్డర్ దగ్గర పనిచేస్తాడండి"

"పేరు?"

"సుబ్బారావు" ఆ బిల్డర్ పేరు అడిగిందనుకుని చెప్పాడు నిరుపమ్. సుబ్బారావు నిరుపమ్ అన్నయ్య పేరు అనుకుంది బామ్మ.

"అలాగా"

"వెళ్ళొస్తానండి. రేపు రాత్రికి మళ్ళీ వస్తాను"

"మంచిది. అనన్య నాతో అఫీషియల్‌గా ఈ సంబంధం ఇష్టమే అంటే కానీ మనం ముందుకు ప్రొసీడ్ కాలేం... రేపు ఈ ఇంటికి దేనికి? ఏ పిజ్జా హట్‌లోనో మీటింగ్ పెట్టుకుందాం"

"అలాగేనండి. బంజారాహిల్స్‌లోని పిజ్జాహట్‌లో రాత్రి ఏడున్నరకి కలుద్దాం. ఏం అనన్యా?" ప్రశ్నించాడు నిరుపమ్.

"అలాగే" వప్పుకుంది అనన్య.

అతనెళ్ళాక అడిగింది బామ్మ.

"నువ్వు నిరుపమ్ గురించి అతనో బుచ్చిబాబని చెప్తూంటే, నీకు అతనే తగిన వరుడనిపించి నీ ఫోటో కటింగ్స్ పంపాను. అనుకోకుండా అది క్లిక్ అయి కాణీ కట్నం ఇవ్వకుండా నీకో మంచి మొగుడు వస్తున్నాడు. ఈ జీవితంలో నా మొత్తం భారం నీ పెళ్ళే. అదయితే ఇక నాకు నిశ్చింత"

అనన్య మౌనంగా వుండిపోయింది.

"కనీసం ఇరవై లక్షలు కట్నం ముట్టచెప్తారతనికి. ఉద్యోగం, జీతం, ఆస్తులని చూసి అరకోటి ఇచ్చేవాళ్ళు కూడా వున్నారు"

అనన్య బదులు చెప్పలేదు.

"మనం లక్కీ! ఏమంటావ్?"

అనన్య మౌనంగానే వుంది.

"ఏం మాట్లాడవేమే?"

"రేపటి దాకా ఆగమన్నానా?"

"ఓ! అదా? అయితే చెప్పకనే చెప్పావు. నీకతన్ని పెళ్ళిచేసుకోవడం ఇష్టమే"

"నా మనసులో దూరి చూసినట్లుగా అంత గట్టిగా ఎలా చెప్పగలవు?" ప్రశ్నించింది అనన్య.

"నీకిష్టం లేకపోతే ఆ సంగతి చెప్పడానికి ఇవాళ అష్టమైనా ఫర్వాలేదు. ఇష్టం వుంది కాబట్టే రేపటి దాకా ఆగమన్నావు"

"యస్సో, నో నో రేపే తెలుస్తుంది" నవ్వింది అనన్య.

కొద్దిసేపాగి అడిగింది బామ్మ రిమోట్ అందించి.

"నీకు నచ్చితే నోటితో చెప్పద్దు. కాని జెమిని నించి ఈటీవికి మార్చు. చాలు"

"నో. అదీ అష్టమి రోజు జవాబు చెప్పడమే అవుతుంది."

"పోనీ ఓ సారి నవ్వు"

"ఊహూ. నా నవ్వుకి నీకు అర్థాలు తెలుసు."

"నాకు తెలుసు. నీకు నచ్చాడులే"

"నువ్వెప్పుడూ ఆశావాదివే బామ్మ"

"మరే"

* * *

ఆ ఇంట్లో బామ్మకి తన మనవరాలి పెళ్ళి కట్నం ఖర్చు లేకుండా కుదిరిందని హుషారుగా వుంటే, ఆ ఇంటి పైనున్న వాసవికి, తన కొడుకు చెప్పిన స్వప్న వృత్తాంతానికి ఎంతో దుఃఖంగా వుంది. నిజంగా తన భర్త ఏక్సిడెంట్‌లో మరణిస్తాడన్న ఆదుర్దా ఆమెలో ఉండడం సహజం. ఆ విషయం మాత్రం ఆమె తన భర్తకి తెలియజేయలేదు. ఆయనని టెన్షన్ పెట్టడం దేనికని.

"స్కూటర్ తాళం చెవులేవి?" అడిగాడు రామ్మూర్తి.

"ఏమో? ఊరెళుతూ మీరే ఎక్కడ పెట్టి వెళ్ళారో"

నిజానికి వాసవి గంటన్నర క్రితమే వాటిని దాచేసింది.

"చూడు ఎక్కడున్నాయో? ఆఫీస్‌కి వెళ్ళి నా టూర్ రిపోర్ట్ సబ్మిట్ చేయాలి"

"ఇవాళ బయటకెక్కడికి కదలకండి మూడు వారాలుగా ఊళ్ళో లేరు. ఇవాళంతా ఇంట్లోనే ఉండండి. రాజుని రిక్షాలో నేనే స్కూల్లో దింపి వస్తాను"

"ఇదేమిటివాళ?"

"ఈరోజు మనిద్దరమే ఇంట్లో వంటరిగా ఎంచక్కా ఉందామండి"

"నీకివాళేమైంది కొత్తగా?"

"ఏమైందో రేపు చెప్తాగాని ఇవాళ మాత్రం మీరు ఇల్లు కదిలేది లేదు"

అతను స్కూటర్ తాళం చెవుల కోసం ఇల్లంతా వెదికాడు కాని అది దొరకలేదు.

"ఆఫీస్‌కెళ్ళొద్దా?"

"రేపెళ్దురు కాని"

తన భార్య కొద్దిగా అన్యమనస్కంగా ఉండడం గమనించాడు. ఎందుకో ఎంత అడిగినా వాసవి చెప్పలేదు.

**(ఇంకా వుంది)**



జనవరి 25 ఆదినారాయణరావు గారి వర్ధంతి సందర్భంగా...

# "సంగీతం సంప్రదాయపు సంకెళ్ళతో బంధింపబడకూడదు"

**- ఆదినారాయణరావు**

**సంగీత దర్శకుడు, నిర్మాత మాత్రమే కాక స్వయంగా రచయిత అయిన శ్రీ ఆదినారాయణరావు సినిమా సంగీతపు పోకడలపై పత్రికాముఖంగా వెల్లడించిన భావాలివి.**

ఈనాడు సినిమాల్లో ఉపయోగించే సంగీతం కేవలం అనుకరణ ప్రధానమై హిందుస్తానీ, పాశ్చాత్య సంగీతాలతో మిళితమై పంచకూళ్ళ కషాయంలా వుంటుందనీ, శాస్త్రీయ సంగీతంపై దెబ్బ తీస్తుందనే అభిప్రాయం చాలామందిలో కానవస్తుంది. ఐతే ఇందులో సత్యం ఏమాత్రమూ లేదు. పైగా సినిమాలు వచ్చేక ప్రజలలో సంగీతంపై మోజు ఎక్కువైందనడానికి ఆధారాలు కనబడుతున్నాయి. సంగీత కళానిధి కీ॥శే॥ ప్రొఫెసర్ సాంబమూర్తి అంతటివారే ఒక సందర్భంలో ఇలా అన్నారు : "Though most of the films are stuffed with light music, they still have helped in making millions of people music minded" (చాలా చిత్రాలు లలిత సంగీతంతో నిండివున్నా, కోటానుకోట్ల జనాన్ని సంగీత ప్రియులను చేయడానికి సహకరిస్తున్నాయి.) భారతదేశం ఈనాడు 'మ్యూజికల్ లేబొరేటరీ'గా తయారై విభిన్న సంగీత స్వరూపాల్ని సృష్టిస్తోంది. కళలూ, భావాలూ, భాషలూ, కాలంతోబాటే కదులుతూ వుంటాయి.

"Music is a progressive art and science"- సంగీతం అభ్యుదయపథాన పోయే కళ. శాస్త్రీయ విజ్ఞానం అని పెద్దలన్నారు. దేశంలోని ప్రజల అభిరుచులను అనుసరించి సంగీతం పరివర్తన చెందుతూ, అభ్యుదయాన్ని పొందుతూ వుంటుంది. పూర్వకాలపు సిద్ధాంతాలనూ, నియమాలనూ మన దేశీయ సంగీతంలో పాటించడానికి ప్రాకులాడ్డమనేది కాలానికి ఎదురీత యీదడం వంటిది. కాలానుగుణంగా నూతన సాంకేతిక భావాలూ, సంప్రదాయాలూ రాక తప్పవు. ప్రొఫెసర్ భాత్కండే లాంటి మేధావులు యిలా అన్నారు : "In Desi music we cannot always pretend to stick to the orthodox theories and rules. New technical expressions and new rules are bound to come in course of time, and we must be prepared to make room for them". (మన దేశీయ సంగీతంలో పాత పద్ధతులనూ, సంప్రదాయాలనూ అంటిపెట్టుకొని కూర్చొనలేము. నూతన సాంకేతిక భావాలూ, నూతన సంప్రదాయాలూ కాలానుగుణంగా రాక తప్పవు. మనం వాటిని మన్నించక తప్పదు). ప్రొఫెసర్ టి.వి.సుబ్బారావుగారు కూడా దాదాపు ఈ అభిప్రాయమే చెప్పారు. "Practical music in a wide country like ours cannot always continue unchanged." (సువిశాలమైన మన భారతదేశంలో మనం అభ్యసించే సంగీతం ఏ మార్పు లేకుండా ఎల్లప్పుడూ సుస్థిరంగా వుండజాలదు). ప్రొఫెసర్ రతన్‌జన్‌కర్-"శారఙ్గదేవుని 'సంగీత రత్నాకరం' నాటి నుండి మన సంగీతం ఎప్పటికప్పుడు మార్పు చెందుతూ వస్తోంది. పూర్వకాలపు గ్రామ మూర్ఛన జాతి పద్ధతి విసర్జింపబడి, దాని స్థానంలో రాగ-రాగిణీ లేక జన్య-జనక పద్ధతి ప్రవేశపెట్టబడింది." అన్నారు.

మన పండితులెవరూ "మేము ఆనాటి పాతకాలపు సంప్రదాయ సిద్ధమైన శాస్త్రీయ సంగీత పద్ధతినే ఈ నాటికి పాటిస్తున్నాము" అని గుండెలపై చేయి వేసుకొని చెప్పలేరు కదా! ఉత్తర హిందుస్థానపు సంగీతం "అమీర్ ఖుస్రూ" అవతరణతో కొత్త అవతారం దాల్చిందని మన పండితులు ఒప్పుకుంటున్నారు. మరి మన దక్షిణాదేశపు కర్నాటక సంగీతం మడికట్టుకుని కూర్చుందని మన వారు వాదించబోతారు కాని, యీ వాదన సరియైనది కాదని సవాల్ చేసి చెప్పవచ్చు. ప్రొఫెసర్ భాత్కండే లాంటి సంగీత శాస్త్రజ్ఞులు "మన దాక్షిణాత్య కర్నాటక సంగీతజ్ఞులు ఈనాడు తాము పాడే సంగీతం ఆనాటి శారఙ్గదేవుని కాలం నాటి శాస్త్రీయ సంగీతమేనని వాదిస్తారని నేను అనుకోను. వారి (కర్ణాటక) రాగాలు కొన్ని ఈనాడు మన ఉత్తర హిందుస్థానపు రాగాలతో మిళితమైపోయాయి" అన్నారు. లోక ప్రసిద్ధుడైన ఆంధ్ర పండితుడు, పండిత సోమనాథుడు (క్రీ.శ.1600) రచించిన 'రాగవిబోధ' గ్రంథంలో మనకు 'పర్షియన్' రాగాల పేర్లు కానవస్తున్నాయి. అవి-హుసేని, నవరోజ్, జీలఫ్ మొదలైనవి. 'వేంకటముఖి' పండితుడు 'తోడి' రాగం ఉత్తర హిందుస్థానానికి చెందిన రాగమని పేర్కొన్నారు.

అందుచేతనే కాబోలు పండిత 'రామామాత్యు'ని 'స్వరమేళ కళానిధి' గ్రంథంలో మనకు 'తోడి' రాగం పేరే కనబడదు. ఇలా



చర్చించుకొని పోతే మన సంగీతం ఎప్పటికప్పుడు కాలానుగుణమైన మార్పులు చెందుతున్నదని చెప్పడానికి తగిన ఆధారాలు కనిపిస్తున్నవి.

చెవులకు వినసొంపుగా వుండే స్వరసముదాయల కూర్పు సంగీతానికి ఆయువుపట్టని గ్రహించిన మన ప్రాచీన సంగీత నిపుణులందరూ, ఇతర సంగీత సంప్రదాయాలలోని మెళకువలను, తళుకులను తమ సంగీత రచనలలో చొప్పించి కొత్త పద్ధతులను సృష్టించడంలో తమది, ఇతరులది అనే భేదం లేక పక్షపాతరహితంగా ప్రవర్తించినారని చెప్పడానికి ఎన్నో ఆధారాలు మనకు కనబడుతున్నవి. అపర సరస్వతీ మూర్తులనబడే శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు కాశీలో నివసించే సమయంలో ఉత్తర హిందుస్తానీ సంగీత సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలుసుకుని ఆ సాంకేతిక విశేషాలను తమ కర్నాటక రాగ రచనలలో, ఆ సంప్రదాయానికి లోటు రాకుండా చొప్పించినారని పండితులు ఉద్ఘాటిస్తున్నారు. అందుకనే దీక్షితులవారి కీర్తనలు హిందుస్తానీ 'ధ్రువద్'ల వంటివని మన పండితుల అభిప్రాయం. ఆయన అమీరు కళ్యాణి, హిందోళ, మాల్కోస్ మొదలైన హిందూస్తానీ రాగాలలో కీర్తనలు చేశారు. అంతేకాకుండా పాశ్చాత్య సంగీతాన్ని విని, ఆకర్షింపబడి పాశ్చాత్య బాణీలను అనుకరిస్తూ కర్నాటక సంప్రదాయాన్ని విడువక కీర్తనలను రచించారు.

శ్రీ త్యాగరాజస్వామి వారు కూడా పాశ్చాత్య సంగీత ప్రభావానికి లోనై, యుద్ధ ప్రోత్సాహకరములైన 'మార్షల్ మార్చస్' (Martial Marches) ట్యూన్‌లను వాడి 'కదనకుతూహల'మనే రాగాన్ని సృష్టించి "రఘువంశ సుధాంబుధి చంద్ర" కృతిలో పాశ్చాత్యమైన పోకడలు పోయారు.

అందుచేత మనకు పూజనీయులైన శ్రీ త్యాగరాజస్వామి, దీక్షితుల వారి లాంటి సంగీత సామ్రాట్టులే తమకు మంచిదని తోచిన సంప్రదాయాన్ని మన సంగీత పద్ధతులలో ప్రవేశపెట్టడానికి వెనుకంజ వేయలేదనీ మంచి ఎక్కడ వున్నా గ్రహించడంలో తప్పులేదనీ మనం గ్రహించిననాడు ఈ అనుకరణ సిద్ధాంతాలపై తర్జనభర్జనలు చేయడం అర్ధవిహీనమని తెలుస్తుంది.



శాస్త్రీయ సంగీత సంప్రదాయాలలో ఇటువంటి మహత్తరమైన పరిణామాలు ఎప్పటికప్పుడు వస్తూవుంటే, ఇక సినిమా సంగీత విధానంలో పాశ్చాత్య రీతులను హిందుస్తానీ ఫణతులను మేళవించడం సంప్రదాయ విరుద్ధం కాదని తెలుతుంది.

మన భారతీయ సంగీతం ప్రపంచ సంగీతానికే మాతృదేవత. "Hindu music is the origin of all music, crept into Persia, Greece, then to Arabia from which it was brought back to India blending itself with the parent body"-(ప్రపంచ సంగీతానికి మూలమైన హిందూదేశపు సంగీతం మొదట 'పర్షియా-గ్రీసు' దేశాలలోకి అచటి నుండి 'అరేబియా'లోకి, అచట నుండి మళ్ళీ మనదేశంలోకి దిగుమతి అయి చివరకు తన మాతృమూర్తి అయిన భారతీయ సంగీతంలో లీనమైపోయింది) అని సంగీతజ్ఞులు పేర్కొంటున్నారు. భారతీయ సంగీతంలో ఏ మార్పులు చేసి సమ్మేళన చేసినా, దాని ప్రకృతి సిద్ధమైన రాగ పద్ధతిని విడనాడి, మరొక విధానాన్ని సృష్టించడం అసాధ్యం.... దాని సంప్రదాయ శృంఖలాలను విడదీసుకొనగలమేమో కాని, దాని ప్రధాన సూత్రాల నుండి వైదొలగలేము. "In Indian music, it is not possible to build anything other than the Raga basis. We can run away from its fetters but not from its main outline" అని గురుదేవులు రవీంద్రనాధఠాగూరు చెప్పారు - తమ సంగీత పద్ధతిలో పాశ్చాత్య విధానాల అనుకరణ ఉన్నదని విమర్శించినపుడు, ఆయన ఈ సమాధానం చెప్పారట.

మన సంగీత దర్శకులు, చిత్ర సంగీతాన్ని సంకరం చేస్తున్నారనీ, అనుకరణ ప్రియులవుతున్నారనీ విమర్శించడం అంత సమంజసం కాదని నా అభిప్రాయం. చిత్రాలు ప్రజలకు వినోదం కోసం వుద్దేశింపబడినవి. అందుచేత చిత్రాలలో ఎన్నో తమాషాలు, మాంత్రికమైన తంత్రాలు చొప్పించి ప్రజలను ఆనందింపచేస్తున్నారు. అలాగే చిత్ర సంగీతంలో కూడా ఆయా సందర్భాలకు అనుగుణంగా మన సంగీత దర్శకులు వినోదం కోసం బాణీలను సమకూర్చడం జరుగుతుంది. అయితే మక్కికి మక్కి, హిందీ చిత్రాలలోని పాటలను, ఇంగ్లీషు రికార్డులలోని ట్యూన్స్‌ను కాపీ చేసి యథాతథంగా పాటలను కూర్చడం సమంజసం కాదని ఒప్పుకొనక తప్పదు. అనుకరణ చేసేటప్పుడు, చేసినట్టు తెలియని విధంగా ఒరిజినాలిటీని చూపినప్పుడు ఆ సంగీత రచనకు గాని, పాటకు గాని ఒక విశిష్టత ఏర్పడుతుంది.

తెలుగు చిత్ర సంగీతపు విలువలను పెంచడానికి కీ॥శే॥ శ్రీ నాగయ్య గారు తమ సొంత బాణీలకు అనుకరణలను కూడా కొంత మేళవించి ప్రజాదరణ పొందారు. మాలపిల్ల, రైతుబిడ్డ చిత్రాలలో కీ॥శే॥ బసవరాజు అప్పారావు గారి భావ గీతాలకు కీ॥శే॥బి.ఎన్.ఆర్.గారు కూర్చిన సంగీతం ఒక నూతన ప్రయోగం అనీ, ఆయన మేధస్సుకు గీటురాయనీ చెప్పక తప్పదు.

ఇలాగే మన సంగీత దర్శకులు వారి వారి సృజనాత్మక శక్తి వున్నంత మేరకు వాడుకలో వున్న సంగీత బాణీలను తీసుకొని, చిత్రాలలోని సందర్భాలకు తగినట్టుగా తమ సంగీత బాణీలను మలచుకొని నూతన ప్రయోగాలను చేస్తున్నారు. వారి కృషిని మనం హర్షించాలి. వినోదమే ప్రధానమైన మన చిత్రాలలోని సంగీతం ప్రజలను వినోదింపజేయుడమే ప్రధానం కాని, అది సంప్రదాయపు సంకెళ్ళలో బంధింపబడడం అభిలషణీయం కాదు. ఆ సూత్రాలతో చిత్ర సంగీతాన్ని సృష్టించడం అసాధ్యం. నేటి చిత్ర సంగీతం అవధిని గ్రహించి, నీరక్షీర న్యాయంగా మంచి గ్రహించి చెడును త్రోసి వేయడం రసికులకూ, విమర్శకులకు సమంజసమని నా విశ్వాసం. ■

# ఆదినారాయణరావు హిట్స్

## చిత్రం: సువర్ణసుందరి (1957)

రచన: భరత్ వ్యాస్ గానం: లతా, రఫీ

కుహు కుహు బోలే కోయలియా (2)
కుంజ్ కుంజ్ మె భవ్‌రే డోలే..గున్ గున్ బోలే.. ఆ ఆ ఆ ॥కుహు॥
సజ్ సింగార్ రిత్ ఆయి బసంతి (2)
జైసేనార్ కోయి హో రస్‌వంతీ
సనిదమదనిస
గమగమదనిస
రిసని దని/సరిసని/సరిసని
దనిని దనినిదని మదద మదదమగ
గరిగమదని ॥సజ్ సింగార్॥
డాలీ డాలీ కలియోంకో తితిలియ చూమే
ఫూల్ ఫూల్ పంఖుడియా ఖోలే అమృత్ ఘోలే... ఆఆఆ॥కుహు॥
కాహే ఘటామె బిజిలీ చమ్‌కే ॥కాహే॥
హో సక్‌తాహై మేఘ్ రాజ్ నే బాదరియా కా
షామ్‌షామ్ ముఖ్ చూమ్‌లియాహో ॥షామ్॥
చోరీ చోరీ మన్ పంఛీ ఉడే నైనా జుడే...ఆఆఆ... ॥కుహు॥
చంద్రికా దేఖ్ ఛాయీ ప్రియ చంద్రికా దేఖ్ ఛాయీ
చందాసే మిల్‌కె మన్ హి మన్ మే ముస్‌కాయీ ఛాయీ ॥చంద్రికా॥
శరద్ సుహావన్ మధుమన్ భావన్ ॥శరద్॥
విరహి జనోంకా సుఖ్‌సర్ సావన్ (2)
ఛాయీ ఛాయీ పూనమ్‌కి జతా ఘూంఘట్ హటా.. ఆఆఆ ॥కుహు॥
సరస్ రాత్‌మన్ భాయే ప్రియతమా కమల్ కమల్ నిమిలే॥సరస్॥
కిరణ్ హార్ దమ్‌కే
జలమే చాంద్ చమ్‌కే
మన్ సానంద్ ఆనంద్ డోలే
మన్ సానంద్ ఆనంద్ డోలే
నిరిగమదనిస దనిస
సనిసగరిగ సరినిసదని మదనిస నిరినిరి
ధనిదని మదమద గమగమ గమదనిన గమదనిన దనిసా

## మోసగాళ్ళకు మోసగాడు

రచన: ఆరుద్ర గానం: సుశీల, బాలు

కోరినది నెరవేరినది
ఓహో కలలు నిజమాయె
కోరినది దరి చేరినది
అహో ఎదలు ఒకటాయె
తొలివలపే మధురసము
మన బ్రతుకే పరవశము ॥కోరినది॥
పూలతోటలై నా అందాలు పూచేనులే
తనివి తీరగా మకరందాలు గ్రోలేనులే
దోచుకున్న వలపు దాచుకున్న నాడే
సుఖం సుఖం సుఖం
తోడుగా నీడగా సాగిపో ॥కోరినది॥
రాగబంధమై పెనవేసుకున్నానులే
మూగ కోరిక నే తెలుసుకున్నానులే
ఊసులాడు వేళ బాస చేయు వేళ
ఇదే....ఇదే....ఇదే
ఆడుకో ఆశలే తీర్చుకో ॥కోరినది॥

## కళ్యాణ మంటపం

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: పి. సుశీల

చుక్కలు పాడే శుభమంత్రం!
దిక్కులు నిండే దివ్యమంత్రం!
ఎక్కడనో, ఎపుడో, ఎవరో
పలికిన వేద మంత్రం!
ఇక్కడనే ఇపుడే ఎవరో - నా
చెవిలో ఊదిన మంత్రం,
మధు మంత్రం ॥చుక్కలు॥
రెక్కలపై ఆ గువ్వలజంట,
రేకులలో ఆ పువ్వులజంట,
సాగుచునే, ఊగుచునే,
మధుర మధురముగ, మక్కువగ,
చదువుకునే ఆనంద మంత్రం ॥చుక్కలు॥
కన్నులు ఒకపరి మూసుకొని - నీ
వన్నది మరి మరి తలచుకొని,
ఒక్కతెనే - నేనొక్కతెనే
అదే పనిగనే సదా మనసులో
ఆలపించే ప్రియ మంత్రం ॥చుక్కలు॥
కోవెల దైవం పిలిచే దాకా,
ఆవలి ఒడ్డున నిలిచే దాకా,
నాలోనే లోలోనే
"నాతి చరామి నాతి చరామి" -
అది నా ప్రాణ మంత్రం ॥చుక్కలు॥

## భక్తతుకారాం

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: ఘంటసాల

హరి ఓం...హరి ఓం...హరిఓం...
ఆ......ఆ.....ఆ.....
ఘనా ఘన సుందరా కరుణా రసమందిరా ॥2॥
అది పిలుపో మేలుకొలుపో
నీ పిలుపో మేలుకొలుపో
అది మధుర మధుర మధురమౌ ఓంకారమో
పాండు రంగ పాండు రంగ ॥ఘనా॥
ప్రాభాత మంగళ పూజావేళ
నీ పద సన్నిధి నిలబడి
నీ పద పీఠిక తలనిడి ॥ప్రాభాత॥
నిఖిల జగతి నివాళులిడగా
నిఖిల జగతి నివాళులిడగా
వేడగా కొనియాడెద
పాండు రంగ పాండు రంగ ॥ఘనా॥
గిరులు ఝరులు విరులు తరులు
నిరతము నీ పాద ధ్యానమే
నిరతము నీ నామ గానమే ॥గిరులు॥
సకల చరా చరా లోకేశ్వరేశ్వర
సకల చరా చరా లోకేశ్వరేశ్వర
శ్రీకర భవహర
పాండు రంగ పాండు రంగ ॥ఘనా॥

సీరియల్ 8

# హాస్యవల్లరి - సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



**అక్టోబరు 13, 1987.**

మరణించే నాటికి కిశోర్ వయసు 58 సంవత్సరాలు. దానిలో 40 సంవత్సరాలు బొంబాయిలోనే గడిచాయి.

1947 లో బొంబాయి చేరేనాటికి అతను అనామకుడు. పేరున్న హీరోకు తమ్ముడు. స్వయం ప్రతిభ ఏమీ కనబరచనివాడు. చదువు పెద్దగా రానివాడు.

కానీ 1987 లో బొంబాయి విడిచి పరలోకానికి వెళ్లేనాటికి అతను దేశం మొత్తంలోనే కాదు, విదేశాలలో కూడా అతని కోసం రోదించే అభిమానులను సంపాదించుకోగలిగేంత పేరుప్రఖ్యాతులను మూట గట్టుకున్నాడు.

ఇవన్నీ అతనికి ప్రసాదించినది బొంబాయి నగరమే! అక్కడ నెలకొన్న హిందీ చిత్రరంగమే అతన్ని పోషించి పెద్ద చేసింది. సినిమాలు తగ్గినప్పుడు అక్కడున్న షణ్ముఖానంద హాలే స్టేజిషోల ద్వారా అతనికి అంతులేని సిరులను కట్టబెట్టింది!



'కరోడ్‌పతి'లో కిషోర్‌కుమార్

కానీ తనకు తిండిపెట్టిన బొంబాయి నగరంపై కిశోర్‌కుమార్‌కు మమకారం ఉన్నట్టు లేదు. జీవితంలో మూడింట రెండువంతుల భాగం అక్కడే గడిపినా ఆ నగరంతో అతను మమేకం కాలేకపోయాడు. కిశోర్ తన అంత్యక్రియల విషయంలో కోరిన కోరిక బట్టే ఈ విషయం తేటతెల్లం అయింది. తన అంత్యక్రియలు ఖాండ్వాలో జరగాలని అతను వీలునామా వ్రాసుకున్నాడు. అతని కోరికను మన్నించడానికి కుటుంబసభ్యులు నిశ్చయించుకోవడంతో కిశోర్ చనిపోయిన సాయంత్రమే అతని పార్థివ శరీరానికి లేపనం చేయడం ప్రారంభించారు. లేకపోతే ఖాండ్వా చేరేలోపున శవం కుళ్లిపోయి, దుర్వాసన వచ్చే ప్రమాదం ఉంది.

కిశోర్ బెంగాలీ కదా అతను ఏ కలకత్తా మీదో ప్రేమ పెంచుకోవడం పోయి, ఎక్కడో మధ్యప్రదేశ్‌లో ఉన్న ఖాండ్వా మీద అంత అభిమానం ఎందుకంటే- అది అతని జన్మస్థలం కాబట్టి!

**కిశోర్ మూలపురుషుడు గజదొంగ!**

కిశోర్ కుటుంబం అక్కడకు చేరిన కథ ఏమిటో తెలుసుకోవాలంటే అతని వంశవృక్షం గురించి చెప్పుకోవాలి. వాళ్ల ఇంటి పేరు గంగూలీ. అంటే బెంగాలీ బ్రాహ్మణులన్నమాట. బెంగాలీ బ్రాహ్మణులలో ముఖోపాధ్యాయలను ముఖర్జీ అనీ, బందోపాధ్యాయులను బెనర్జీ అనీ, చటోపాధ్యాయలను చటర్జీలనీ అంటారు. గంగోపాధ్యాయలను గంగర్జీ అనరు, గంగూలీలని అంటారు. బ్రాహ్మణులలో కూడా శాఖా భేదాలున్నాయి. కిశోర్ కుమార్ కుటుంబాన్ని 'అమాథే' బ్రాహ్మలంటారు. (రవీంద్రనాథ్ ఠాగూరు కుటుంబాన్ని 'పిరాలీ' బ్రాహ్మలన్నట్టు). 'మేం నిజానికి బ్రాహ్మలం కాము.' అంటాడు అశోక్‌కుమార్.

ఆయన మాటల్లో చెప్పాలంటే - 'ఓ సారి మా నాన్నగారే చెప్పారు. మా వంశం రఘునాథ్ అనే గజదొంగ నుండి ఉద్భవించిందట! బెంగాల్‌లో రఘునాథ్‌కి రాబిన్‌హుడ్ ఇమేజి ఉంది. అతన్ని 'కురుల్‌గాచ్చి రఘో' అనేవారు. అతని గురించి టాగోర్ ఓ కవిత రాసాడు కూడా. ఓ సారి బ్రిటిష్ సైనికులు అతన్ని వెంటాడితే గుడిలో వెళ్లి దాక్కున్నాడు. అక్కడే దేవుడి ముందు ఒట్టు వేసుకున్నాడు. సైనికులు లోపలికి వెళ్లి చూసేసరికి ఓ ముసలి బ్రాహ్మణుడు కనబడ్డాడు. సైనికులు మరలిపోయారు. రఘునాథ్ జీవితంలో మళ్లీ దోపిడీ దొంగతనాలు చేయలేదు. అతడిని బ్రాహ్మడిగా తక్కినవారు అంగీకరించారు. ఈ రఘునాథ్ మునిమనుమడే మా నాన్న"

**ఓ పిచ్చి మారాజు తల్లివైపు చుట్టం**

1850 ప్రాంతాలలో బెంగాల్‌లోని కృష్ణనగర్ ఎస్టేటులోని మునీమ్ దుర్గాచరణ్ అనే ఆయన యజమానితో పోట్లాడి బెంగాల్ విడిచి పొట్టపోసుకోవడానికి పక్కనే ఉన్న బిహార్ రాష్ట్రానికి తరలి వెళ్లిపోయాడు. భాగల్పూర్ చేరి అక్కడ ఉపాధ్యాయుడిగా పనిచేశాడు. తన కొడుకు శిబచంద్రను బాగా చదివించాడు. శిబచంద్ర కలకత్తా యూనివర్శిటీలో లా లో మాస్టర్స్ డిగ్రీ చేశాడు. ఇతనికి, బంకించంద్ర చటర్జీకి (వందే మాతరం వ్రాసినాయన) ఫస్టు క్లాసు ఫస్టులు రావడంతో బ్రిటిషు ప్రభుత్వం డిప్యూటీ మాజిస్ట్రేటు ఉద్యోగాలు ఇవ్వజూపింది. బంకించంద్ ఉద్యోగానికి అంగీకరించగా శిబచంద్ర వద్దని చెప్పి స్వంత ప్రాక్టీసు మొదలుపెట్టి 12 సంవత్సరాలలో 40 లక్షలు ఆర్జించే స్థాయికి ఎదిగాడు.

ఆ డబ్బును శిబచంద్ర భాగల్పూర్ అభివృద్ధికై ఖర్చుపెట్టాడు. అతని దాతృత్వబుద్ధి చూసి ముచ్చటపడిన ఆంగ్ల ప్రభుత్వం 'నువ్వు ప్రాక్టీసు మానేస్తే రాజా బహాదుర్ అనే బిరుదు నిస్తాం' అన్నారు. శిబచంద్ర సరేనన్నాడు. ఆ బిరుదు తీసుకోవడానికి ఇంగ్లండు వెళ్లాడు. అక్కడి క్రైస్తవ మతం చూసి ముచ్చటపడ్డాడు. క్రిస్టియన్ కావాలన్న పిచ్చి పట్టుకుంది ఆయనకు. అది విని బ్రిటిష్ వాళ్లు మురిసిపోయారు. ఓ హై క్లాసు హిందూ, క్రిస్టియన్ అయితే ఇక చెప్పేదేముంది! ఆయన ఇంటికి పెద్ద హోదాలో ఉన్న యూరోపియన్స్ అందరూ వచ్చేవారు.

శిబచంద్ర పొంగిపోయేవాడు. "ఇదిగో, నేను వచ్చేవారమే క్రైస్తవమతం తీసుకుంటున్నా" అనేవాడు. అది విని బ్రాహ్మణులు 'అలా అన్నందుకు ప్రాయశ్చిత్తం చేసుకో" అన్నారు. 'నేను హిందువునయితేగా ప్రాయశ్చిత్తం చేసుకోడానికి" అన్నాడు ఈ పిచ్చిమారాజు. "అయితే నిన్ను వెలి వేస్తున్నాం" అన్నారు వాళ్లు. "క్రిస్టియన్ను హిందువులు వెలివేయడం ఏమిటి, నాన్సెన్స్" అని పాయింటు లాగాడు ఈ లాయరు గారు.

క్రమంగా శిబచంద్రకు పిచ్చి ముదిరింది. బ్రిటిషు వాళ్లకు మోజు పోయింది. ఈయన క్రిస్టియన్ అవుతానంటూనే ఏనాటికీ కాలేదు. వెలిమాత్రం ఉండిపోయింది. ఆయన మనమరాలే కిశోర్ తల్లి. కిశోర్ పిచ్చి చేష్టలకు, ఈ మూలాలకు ఏమైనా సంబంధం ఉందేమో తెలియదు.

## కిశోర్ అమ్మా నాన్నల పెళ్లి కథ

రాజా శిబచంద్ర కొడుకు సతీష్ చంద్ర బెనర్జీ. ఆయన కూతురు గౌరీదేవి. చాలా అర్భకంగా ఉండేది. కనీసం అల్లుడైనా మంచి పుష్టిగా ఉండాలనుకుని సతీష్ చంద్ర వరుని వేటలో కలకత్తా వెళ్లాడు. అక్కడ లా కాలేజీలో పరీక్ష రాసి బయటకు వస్తున్న ఓ బలాఢ్యుడిని చూసి ముచ్చటపడ్డాడు. తన ఫ్రెండుని పిలిచి 'అతని వెంట వెళ్లి మాట కలిపి బ్రాహ్మలబ్బాయేమో కనుక్కో' అన్నాడు. అతను కనుక్కుని వచ్చి చెప్పాడు - అతని పేరు కుంజాలాల్ గంగూలీ, ఖాండ్వాకు చెందినవాడు, అని.

ఆ ఊరి పేరు కొత్తగా ఉండడంతో సతీష్ చంద్ర హడావుడిలో దాన్ని పాండ్వాగా అను కున్నాడు. అది ఉత్తరబెంగాల్‌లో మాల్దాకు దగ్గరిలో ఉంది. అక్కడికి వెళ్లి అడిగితే కుంజాలాల్ గంగూలీ అనే పేరుతో ఎవరూ లేరే! అన్నారు. ఆ తరువాత గుర్తుకు వచ్చింది. ఆ అబ్బాయి ఊరు ఖాండ్వా అని. అదెక్కడ ఉందో తెలియదు. కలకత్తాకు వచ్చి విచారిస్తే తెలిసింది సెంట్రల్ ప్రావిన్స్‌లో (తరువాత మధ్యప్రదేశ్ అన్నారు) ఖాండ్వా అనే ఓ ఊరు ఉందని. అక్కడ ఓ హోటల్ లో దిగి కుంజాలాల్ గురించి వాకబు చేస్తే తెలిసింది - అతను నిజంగా ఎక్సర్‌సైజులు చేసేరకమేనని. కుస్తీపోటీల్లో పాల్గొనేవాడట. ఓ సారి శాండో అనే వస్తాదు తన ట్రూపుతో బాటు యూరోపు తిప్పుతాను రమ్మన్నాట్ట. తండ్రి వద్దనడంతో ఈ అబ్బాయి ఆగిపోయాడట!

అల్లుడి దేహదారుఢ్యం గురించి


కిషోర్ తల్లిదండ్రులు కుంజాలాల్, గౌరీదేవి

సతీష్‌చంద్రకు అనుమానాలేమీ మిగల్లేదు. వాళ్లది డబ్బున్న కుటుంబం కాకపోయినా పిల్లనివ్వడానికి సంకోచించలేదు. 1902 లో గౌరీదేవినిచ్చి పెళ్లి చేసి చేతిలో 27,000 రూపాయలు పెట్టి 'ఏ టెన్షనూ లేకుండా లాయరుగా ప్రాక్టీసు మొదలెట్టు నాయనా' అన్నాడు.

## కుంజాలాల్ - గౌరీదేవి

ఖాండ్వాలో స్థానికంగా ఉండే నేమాదీలతో బాటు మహారాష్ట్రవాళ్లు ఎక్కువమందే ఉండేవారు. కొద్దో గొప్పో బెంగాలీ కుటుంబాలు ఉండేవి. వాళ్లు తరతరాలుగా అక్కడ స్థిరపడ్డవారు. బెంగాలీ మూలాలు కాపాడుకుంటూనే (ప్రతీ యేటా దుర్గాపూజ చేయడం వాటిలో ఒకటి) స్థానికులతో బాగా కలిసిపోయేరు. కొంతమంది బెంగాలీ కంటె హిందీ బాగా మాట్లాడగలిగేవారు. వారిలో కుంజాలాల్ ఒకడు.

కుంజాలాల్ తన ప్రాక్టీసు అక్కడే ప్రారంభించాడు. బాగానే సాగింది. నౌకర్లు, చాకర్లుతో బాటు కారు కూడా ఉండేది. స్వతహాగా ఆయన నెమ్మదస్తుడు. హాస్యప్రియుడు. అనేక మంది స్నేహితులు ఉండేవారు. హంగూ, ఆర్భాటం లేకుండా ప్రశాంతంగా జీవితం గడిపేయడానికి ఇష్టపడేవాడు. ఎక్కువగా హిందీ లోనే మాట్లాడేవాడు.

కానీ ఆయన భార్య గౌరీదేవి దీనికి విరుద్ధమనే చెప్పాలి. పొట్టిగా, లావుగా ఉండేది. జమీందార్ల కుటుంబంలో పుట్టి తండ్రి మూర్ఖత్వం వల్ల మధ్యతరగతివాడిని పెళ్లాడవలసివచ్చినందుకు వగచినట్లు కనబడేది. బిగ్గరగా మాట్లాడే అలవాటు, అందరినీ క్రమశిక్షణలో పెట్టాలనే తాపత్రయం. ఆడపిల్లలు చదువుకోవడం అరుదైన ఆ రోజుల్లో ఆమెకు బెంగాలీ, ఇంగ్లీషు భాషల్లో మంచి ప్రావీణ్యం ఉండేది. ఎన్నో పుస్తకాలు చదివింది. సంగీతం అన్నా, సినిమా అన్నా చాలా ఇష్టం. భాగల్పూరులో ఉండగా టూరింగు టాకీసులలో సినిమాలు చూసేది.

కుంజాలాల్, గౌరీదేవి దంపతులకు పుట్టిన నలుగురు సంతానంలో కిశోర్ ఆఖరివాడు. అతను పుట్టేనాటికి తండ్రికి 45 ఏళ్లు. కుర్రవాడికి 'ఆభాస్ కుమార్' అని పేరు పెట్టారు. అభాస్ అంటే కాంతి అనే అర్థంతో బాటు 'ఒకటి మరోదానిలా కనబడే గుణం' అనే అర్థం కూడా ఉంది. (ఇంగ్లీషులో 'పేరడాక్స్' అంటాం). తెలుగులో కూడా రసాభాసం, విరోధాభాసం అని వాడతాం కదా! కిశోర్ జీవితం విరుద్ధాల, విపరీతాల మయమే కదా! జ్యోతిష్కుడి సలహా మేరకు 'క' అనే అక్షరంతో ప్రారంభమయే కిశోర్ అనే పేరు కూడా పెట్టారు.

## ఖాండ్వాలో కిశోర్ బాల్యం

కిశోర్ పుట్టేనాటికి ఖాండ్వా జనాభా 30 వేలుంటుంది. చిన్న పట్టణం కాబట్టి ఒకరి కొకరు బాగా తెలుసు - ముఖ్యంగా అక్కడున్న బెంగాలీ కుటుంబాలు తక్కువే కాబట్టి రాకపోకలు బాగా ఉండేవి. చిన్న ఊళ్లో, స్వజనాల మధ్య పెరగడం కిశోర్‌కు లభించిన వరం. పైగా ముదిమిన పుట్టిన కొడుకు కాబట్టి తల్లిదండ్రులిద్దరికీ ముద్దే! చదువు విషయంలో తప్ప (పాపం కిశోర్ దాంట్లోనే వీక్!) తక్కిన అన్ని విషయాలలోనూ తండ్రి చాలా ఆప్యాయంగా ఉండేవాడు. ఆయన కొడుకుతో హిందీలో మాట్లాడితే, తల్లి బెంగాలీ నేర్పించేది. సత్యజిత్ రాయ్ తండ్రి సుకుమార్ రాయ్ రాసిన నాన్సెన్స్ లిమరిక్స్‌తో సహా నర్సరీ రైమ్స్ నేర్పించేది. ఇలా కిశోర్‌కి రెండుభాషల్లోనూ ప్రావీణ్యం వచ్చింది.

చిన్నప్పటినుండీ కిశోర్‌కు అల్లరి చేయడం, కథలు చెప్పడం సరదా. కథలు చెబుతూ బాక్‌గ్రౌండ్ ఎఫెక్టుకై నోటితో రకరకాల శబ్దాలు పుట్టించేవాడు. స్కూలులో చెప్పే చదువంటే కిశోర్‌కు మహా తలకాయనొప్పి. ముఖ్యంగా లెక్కలంటే మరీనూ. ఆటల్లోనూ, సినిమాలు చూడడంలోనూ ఉండే మజా అతనికి చదువులో కనబడలేదు. అప్పుడప్పుడు ఊళ్లో ఉన్న క్రైస్తవ శ్మశానానికి వెళ్లి అక్కడే ఒంటరిగా కూచునేవాడు. అక్కడ సమాధిఫలకాల మీద రాసినవి చదువుతూండేవాడు. శుచీ, శుభ్రం లేకుండా కొడుకు ఇలా వల్లకాడు పట్టుకు తిరగడం తండ్రికి నచ్చలేదు. కొడుకును చావగొట్టాడు.

క్రైస్తవుల స్మశానంలో సమాధి ఫలకాలు చదివే అలవాటు పెద్దయినా కిశోర్‌ను విడిచిపెట్టలేదు. జుహూలో ఉండగా దగ్గరలో ఉన్న బీచ్‌కి మార్నింగ్ వాక్‌కి వెళుతూండేవాడు. ఒక్కోప్పుడు అక్కడ ఉన్న సెమెటరీకి వెళుతూండేవాడు. ఓ రోజు అలా చూస్తూండగా ఓ సమాధి కనబడింది. అక్కడ ఖననం చేయబడ్డతను ఎవరా అని ఫలకం మీద చూస్తే ఆయనపోయిన తేదీ సరిగ్గా కిశోర్ పుట్టిన తేదీనే! (అది ఒక క్రైస్తవ సన్యాసిది) తాను క్రితం జన్మలో క్రిస్టియన్ ఫాదిరీనని, అక్కడ చనిపోయి, ఇక్కడ పుట్టానని కిశోర్‌కు ఎందుకోగానీ గట్టి నమ్మకం ఏర్పడిపోయింది. అనేకసార్లు అక్కడకు వెళుతూండేవాడు. అక్కడికి వెళితే అతనికి ఏదో తెలియని ఫీలింగు కలిగేదిట. క్రైస్తవంలో పునర్జన్మ సిద్ధాంతం లేదు. అయినా కిశోర్ నమ్మకం అతనిదే! వాళ్ల ముత్తాత శిబచంద్ర కూడా తను క్రిస్టియన్ అనుకునేవాడు కానీ చివరివరకు హిందువుగానే జీవించాడు.

ఓ సారి ఓ చర్చి కిశోర్‌కు కలలోకి వచ్చింది. అది గోవాలో ఉన్నట్టు అనిపించింది. గేట్లు తెరిచివున్నాయి. లోపల భక్తులు గానీ, స్టాఫ్ గానీ ఎవరూ లేరు. ఒకే ఒక పూజారి ఉన్నాడు. అతన్ని చూడగానే బాగా తెలునున్న మొహంలా అనిపించింది. శ్రద్ధగా చూస్తే అది తన మొహమే! కిశోర్‌కు తన క్రైస్తవ గతం గురించి ఇక సందేహమే లేదు. శిలువ బొమ్మలు, వర్జిన్ మేరీ బొమ్మలు సేకరించి తన ఇంట్లో గోడలమీద అలంకరించి పెట్టాడు. ఓ సారి అశోక్‌కుమార్‌తో ఈ విషయం చెప్పాడు. "ఓ సారి గోవాకి వెళ్లి ఆ చర్చి చూడరాదా, సందేహం తీరిపోతుంది'. అన్నాడు అశోక్. 'సరే' నన్నాడు కానీ కిశోర్ గోవాకి వెళ్లలేకపోయాడు. అన్ని దేశదేశాలు తిరిగిన కిశోర్ గోవా మాత్రం వెళ్లలేకపోవడం, మిస్టరీ మిస్టరీగా మిగిలిపోవడం ఓ తమాషా!

## చదువూ సంధ్యా

కిశోర్ చదువు సంధ్యలు ఇలా ఏడ్చినప్పుడు మార్కులు మాత్రం ఇంకోలా ఎలా ఉంటాయి? అప్పటికీ ప్రోగ్రెస్ కార్డులో కిశోర్ చేయి చేసుకుంటూనే వుండేవాడు. ఓ సారి మాత్రం మరీ పెద్ద గొడవ అయిపోయింది. ఆ సారి మార్కులు మరీ అధ్వాన్నంగా వచ్చాయి. ప్రోగ్రెస్ రిపోర్టులో భారీ ఎత్తు మార్పులే చేయవలసివచ్చింది. చేసి తండ్రికి బహుశ్రద్ధగా కార్డు అందించాడు. పరీక్షల్లో కొడుకు నిర్వాకం ఆయన కప్పుడే తెలిసిపోయింది. దారిలో వాళ్ల లెక్కల టీచరు కలిసి కుర్రవాడి మంచీ, చెడ్డా (చెడ్డే ఎక్కువ) మాట్లాడేడు. పాపం ఆ విషయం కిశోర్‌కు తెలియదుగా!

ప్రోగ్రెస్ రిపోర్టు చూసి తండ్రి చిరునవ్వు నవ్వాడు. 'ఈ సారి బాగానే వచ్చినట్టున్నాయే' అన్నాడు సంతోషం ప్రకటిస్తూ (ఆయనా తక్కువవాడు కాడు, ముగ్గురు నటులకు జన్మ నిచ్చినవాడు). కిశోర్ వినయం నటించి, "కష్టపడి చదివా నాన్నా' అన్నాడు. 'లెక్కలది క్వశ్చన్ పేపరు పట్రా" అన్నాడాయన. "అబ్బే, పరీక్షలయిపోయాక అవేమీ దాచను. పారేస్తాను." అన్నాడు కిశోర్ బెదురుతూనే.

తండ్రి జేబులోంచి ఓ ప్రశ్నాపత్రం బయటకు లాగేడు. "ఇదేనా అది?" అన్నాడు. కిశోర్ గుండె జారింది. తలకాయ వూపాడు.

"ఈ మొదటి లెక్క ఎలా చేశావో కాస్త చేసి చూపించు."

కుడితిలో పడ్డ ఎలుకకు వేరే గతేముంది? గుటకలు మింగుతూ పేపరూ, పెన్సిలూ తీసి చేయడం మొదలుపెట్టింది. చేసింది, చేసింది, చాలా సేపే చేసి కాగితం తండ్రి ముందు పెట్టింది. తండ్రి అది చూసి తలాడిస్తూ, "కాస్త దగ్గరికి రా" అని ఆప్యాయంగా పిలిచాడు.



'చాచా జిందాబాద్'లో కిశోర్

ఏదో కుట్ర వుందని సందేహిస్తూనే కిశోర్ తలకాయ మాత్రం ముందుకు జాపాడు. చెవి మాత్రం దొరికింది తండ్రికి. అది పట్టుకుని మెలిపెడుతూ "రాస్కెల్, ఇప్పుడే మీ టీచరు కనబడి నీ ఆన్సరు షీటు చూపించాడురా'. అంటూ లేచాడు.

కిశోర్ తాట ఒలవడంతో కథ పూర్తవలేదు. ముక్కు నేలను రాయించి, అవమానించడం జరిగింది. కానీ కిశోర్ చదువు బాగుపడలేదు.

కిశోర్‌కు తిండియావ ఎక్కువ. ఇంట్లో తిండిపదార్థం ఏదైనా మిగిలిపోతే 'కిశోర్‌కు ఇచ్చేయండి, కానిచ్చేస్తాడు" అనేవారు. ఓ సారి అశోక్‌కుమార్ బొంబాయినుండి ఇంటికి వచ్చేసరికి రాత్రి పదకొండు అయింది. కిశోర్ మగతనిద్రలో ఉన్నాడు. తనను ఎలా లేపాలో అశోక్‌కు బాగా తెలుసు. "ఒరే కిశోర్ ఆమ్లెట్ తింటావా?" అన్నాడు మెల్లగా. చటుక్కున లేచి కూచున్నాడు కిశోర్! బకాసురుడి స్టయిల్లో 'ఎక్కడ? ఎక్కడుంది ఆమ్లెట్!" అంటూ అరిచాడు.

కిశోర్‌కు సినిమాలంటే పిచ్చి. అప్పట్లో టికెట్ ఖరీదు కానీ (రూపాయికి 64 కాన్లు) ఉండేది. సినిమా చూసి, ఇంట్లో పాటలు పాడి, అభినయించి చూపి పాకెట్ మనీ సంపాదించి దాన్ని మళ్లీ సినిమాలకు ఖర్చుపెట్టేవాడు. పాడేటప్పుడు కుదురుగా ఉండడం కిశోర్ తరమయ్యేది కాదు. అటూ, ఇటూ తిరుగుతూ కనీసం పదడుగుల దూరం కవర్ చేసేవాడు. చివర్లో ఓ రెండు మొగ్గలు వేయడం తప్పనిసరి!

ఎక్కువగా హిందీ సినిమాలే చూసేవాడు. ఇంగ్లీషు సినిమాలు అర్థమయ్యేవి కావు. హిందీపాటలే నోటికి పట్టేవి. మాటలు మర్చిపోతే నోటికి వచ్చినవి పెట్టేసేవాడు. 12 యేళ్ల వయసు వచ్చేసరికి వాళ్ల అశోక్ అన్నయ్య పాడిన పాటలే కాక, సైగల్ పాటలు కూడా మాస్టర్ చేసేశాడు. వాళ్ల ఇంట్లో రేడియోతో బాటు, 78 ఆర్.పి.ఎమ్. రికార్డులు వేసే గ్రామఫోన్ ఉండేది. కానీ ఆ రికార్డులు బెంగాలీ భక్తిగీతాలు.

అతనికి లెక్కలు రాకపోవడం ఫామిలీలో పెద్ద జోక్ అయిపోయింది. ఓసారి అశోక్ కుమార్ సెలవులకు వచ్చినప్పుడు కిశోర్‌ను పిలిచాడు, "ఒరే చిన్న లెక్క అడుగుతాను చెప్పు. పదిహేను మామిడికాయల ధర అయిదు రూపాయలయితే, ఐదు రూపాయలకు ఎన్ని మామిడికాయలు వస్తాయి చెప్పు." అని అడిగాడు.

లెక్క అనగానే కిశోర్‌కు ముచ్చెమటలు పట్టేశాయి. గబగబా వేళ్లు మడిచి, తెరిచి, తలకాయ గోక్కుని, గోక్కుని పదినిమిషాల తర్వాత 'పాతిక' అని తేల్చాడు!

అలాగే ఇంకోసారి కాస్త పెద్దయ్యాక కిశోర్ మరో ప్రశ్న ఎదుర్కోవలసి వచ్చింది. "ఓ ఎద్దు మూడు శేర్ల పాలు ఇస్తే, మూడు ఎద్దులు ఎన్ని శేర్ల పాలు ఇస్తాయి?" అని అడిగాడు అశోక్.

ఆ పాటికి కిశోర్ లెక్కల్లో దిట్ట అయినట్టున్నాడు. చేతివేళ్లు, కాలివేళ్లు ఉపయోగించి 'పదిహేను" అని చెప్పి అశోక్ కేసి ఆశగా చూసాడు. మెచ్చుకుని బిళ్లో, బిస్కట్లో ఇస్తాడని. కానీ అశోక్ పగలబడి నవ్వాడు. - "ఎద్దులు పాలివ్వగా ఎప్పుడైనా చూశావా?" అని.

చిన్నారి కిశోర్ మెదడులో ఎన్నో సందేహాలుండేవి - అతను ఓ సారి లక్ష్మీదేవి కేలండరును పరీక్షగా చూస్తూండగా గమనించిన అశోక్ కుతూహలంగా వెళ్లి అడిగాడు - "ఏమిట్రా చూస్తున్నావ్?" అని. "ఈవిడ వేసుకున్న చీర ఏ మిల్లులో తయారయిందా అని చూస్తున్నాను. మిల్లు స్టాంపు ఎక్కడా కనబడటం లేదు." అన్నాడు కిశోర్. నుదురు కొట్టుకుంటూ అశోక్ అక్కడనుండి వెళ్లిపోయాడు.

రవీంద్రగీతాలు. కిశోర్‌కు గ్రామఫోన్ మీద మోజు లేదు. రేడియో పాటలే వినేవాడు. తల్లి దగ్గర్నుంచి హార్మోనియం నేర్చుకున్నాడు. గాయకుడు కావడమే జీవిత ధ్యేయంగా పెట్టుకున్నాడు.

వీటన్నిటితో బాటు కిశోర్ కథలు కూడా రాసేవాడు. హిందీలో రాసుకునేవాడు. స్క్రీన్‌ప్లేలు, విజువల్స్ అన్నీ రాసిపెట్టుకుని ఎవరికీ


స్టేజిమీద కిశోర్

చూపించేవాడు కాదు. అతను పెద్దయి, సినిమాలు తీసేటప్పుడు ఈ ఐడియాలు కొన్ని వాడుకున్నాడు.

**కాలేజీలో కిశోర్**

ఇంటర్ చదవడానికి కిశోర్, అనూప్ ఇండోర్ వెళ్లి హాస్టల్‌లో ఉండేవారు. కాలేజీరోజుల్లో కిశోర్ సన్నగా ఉండేవాడు. తన బాడీ చూసి ఎవరైనా నవ్వుతారనే భయంతో కిశోర్ చొక్కా మీద ఓవర్‌కోట్ వేసేవాడు, కింద పైజమా, శాండల్స్. మెడచుట్టూ మఫ్లర్. ఈ వేషధారణ చూసి సాటి విద్యార్థులు నవ్వేవారు కానీ అతను పాడగలడన్న విషయం బయటకు పొక్కగానే కుర్రాళ్లు అతన్ని ఆదరించసాగారు. సినిమాపాటలు అనుకరించడమే కాక, అప్పటికప్పుడు ఏ సబ్జక్టు మీద నైనా ట్యూన్ కట్టి పాడగలడని తెలిసిన దగ్గర్నుంచీ మరీ వెర్రెక్కిపోయారు.

ఈ విషయం లెక్చరర్ల దాకా వెళ్లేసరికి కాలేజీడే నాడు ఈ కుర్రవాడి చేత స్టేజిమీద ప్రదర్శన ఇప్పించాలని నిశ్చయించారు వాళ్లు. కానీ కిశోర్ 'నాకు స్టేజిఫియర్, అంతమంది ముందు పాడలేన'న్నాడు. 'పోనీ తెర వేసి వుంచుతాం. వెనకనుండి పాడు.' అన్నారు. అన్నారే కానీ పాట సగంలో ఉండగా తెర ఎత్తేశారు. కిశోర్‌కి ముచ్చెమటలు పోశాయి. ఎలాగో ఉగ్గబట్టుకుని పాట ముగించేసి, గ్రీన్ రూమ్‌లోకి పారిపోబోయాడు. కానీ అంతలోనే అందరూ చుట్టుముట్టేశారు. అందరికీ అతని పాట తెగ నచ్చేసింది.

ఇక అప్పటినుండీ హాస్టల్‌లో ఉన్న ఇంటర్ కుర్రాళ్లు రాత్రి అతని రూముకు వచ్చి పాటలు పాడేమని చంపేవారు. అంతా కలిసి ఖవ్వాలీలు పాడుతూంటే ఓ రోజు హాస్టల్ సూపరింటెండెంట్ మందలించడానికి వచ్చాడు. వచ్చినవాడు కిశోర్ పాటలు విని ముగ్ధుడయిపోయి తనూ వచ్చి కూచునేవాడు. ఇక కుర్రాళ్లు రెచ్చిపోయారు.

ఇదంతా వీళ్లకు బాగానే ఉంది కానీ డిగ్రీ కుర్రాళ్లకు తలకాయనొప్పిగా ఉండేది. పరీక్షల రోజుల్లో కూడా గోల ఆగకపోవడంతో అధికారులకు ఫిర్యాదు చేశారు. స్థానికంగా వెలువడే పత్రికలో హాస్టళ్లు గానాబజానా క్లబ్బులుగా మారిపోతున్నాయని వార్తలు రాయించారు. ఆ వార్త పేపర్లో వచ్చిన రోజున కిశోర్ మండిపడ్డాడు. అందరూ సమావేశమై రోజు కంటే గట్టిగా పాడాలని తీర్మానించారు. జీవితాన్ని చదువుకి బలిచేస్తున్న గ్రాడ్యుయేటు కుర్రాళ్లను వెక్కిరిస్తూ అప్పటికప్పుడు ఓ ఉర్దూ కవిత రాసేశాడు ఓ కుర్రాడు. ఆ రాత్రి ముప్పై మంది కుర్రాళ్లు తారస్థాయిలో గంటల తరబడి ఆ పాటా, ఇంకా కొన్ని కొక్కిరాయి పాటలు బృందగానం ఆలపించారు. ఆ పేట పేటంతా ఆ పాటలతో మారుమోగింది. ఆ రాత్రి డిగ్రీ విద్యార్థుల చదువు అస్సలు సాగలేదు. కొరివితో తల గోక్కోవడం ఎందుకనుకున్నారు. రాజీపడ్డారు. రోజూలాగే కాస్త తగ్గుస్థాయిలో పాడుకోమని వేడుకున్నారు.

ఇలాటి పరిస్థితుల్లో చదువు ఎంతబాగా సాగివుంటుందో ఊహించవచ్చు. ఇంటర్ పాసవగానే కిశోర్, అనూప్ ముక్తకంఠంతో చెప్పేశారు - 'మేం ఇక పై చదవం' అని. బొంబాయిలో అన్నగారు అశోక్ వద్దకు ప్రయాణం కట్టారు. అక్కడికి వెళ్లి గాయకుడి నవుదామనుకుంటున్నాను. ఎంకరేజ్ చేయమంటే అశోక్ చాల్లే అన్నాడు. కాలేజీలో ప్రదర్శించిన గానకళ అన్నగారిని ఇంప్రెస్ చేయలేకపోయింది.

ఆ మాటకొస్తే కిశోర్ మంచి గాయకుడవుతాడని కుటుంబ సభ్యులెవ్వరూ అనుకోలేదు, అనలేదు- అరుణ్ కుమార్ ముఖర్జీ తప్ప!

(ఇంకా వుంది)

**హాస్య చిత్రాలలో అందెవేసిన చేయి హృషీకేశ**



ఎన్.టి.ఆర్. స్మారక అవార్డు (2000) పొందిన హృషీకేశ్ ముఖర్జీ దర్శకత్వం వహించిన సినిమాలలో సెంటిమెంటల్ చిత్రాలతో బాటు హాస్య చిత్రాలు కూడా చాలా ఉన్నాయి. సున్నితమైన హాస్యానికి పెద్దపీట వేసే హృషీకేశ్ సినిమాలన్నీ కుటుంబ నేపథ్యం లోనే నడుస్తాయి. హృషీకేశ్ మార్క్ కామెడీ చూడాలంటే అనాడీ (1960) బుడ్డా మిల్ గయా (1972) బావర్చీ (1973) చుప్‌కే, చుప్‌కే (1976) గోల్‌మాల్ (1980) ఖూబ్‌సూరత్ (1981) నరమ్, గరమ్ (1982) కిసీ సే న కహ్‌నా, రంగ్ బిరంగీ (1986) చూసి తీరాలి.

**హాస్యాభిమాని భానుమతి**



ఎన్.టి.ఆర్. స్మారక అవార్డు (2001) స్వీకరిస్తున్న డా.భానుమతీ రామ కృష్ణ సంగీతంతో సహా అనేక కళలలో అందె వేసిన చేయి. అయినా ఆమె హాస్య ప్రియత్వాన్ని చెప్పుకుతీరాలి. సాహిత్య అకాడెమీ అవార్డు లభించిన 'అత్తగారి కథలు' ద్వారా ఆమె సృష్టించిన అత్తగారు పాత్రను తలచుకున్నప్పుడల్లా పాఠకుల పెదవులపై మందహాసాలు వెల్లి విరుస్తాయి. అంతేకాదు, తెరపై కూడా ఆమె 'చక్రపాణి', 'వరుడుకావాలి' వంటి హాస్యభరిత చిత్రాలు నిర్మించి హీరోయిన్‌గా నటించారు.

**రఘుపతి వెంకయ్య అవార్డు లభించిన హాస్యనటుడు**



అర్థశతాబ్ది క్రితం 'పుట్టిల్లు' ద్వారా తెలుగు సినీసీమకు వచ్చి ఇప్పటివరకు 1023 సినిమాలలో నటించి 1,116 సినిమాలలో నటించడం తన లక్ష్యమంటున్న అల్లు రామలింగయ్య గారికి రాష్ట్రప్రభుత్వం 2001 వ సంవత్సరానికి గాను రఘుపతి వెంకయ్య అవార్డు ప్రకటించింది. ఆయన వేసిన పాత్రలలో వైవిధ్యం ఉన్నప్పటికీ ప్రధానంగా అవి హాస్యపాత్రలే! స్వర్గీయ రేలంగి తర్వాత మళ్లీ పద్మశ్రీ లభించిన హాస్యనటుడు అల్లు, రఘుపతి వెంకయ్య అవార్డు గెలుచుకున్న తొలి హాస్యనటుడయ్యారు. సామాజిక చింతన కూడా కలిగిన శ్రీ అల్లు రాజమండ్రిలో హోమియో కళాశాల స్థాపించారు.

2000 రఘుపతి వెంకయ్య వెంకయ్య అవార్డు పొందిన శ్రీ టి.ఎల్.కాంతారావు 300 చిత్రాలలో నటించారు. సంగీతప్రాధాన్యత కలిగిన 'సప్తస్వరాలు' వంటి సినిమాలు నిర్మించారు.



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది




కె.ఎస్.ప్రకాశరావు గారు నటుడు, నిర్మాత, దర్శకుడూ. తర్వాత స్టూడియో అధిపతీ. రాఘవేంద్రరావులాంటి గొప్ప దర్శకుణ్ణి కనడం కూడా ఆయన గొప్పదనాలకి పట్టం కడుతుంది. ప్రకాశరావు గారిలో నటుడు, దర్శకుడూ, రచయితా కూడా ఉన్నారు. 'ద్రోహి' సినిమాలో ఆయన ఎంత సహజంగా నటించారో, నటీ నటుల్ని కూడా అలాగే సహజంగా చెయ్యమనే వారు. షూటింగులో స్క్రిప్టు చూస్తూ కృతకంగా కృత్రిమంగా వున్న డైలాగుల్ని కొట్టేసి, సహజంగా వుండేలా రాసేవారు. ఒకసారి ('భలేపాప' సినిమా అనుకుంటాను) నలుగురు పాత్రలతో సీను. అందరం రెడీగా కూచున్నాం. షాటు తీయడం లేదు. "ఇంకా తియ్యరేం? డైలాగులు ఇవ్వరేం?" అని గొణుక్కుంటున్నాం. విషయం ఏమిటంటే, సీను ఇంకా రాలేదు, అది కొత్తగా అనుకున్న సీనుట. రైటర్‌గార్ని రాయమన్నారు. ఆయన దొరకలేదో, దొరికినా రాయలేదో ఏదో అయింది.





ప్రకాశరావు గారు ఇక లాభంలేదని, సీను చెప్పి "మొదట డైలాగు ఇలా చెప్పు'' అని ఒక నటుడితో అన్నారు. "దీనికి నువ్వేం చెబుతావు?'' అని ఇంకోణ్ణి అడిగారు. "నువ్వేం చెబుతావు - చెప్పు'' అని ఇంకొక నటుడ్ని అడిగారు. అలా అందరం చెబుతూవుంటే, ఆయన అక్కడక్కడ డైలాగులు సర్ది - పూర్తిగా మళ్లీ పలికించి , "ఒకే షాటులో తీస్తాను. కావాలంటే ఇంకో రెండు రిహార్సల్సు చేసుకోండి'' అని వ్యవధి ఇచ్చి, షాటు తీసారు. మొదటి టేకులోనే ఓకే చేశారు. "బాగా వచ్చిందయ్యా - సహజంగావుంది. స్క్రిప్టులేకుండా ఇలా తియ్యకూడదనుకోండి. కానీ, ఇదో ఎక్స్‌పరిమెంటు'' అన్నారు - ఏ టెన్షన్లూ పెట్టుకోకుండా నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ సినిమా తీసే ప్రకాశరావు గారు.

**విన్న జోకు:**

ఆయన "మేలుకొలుపు'' తీస్తున్న రోజుల్లో (ఆ సినిమా ఆఫీసు మద్రాసు కచేరీ రోడ్డులో - ఒక సందులో వుండేది. ఇప్పుడు మాలతీచందూర్ గారున్న ఇంటికి దగ్గరలో) ఆయన ఆఫీసులో కూర్చుని పనిచేసుకుంటున్నారు. ఒక్కరే వున్నారు. ఎవరో ఒకాయన ఆయన రూము ముందు తారట్లాడుతున్నాడు. వస్తున్నాడు, ఆయన్ని చూస్తున్నాడు, అటు వెళ్తున్నాడు, మళ్లీ వస్తున్నాడు, ఆయన్ని చూస్తున్నాడు. ఆ తారట్లాటని ఆపిద్దామని ప్రకాశరావు గారు అతన్ని "ఇదిగో'' అన్న పేరుతో పిలిచి, "ఎవరి కోసం?, ఎందు కోసం? ఎవరు మీరు?'' అని అడిగినట్టు అడి గారు. అతను పల్లెటూరివాడిలా వున్నాడు. తడుముకోకుండా -

"ఇక్కడ మడుసుల్ని తీసుకుంటారటగా'' అన్నాడు. వెంటనే ప్రకాశరావుగారు అన్నమాట- "మరి నువ్వొచ్చేవేం?''

* * *

భానుమతి గారు సెట్లో ఉంటే సందడిగానే వుంటుంది. ఆవిడని అందరూ "మాడమ్'' అనే పిలుస్తారు. షూటింగ్‌లో భర్త రామకృష్ణగారు కూడా ఒక్కోసారి "మాడమ్'' అనే అనేవారు. ఆమె ఆయన్ని "మొదలాళీ'' అని పిలిచేవారు. మొదలాళీ అన్నది తమిళపదం. యజమాని, అధిపతి అని అర్థాలు. భానుమతిగారికి తన, మన, పర భేదాల్లేవు. తక్కినవాళ్ల షూటింగ్‌లకి ఆల స్యంగా వెళ్లడం, తన సొంత సినిమా షూటింగ్‌లకి మాత్రం తొందరగా రావడం-లాంటిదేంలేదు. అందరూ ఒకటే. "గృహలక్ష్మి'' షూటింగ్ జరుగు తోంది. రామకృష్ణగారు దర్శకుడు. తెల్లటి పాంటు, తెల్లటి ఇన్ షర్టు, తెల్లగా మనిషీ, తెల్లటి సిగరెట్టు కాలుస్తూ తెల్లగా నవ్వేవారు. మంచి సెన్సాఫ్ హ్యూమరు. టెన్షన్లుండేవి కావు. ఎప్పుడూ ప్రశాంతంగానే ఉండేవారు. "అది నా అదృష్టం. భానుమతిని చేసుకున్నాక ప్రశాంతికాక ఇంకేముం టుంది?'' అన్నారొకసారి ప్రశాంత దరహాస చంద్రికలు ప్రసరిస్తూ.

"మూగమనసులు''సినిమా రజతోత్సవం



హైద్రాబాద్‌లో. భానుమతిగారు ముఖ్య అతిథి. నటీనటులు, టెక్నీషియన్లందరికీ సన్మాన పత్రాలు, మెమెంటోలూ ఇచ్చారు. ఆసన్మాన పత్రాన్ని ఆదుర్తి సుబ్బారావుగారు నన్ను రాయమన్నారు. అప్పటికి నేనింకా సినిమా నటుణ్ని కాలేదు. ఆనందపడిపోతూ సన్మాన పత్రం రాశాను. ఆయన దగ్గర చదివాను. మార్పులూ, చేర్పులూ చెప్పారు. ఆ మహోత్సవంలో నన్నే చదవమన్నారు. "ఆహా! అదృష్టం! ఏమి నా భాగ్యమూ" అని పాట రాసుకుని నేనే పాడేసుకున్నాను. ఆ మహోత్సవానికి అందరూ బయల్దేరారు-మద్రాసు నుంచి.

విమానాశ్రయం అంతా దాదాపు సినిమా సందడే. "మూగమనసులు" తారా, టెక్నీషియన్ల బృందంతో కలకల్లాడుతూ విమానాలు ఎగురుతున్న చప్పుడుని కూడా వినిపించనివ్వలేదు. పలకరింపులు, నవ్వుల చిలకరింపులూ సందడే సందడి. భానుమతిగారూ రామకృష్ణగారూ నిదానంగా వచ్చారు. "షూటింగ్ కాదుగా. ఆలస్యమైతే విమానం వెళ్లిపోదూ! అందుకే టైమ్‌కి వచ్చాం" అన్నారు రామకృష్ణ ఆవిడవేపు చూస్తూ.

విమానంలో విండో సీట్లో సావిత్రి కూచుని వుంటే "మాడమ్" ఆమె పక్కనే కూచోబోతూ వుంటే రామకృష్ణగారు జోక్ పేల్చారు- సావిత్రిని చూసి. "అమ్మా అమ్మా - మాడమ్‌ని ఆ చివర కూచోబెట్టు, నువ్వు ఈ వక్క వచ్చి కూచో- విమానం బాలన్స్ అవుతుంది!" అని. అందరూ గొల్లుమన్నారు. పైలట్ నటనందోహాన్ని చూసి ఆనందపడిపోతూ వుంటే - "ప్లీజ్ డోన్ట్ గో టు ది మూన్. ఆల్ స్టార్స్ ఆర్ హియర్" అని రామకృష్ణగారు, పైలట్‌ని నవ్వించారు.



భరణివారి ఒక షూటింగులో డైరక్టరు, ప్రొడ్యూసరూ రామకృష్ణగారు వెయిటింగు. రెండు పెట్టెల సిగరెట్లయిపోయాయి. షాటుకి "దీపారాధన" కూడా అయిపోయింది. మాడమ్ రావాలి. సాధారణంగా షూటింగ్ ఫ్లోర్‌కి వుండే పెద్ద తలుపులు తియ్యరు. మధ్యలో ఒక చిన్న తలుపుంటుంది - సెంట్రల్ జైలుకి వున్నట్టు. అందరూ దాంట్లోంచే వెళ్లడం, రావడం. రామకృష్ణగారు మూడో సిగరెట్టు పెట్టి విప్పి ఓ సిగరెట్టు నోట్లో పెట్టేసరికి, ఫ్లోర్ పెద్ద తలుపులు తెరుచుకున్నాయి. ఆయన ఒక్కసారి అటుచూసి "ఏం?" అని అడిగారు. "క్రేన్ లోపలికొస్తోంది" అన్నాడు ఫ్లోర్ ఇన్‌చార్జి. "అంతేనా! మాడమ్ వస్తున్నారేమో అనుకున్నాను" అని జోక్ పేల్చారు.

"మంగమ్మగారి మనమడు" షూటింగులో భానుమతిగారు, డైరెక్టరు కోడిరామకృష్ణని - "ఇదిగో నాయనా కోడీ! నేను షాటులో ఇక్కడ నిలబడితే సరిపోతుందా?" అని, "కోడీ, నా లుక్ కరెక్టా?" అని అడుగుతున్నారు. "మేడమ్! అదేంటి కోడీ కోడీ అని పిలుస్తున్నారు?" అని అడిగితే - "రామకృష్ణా అని ఎలా పిలవను? మా ఆయన పేరది. ఏకవచనంలో ఆ పేరు నేనెందుకు పిలుస్తానూ?" అన్నారామె.

కోడిరామకృష్ణగారు కూడా మంచి సెన్సాఫ్ హ్యూమరున్నవారు. ఆయన లెటర్‌హెడ్ ఎవరైనా చూసారో లేదో, పైన ఆయన పేరుండదు. కోడి బొమ్మ, బాణం, ఫ్లూటు బొమ్మలుంటాయి. కింద మాత్రం "మూవీ డైరెక్టర్" అని వుంటుంది. ఈ మాట భానుమతిగారితో చెప్తే "అమ్మ! బాగుందే!! గట్టివాడు." అని అభినందించారామె.

"తోడూనీడా" సినిమాలో నేను డాక్టరుని. భానుమతిగారిని ట్రీట్ చేస్తూ ఇంజెక్షన్ ఇవ్వాలి. ఆమె చెయ్యిపట్టుకుని ఇంజక్షన్ ఇస్తూవుంటే - "ఏమిటీ చెయ్యి వణుకుతోంది?" అని అడిగారు. ఏంలేదన్నాను. "భానుమతి చెయ్యి పట్టుకోవాలంటే ఎవరైనా వణుకుతారు" అన్నారామె మళ్లీ.



"అదేంకాదు మాడమ్ - దగ్గరగా ఫాను తిరుగుతోంది కదా, ఆ గాలి ఫోర్స్‌కి సిరంజ్ కదులుతున్నట్టుంది. ఫాన్ ఆపేయమంటారా?" అన్నాను. వద్దన్నారు. "నేనున్నాను కాదామ్మా పెద్ద ఫాన్‌ని" అన్నాను నేను. "మీరంతా గాలిరాని ఫాన్సు. నేను ఆ ఫానుకి ఫానుని" అన్నారు భానుమతి. దర్శకుడు ఆదుర్తిగారితో సహా అంతా నవ్వే.

"జీవన తరంగాలు" సినిమా విజయోత్సవం విజయవాడలో జరిగినప్పుడు భానుమతిగారు ముఖ్య అతిథి. ఉదయం ఉత్సవం జయప్రదంగా జరిగి పోతుంది. అయిన తర్వాత అందరూ లంచ్, అది బఫే. అందరం ప్లేట్లు పట్టుకుని వరసగా వెళ్తూవుంటే, మాడమ్ వెనకాలవున్న నేను, "మనుచుగాతా ఖుదా తోడై నిలచుగాతా నిరతమూ" ఆమెకి వినిపించేలా పాడాను. "మాడమ్ - మీ 'లైలా మజ్ను' సినిమాలోనిపాట. అందులో అందరూ ఇలాగే బొచ్చెలు పట్టుకుని పాడుతూ మీ దగ్గరకొస్తారు. మీరు వడ్డిస్తారు - నాకు గుర్తొచ్చి పాడాను" అన్నాను.

"అవును. ఇవాళ ఆ భానుమతే ప్లేటు పట్టుకుని వరసలో వెళ్తోంది. అయితే అది ముష్టి బీదవాళ్లు. ఇది హోటలు, ఘరానా! అందరూ ఉన్నవాళ్లే. ఈ ప్లేట్లో, వాళ్లేదో అన్నం కలగాపులగం చేసి పడేస్తారు. పట్టుకుపోయి ఓ మూల కూచుని ఈ 'కూడు' తింటాం. ఇదీ ఒక రకమైన ఘరానా ముష్టిలాంటిదే. నా ఉద్దేశంలో 'బువ్వ' అని మనం అనుకునే మాటే బఫే అయిందేమో!" అన్నారు భానుమతిగారు. పక్కనే ఉన్న జగ్గయ్యగారూ ఫకాలున నవ్వారు.

భానుమతికి గర్వం అనీ, అహంకారం అనీ అంటారు. "కాదు. వినయం, నమ్రతా వుండాలిగాని, అలా నటించడం నాకు చేతకాదు. నేను ఏదైనా ముఖం మీదనే అంటాను. వెనకాల అనడం నాకు చేతకాదు. దాన్నే అహంకారం అంటారా? అనండి" అంటారు ఆమె - "నాకేంపోయింది" అన్నట్టు.

ఒక విషయం గుర్తొస్తూ వుంటుంది - సినిమా అభిమాన సంఘంవారు అనుకుంటాను-ఒక సంవత్సరానికి ఆమెను ఉత్తమనటిగా ఎన్నుకుని, ఆ మాట ఆవిడకి చెప్పడానికి వెళ్తే "నేను వస్తానా రానా అని కాదుగాని, మీ టేస్టు గొప్పది. అందుకు మిమ్మల్ని నేను అభినందిస్తున్నాను" అన్నారుట. అదొక 'జోక్' లాగా కొందరు తీసుకుంటే, కించిదహంకారం అని కొందరు భావిస్తారు. "భానుమతి వ్యక్తిత్వం భానుమతిది. అదెందుకు మారాలి? మారితే భానుమతి భానుమతి కాదు. ఆమెలో మతి వుంది; ఆమెకు మతి వుంది." అంటారామె. ■

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 9

రాజకీయ నాయకులు ప్రజాశ్రేయస్సుకై కృషి చేయాలని నాకు గట్టి నమ్మకం. అధికారంలో ఉన్నవాడు బీదా, బిక్కీ గురించి ఆలోచించాలి. నేను నటించిన అన్ని చిత్రాలలో నాకు నచ్చిన చిత్రం 'శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న'. ఎందుకంటే ఈ సినిమా కథలో మర్యాదరామన్న అనే ఒక సామాన్యుడు రాజభవనానికి వెళ్ళి తన చిక్కు ప్రశ్నల ద్వారా రాజును మెప్పించి ఆరు నెలలు తాను రాజై పరిపాలిస్తాడు. సేనాధిపతి, మంత్రులు చేసే నీచమైన రాజకీయాన్ని అంతమొందించి రాజ్యంలో అవినీతిని తుడిచిపెట్టి పేదా, గొప్పా తేడా లేకుండా అందరికి సమానమైన హోదా కల్పిస్తాడు . రామరాజ్యాన్ని నెలకొలిపిన ఘనతను దక్కించుకుంటాడు. అవినీతిని రూపు మాపి సత్య పరిపాలన చేస్తాడు రామన్న. 400 సినిమాలలో నేను నటించింది ఒక ఎత్తు. ఈ సినిమా ఒక ఎత్తు. అందరూ మర్యాద రామన్నలైతే ప్రపంచంలో పేదరికం వుండదు. రామరాజ్యం అవుతుంది.

'శ్రీరామకథ' వీటూరి గారునాకు చెప్పారు. దర్శకత్వం వహించి చూడాలనిపించింది. అంతకుముందు ఎవరి వద్దా అసిస్టెంటుగా పనిచేయకపోయినా, అనేక సినిమాలలో నటించిన అనుభవం, పరిశీలనా స్వభావం ఉపకరించాయి.

'శ్రీరామకథ'లో హరనాథ్ విష్ణువు, రాముడు., ఆనాటి అందాలనటి, నేటి తమిళనాడు అధినేత్రి జయలలిత, భూదేవి పాత్ర వేసింది. మూడుసార్లు ఊర్వశి అవార్డు అందుకున్న శారదకి లక్ష్మీ వేషం. ఇంకా గుమ్మడి వెంకటేశ్వరరావు, అంజలి గారు హిట్ పెయిర్ శ్రీరేలంగి, సూర్యకాంతమ్మ, బాలకృష్ణ, ప్రభాకర్‌రెడ్డి, నేను నారదుడు, తుంబురుడుగా రామకృష్ణ రతిగా గీతాంజలి మన్మథుడుగా చంద్రమోహన్ వేశాం. రతీ మన్మథ డ్యాన్సు సన్నివేశం 'రాగమయం అనురాగ మయం ఈ జగమే సుందర ప్రేమాలయం' షూటింగు ప్రసాద్ స్టూడియో లో జరుగుతోంది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ఇంద్రుడు (ఈనాటి ప్రఖ్యాత కారెక్టరు నటుడు చలపతిరావుకు మొదటి చిత్రం) నవ గ్రహాలు, సకల దేవతలు, ఋషులు ప్రేమ స్వరూపులైన రతీ మన్మధులను పూజిస్తారు. రతీ మన్మధులను పూజించే ఆ దేవతలందరినీ అపహాస్యం చేస్తాడు నారదుడు. ఈ సన్నివేశం తీస్తున్నప్పుడు హిందీ హీరో దిలీప్‌కుమార్ వచ్చి చూశారు. "వైకుంఠం సెట్ బాగున్నది. హీరాలాల్ డాన్స్ కంపోజింగ్ బాగుంద'ని మెచ్చుకున్నారు. వైకుంఠం సెట్ ప్రసాద్‌లో వేశాం. ఆ షూటింగ్‌కు శ్రీ దిలీప్‌కుమార్ వచ్చి అందరినీ అభినందించి వెళ్లారు. రిలీజయ్యాక ఆశించినంత విజయం సాధించకపోయినా ఒక మంచి చిత్రమని పేరు పొందింది.

నా డైరక్షన్‌లో వచ్చిన రెండో చిత్రం, నాకు అవార్డు తెచ్చిపెట్టిన 'కథానాయిక మొల్ల' (1969) గురించి చెబుతాను. తెలుగుసాహిత్య చరిత్రలో కనబడే మొట్టమొదటి కవయిత్రి మొల్ల. ఆమె రామాయణాన్ని 6 కాండాల పద్యకావ్యంగా రచించి శ్రీరామచంద్రునికి అంకితం చేసింది. దానినే 'మొల్ల రామాయణం' అంటారు. ఆమె భర్త పేరుగాని, ఇంటిపేరు గాని తెలియదు. ఆమె తన తండ్రి ఆత్మకూరి కేసన అని చెప్పుకోవడం వల్ల ఆమె జన్మస్థలం, నెల్లూరు మండలం లోని ఆత్మకూరని అంటారు. ఆమె జీవించిన కాలం గురించి కూడా ఎన్నో సందేహాలు ఉన్నాయి. ఆమె



తన కవిత్వంలో పదినైదవ శతాబ్దిలో ఉన్న శ్రీనాథుని మాత్రమే పేర్కొంది కాబట్టి 16 వ శతాబ్దానికి చెందినదని అంటారు. కృష్ణదేవరాయల కాలం నాటిదని అంటారు.

ఇటువంటి విషయాలపై పరిశోధన చేసి, ఆమె చరిత్రను ప్రముఖ జర్నలిస్టు ఇంటూరి వెంకటేశ్వరరావు గారు "కుమ్మరి మొల్ల" నవల అనే పేరుతో గ్రంథస్థం చేశారు. అది జనాదరణ పొందిన నవలగా పేరు పొందింది. సినిమా తీయడానికి దీని రైట్సు ఎల్.వి.ప్రసాద్‌గారు తీసుకున్నారు. పండితవంశంలో పుట్టకపోయినా ఆమె 'మొల్ల రామాయణం' వ్రాయగలిగింది. పండిత పామరులను మెప్పించ గలిగింది. మనకున్న రచయిత్రులు తక్కువ. వారిలో మొల్ల

**ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యాన్ని గాయకుడుగా పరిచయం చేసినది 'శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న' చిత్రం.బాలసుబ్రహ్మణ్యం రేఖా మురళి ఆర్టులో నెలకు 250/- జీతానికి కుదిరాడు. పాట నేర్చుకొని, వచ్చిన ఆర్టిస్టులకు పాట నేర్పడం అతని పని. ఘంటసాల గారి తల్లికి సుస్తీగా వుండడంతో ఆయన ఊరు వెళ్ళారు. మర్యాద రామన్న పాట రికార్డింగు విజయా గార్డెన్స్‌లో చేస్తున్నాం. ఘంటసాల గారికి ట్రాక్ బాలసుబ్రహ్మణ్యం చేత పాడించారు కోదండపాణి. నలుగురు హీరోలు శోభన్‌బాబు, హరనాథ్, రామకృష్ణ, కృష్ణ-శోభన్‌బాబులకు ఎస్.పి.బాలసుబ్రమణ్యం పాడారు. గొంతు అద్భుతంగా ఉంది. పాట ఓకే చేశాం. అదే ఉంచేశాం. సంగీతాకాశంలో ఒక తార వెలిసింది. ఈ పాటతో ఎస్.పి. దశ తిరిగింది. గాయకుడిగా, సంగీతదర్శకుడిగా, నటుడిగా పలుభాషలలో, అనేక అవకాశాలతో ప్రపంచ ఖ్యాతి గాంచాడు.**

'శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న' చిత్రం వెలువడిన నాటి ముచ్చట. ఆనాటి అసెంబ్లీలో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారు, జలగం వెంగళరావు గారు, నీలం సంజీవరెడ్డి గారు 'మనం ప్రతి చిన్న విషయానికి కొట్టుకుంటున్నాము. పేదరికం , అవినీతిని అరికట్టలేక పోతున్నాం. ఒకసారి మర్యాదరామన్న సినిమా చూస్తే మనం రాజ్యాంగాన్ని ఏ విధంగా నడపాలన్నది తెలుస్తుంది' అని చమత్కరించారు.

నటుడిగా, నిర్మాతగా మారిన నేను దర్శకుడిగా మారాను కూడా - 'శ్రీ రామ కథ'తో! అదే నేను ప్రప్రథమంగా దర్శకత్వం వహించిన సినిమా! దేవత, పొట్టి ప్లీడరు, శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్నకు దర్శకుడు మిత్రులు కె.హేమాంబరధరరావు గారు. అంత వరకు (1968) నాకు దర్శకత్వం వహించాలని అభిప్రాయం లేదు.

తాతినేని ప్రకాశరావుగారి 'చరణదాసి' షూటింగ్ సమయంలో సరదాగా వెళ్లి క్లాప్ కొట్టేవాణ్ణి. దర్శకత్వంలో నాకు స్ఫూర్తి శ్రీ గూడవల్లి రామబ్రహ్మం, శ్రీ ఎల్.వి.ప్రసాద్, శ్రీ కె.వి.రెడ్డి, శ్రీ బి.ఎన్.రెడ్డి గార్లు. ఇంకా అనేక దర్శక మహనీయుల దగ్గర నటించినవాణ్ణి. ముఖ్యంగా 'పాతాళభైరవి' శ్రీ కె.వి.రెడ్డి గారి స్క్రిప్ట్, డిసిప్లిన్ రామారావు గారిని, నన్ను ఎంతో ఆకర్షించాయి.



పేరు తప్పకుండా చెప్పి తీరాలి. వెనుకబడిన జాతికి చెందిన మహిళ గురించి సినిమా తీయాలంటే ధైర్యం కావాలి. ఇందులో కథా నాయకుడు లేడు. పైగా చారిత్రాత్మక నేపథ్యం గల కథ కాబట్టి, జానపదాల్లా స్వేచ్ఛ తీసుకుని పాత్రలు సృష్టించడానికి వీలులేదు. చరిత్రను రసవత్తరంగా చెప్పాలి, అదే సమయంలో (మా తాతగారు సుబ్బయ్య గారు మాకు బాల్యంలో చెప్పేవారు.) కొన్ని చొప్పించాము.

అలా పెట్టిన వాటిల్లోదే ఓ నర్తకి కథ. ఆమె శ్రీకృష్ణ దేవరాయలు ఆస్థానంలోకి వచ్చి 5 భాషలలో అంటే తెలుగు, తమిళం, కన్నడ, మహారాష్ట్ర, హిందీలలో పాడుతుంది. ఆమె మాతృభాష ఏది అని ప్రశ్న? అష్టదిగ్గజాలు నాగభూషణం, అల్లు రామలింగయ్య, రామచంద్రరావు, మిక్కిలినేని వంటి వూరిపెద్దలు మొల్లకు తిక్కన్నతో ( రాజబాబు తిక్కనగా వేశాడు) వివాహం తలపెడతారు పెద్దలు. దేవుణ్ణి పెళ్ళి చేసుకుంటానని అడవులకు పోయి దేవుణ్ణి సాక్షాత్కారం పొంది వివాహం చేసుకొని వస్తుంది. అంతా నవ్వుతారు.

తెనాలి రామలింగడు ఆమె కవిత్వాన్ని మెచ్చుకొని రామాయణం రాయమంటారు. 5 రోజులలో రామాయణం రాసి శ్రీకృష్ణ దేవరాయలు వారి మెప్పును పొంది, శ్రీరామునిలో ఐక్యం అవుతుంది.

ముందుగా జమున గారిని మొల్ల క్యారెక్టర్‌కు అడిగాం. ఆమె అప్పుడు గర్భవతిగా ఉండడం వల్ల వాణిశ్రీని తీసుకున్నాము. గుమ్మడి, నాగభూషణం, అల్లురామలింగయ్య, రాజబాబు, ప్రభాకర్ రెడ్డి, సత్యనారాయణ, బాలకృష్ణ, గీతాంజలి, హేమలత, మిక్కిలినేని, కోళ్ళ సత్యం, రామచంద్రరావు వగైరాలు తక్కిన పాత్రధారులు.

'కథానాయిక మొల్ల' సినిమాకు .
సి.నారాయణరెడ్డి చక్కటి పాటలు వ్రాశారు.

రఘుకులతిలకా! నీ ఆనతి
రచియించితి రామాయణ సత్కృతి-ఆ
కృతి వరియించిన పతివి నీవే
అతులిత కైవల్య గతివి నీవే'

జగమే రామామయం-మనసే
అగణిత తారక నామమయం.

నీల జలద రమణీయరూపం,
నిగమాంచలమందిర మణిదీపం,
సుందర జానకీ వందిత చరణం
సురమునిశరణం! భారతాపహరణం!
॥జగమే॥

ఆ చిరునవ్వే-అమృతపుజల్లు
అఖిలజగములేలు-ఆ చేతి విల్లు
అతని గానమున-అలరారు కావ్యం
అన్ని యుగాలకు-నవ్యాతినవ్యం.... ॥జగమే॥

ఎవని కమలకమనీయపదము-చూ
పించె అహల్యకు ముక్తిపదము
ఎవని చంద్రికామృదులకరము-అం
దించెను శబరికి దివ్యవరము
ఎవని ఏలుబడి-ఇంటికొక్క గుడి నిలిచెనో
ఎవని రాజ్యమే-రామరాజ్యమై వెలిసెనో,
ఆ రాముడు నా అంతరంగమున నిండగా.
అహము మరచి ఈ-యిహము మరచి
జన్మాంతరబంధములెల్ల విడిచి

ఆ మహోర్జ్యోతిలో లీనముకానా
ఆ మహా ప్రభునిలో లీనముకానా
ఓరామా! రఘురామా! కైవల్య ధామా!





'శ్రీరామకథ' లో శ్రీరాముడు, శ్రీమహా విష్ణువు పాత్రకు హరనాథ్‌ను ఎంచుకున్నాం. అది డిస్ట్రిబ్యూటర్స్‌కు నచ్చలేదు. "రాముడి వేషం అంటే పవిత్రంగా కనబడాలి. ఈయన తాగుబోతు, ఆ వేషానికి అతను పనికిరాడు. వేరే ఎవరినైనా చూడండి" అన్నారు. "ఏవో పత్రికలు దుమారం చెలరేపినంత మాత్రాన మనం అతన్ని తీసివేయకూడదు. అతను మంచి నటుడు'. అని వాదించి వారిని ఒప్పించాను. తర్వాత కొన్నేళ్లకు హిందీలో హిట్ అయిన 'కాజల్' సినిమాను తెలుగులో 'మా ఇంటి దేవత' గా హరనాథ్ పునర్నిర్మించాడు. హిందీలో ధర్మేంద్ర ఒకహీరో. తాగుబోతుగా నటించిన రాజ్‌కుమార్ పారలెల్ హీరో. నిర్మాత అయిన హరనాథ్ ధర్మేంద్ర పాత్ర కృష్ణకిచ్చి రాజ్‌కుమార్ పాత్ర తాను ధరించేడు. నేనా చిత్రానికి దర్శకత్వం వహించాను.

కమ్మర్షియల్ ఎలిమెంట్స్ కోసం వాస్తవాలను వక్రీకరించకూడదు. ఇలాటి సబ్జక్ట్‌తో సినిమా తీయడానికి చాలా ధైర్యం కావాలి. దీనికిముందు తీసిన సినిమా ఆర్థికంగా విజయం కాకపోయినా, సాహసం చేయడానికే నిశ్చయించుకున్నాం.

ఇంటూరి గారిని కలిసి కథకు రైట్స్ మాకు కావాలంటే ఆయన ప్రసాద్ గారి పర్మిషన్ తీసుకొని నాకు ఇచ్చారు. శ్రీ వెంకటేశ్వరరావు గారు, బి.ఎల్.ఎన్.ఆచారి, అప్పలాచారి, ఆదుర్తి నరసింహమూర్తి, నేను కలిసి స్క్రీన్‌ప్లే రాశాం. మొల్ల తెనాలి రామలింగడికి సమకాలికురాలు కాబట్టి, ఇందులో తెనాలి రామలింగడి కథలు కూడా చెప్పలేకపోతారు. సామ్రాజ్యానికి పరువు పోయే పరిస్థితి!

తెనాలి రామలింగడు లేస్తాడు. దగ్గరకు వెళ్లినట్టే వెళ్లి , హఠాత్తుగా గట్టిగా ఆమె కాలు తొక్కుతాడు. వెంటనే ఆ నర్తకి బాధలో ఒళ్లు మరిచిపోయి, తమిళంలో 'అడే పావి, కాలు మెరచిటి ఏడా' అని అరుస్తుంది. సాధారణంగా బాధను వ్యక్తపరచేటప్పుడు మనం మాతృభాషను ఉపయోగిస్తాం కాబట్టి ఆమెను తమిళ స్త్రీగా గుర్తిస్తాడు రామలింగడు. ఔనని ఒప్పుకుంటుందామె. తెనాలి రామలింగడుగా నేను వేశాను. ఇందులో తెనాలి రామలింగడి (నా పాత్ర ద్వారా) ద్వారా, పెద్దనమాత్యుల ద్వారా ఎంతో హాస్యం పుట్టింది. గెస్టుగా హరనాథ్ నటించారు.

ఈ సినిమాకు ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు 1970 బంగారు నంది అవార్డును ప్రకటించింది. అవార్డు వచ్చిన శుభవార్త నాకు అంజలీదేవి గారు ఫోన్ చేసి చెప్పారు. మాది బసవరాజు వంశం. ఆ బసవేశ్వరుడే బంగారు నంది రూపంలో మా ఇంటికి వచ్చాడనుకున్నాను. రవీంద్రభారతిలో శ్రీ జలగం వెంగళరావు గారి చేతులమీదుగా బెస్ట్ డైరెక్టర్ గా నేను, బెస్ట్ ప్రొడ్యూసర్‌గా పురుషోత్తం అవార్డులను అందుకున్నాము.

(ఇంకా ఉంది)



# మేరీ జాన్ మేరీ జాన్... ...అండే కీ అండే..

- కండ్లకుంట శరత్‌చంద్ర

డి.ఎస్సీ 'తెలుగు' పండిట్‌ల పరీక్షకు... మా జిల్లా నుండి... ఈ ఏడు... ఇంచుమించు ఓ వెయ్యిమంది క్యాండిడేట్లు హాజరయ్యుంటారు. ఉన్న పోస్టులేమో అష్టదిగ్గజాల కోసమన్నట్లుగా... ఎనిమిదే! మరి... అందులోని ఓ పోస్టును... నేనే భర్తీ చెయ్యగలగడం... అదృష్టం కాక మరేమిటి?! అనుకుంటూ కొలువు నిర్వర్తించవలసిన ఊరు... రామాపురం అనీ... ఒక కుగ్రామం ఉందిలెండి. సరాసరి అక్కడికెళ్ళి, ఉద్యోగంలో చేరాను.

... ఇప్పుడు గూడు వెతుక్కోవాలి.

'గూడు' గురించి మా పాఠశాలలోని మిగతా ఉపాధ్యాయులను వాకబు చేయగా..... ఆ ఊళ్ళో... ఒకే ఒక ఇంట్లో... ఒకే ఒక గది ఖాళీగా ఉందన్నారు. కాకపోతే... అక్కడ ఒకానొక చిక్కుందన్నారు. ఆ చిక్కు వల్ల... మానవమాత్రుడెవడూ ఆ ఇంటిని భరించలేడ!

'ఇల్లంటే... ఇటుకలు కాదోయ్! ఇల్లంటే... ఇంట్లోని మనుషులోయ్!'

అదన్నమాట సంగతి.

"నేను వెళ్ళి, ఇల్లు అద్దెకిమ్మని అడుగుతాను" అన్నాన్నేను.

"వద్దయ్యా బాబూ...! వాళ్ల చాదస్తానికి తట్టుకోలేవు. నీకు, నూరు కాలాల పాటూ... ఈ పృథ్వి మీద సంచరించాలనే ఆశ లేదా!" అన్నాడు సీనియర్ తెలుగు పండిట్.

"ఎందుకు లేదూ...! భేషుగ్గా వుంది. మేమూ ఆచారవంతులమే! ఇంటి సభ్యులకు ఝడిసి, ఇల్లడగడం మానుకుంటామటండీ.... మీ పిచ్చిగాకపోతే! నేను వెళ్ళి తీరతాను. నాకు సాయంగా మీరెవరైనా వస్తారా?!" అన్నాను.

"హవ్వో్మ...! పిల్లలు గలవాడ్ని...! పిచ్చెక్కించుకోవడం.... నాకేమైనా సరదానా...! ఛస్తే రాను!" అన్నాడు సీనియర్ తెలుగు పండిట్.

"బిన్‌లాడెన్‌ను పట్టుకుంటే... చూడాలనుంది. ఇప్పుడే... నేను పిచ్చోడినైతే... ఆ అవకాశం రాదు." అన్నాడు సోషల్ మేష్టారూ.

"నాకింకా... బోల్డన్ని తెలుగు సినిమాలు చూడాలనుంది. ఇప్పుడే... నేను చచ్చిపోతే... అవన్నీ చూసేదెవరు?" అన్నాడు లెక్కల మాస్టరు.

"హాసం పత్రిక స్వర్ణోత్సవాలు చూసాక గానీ... నేను చావను. ఇప్పుడే నేను పిచ్చోడ్ని అయితే... హాసం పత్రికకు ఓ పాఠకుడు తగ్గిపోడూ! ఛస్తే... రాను" అన్నాడు సైన్సు మేష్టరు. వెళ్ళవలసిన ఇంటి గుర్తులు కనుగొని బయల్దేరాను. ఓ పావుగంట నడిచాక, ఇల్లు చేరుకున్నాను.

ఇల్లు, ఇంటివాళ్లలాగానే ... పాత కాలంది! వృద్ధాప్యంలో వుండవలసిన సమస్త రోగాలూ ఆ ఇంటికున్నాయి. నెమ్మదిగా గేటు తెరుచుకుని లోపలికి వెళ్ళాను.

పల్లెటూరు కదా...! ఇంటి తలుపు తెరిచేవుంది.

"ఎవరండీ లోపల...!" అన్నాను గట్టిగా.

ప్రతిచర్య జరగలేదు.

"అమ్మా...! తల్లీ...! ఎవరైనా వున్నారా లోపల!" ఈసారి మరింత గట్టిగా కేకేసాను.

"వెధవ! ఎన్నిసార్లు చెప్పాలిరా...! ఇంకా ఆరగింపే కాలేదు. అప్పుడే తయారయ్యావు! వెళ్ళు...!" లోపలి నుండి ఓ ముసలి ఆడకంఠం కసిరింది.

"ఎవరొచ్చారే...!" అంది ఓ ముసలి మగకంఠం.

"ఆఁ.... ముష్టెంకడు. వాడికి వేళాపాళా లేదు. మీరు తిరుమంజనం కానివ్వండి" అంది, ఆడకంఠం.

ఇక లాభం లేదనుకుని, తలుపు గొళ్ళాన్ని పైకి లాగి, వదిలేసాను. 'ఫట్!' శబ్దం వచ్చింది. ఆ శబ్దానికి, ఇల్లుగలాయన ఇవతలికి వచ్చాడు.

మనిషి ఎర్రగా దబ్బపండులా ఉన్నాడు. అతడ్ని గిల్లితే... వొంట్లోంచి నెయ్యి మాత్రమే కారుతుంది. నిట్ట నిలువుగా నామాలు దట్టించి,

కాషాయ రంగులో ఉన్న మడిపంచె, బంగారు రంగులో ఉన్న ఉత్తరీయం ధరించి ఉన్నాడు.

తలకాయ బోర్లించిన ఇత్తడి గిన్నెలా వుంది. బుర్రలో గుజ్జుందో లేదో తెలీదు గానీ... తలపై మాత్రం... కేశాలు లేవు. వెంకటేశ్వరుని భక్తుడనుకుంటాను. అందుకే కాబోలు... వెంకటేశ్వరుడు, "ఎన్నిసార్లు గుండు కొట్టించుకుంటావు,ఇక చాల్లే...!" అనేసి శాశ్వత గుండు ప్రసాదించినట్లున్నాడు.

బట్టతలను నిమురుకుంటూ, మంత్రాలు పఠిస్తూ, నా దగ్గరికి వచ్చి ఏమిటన్నట్లు కనుబొమ్మలు ఎగరేసాడు.

"అయ్యా...! మరేమో... అద్దె కోసం వచ్చానండీ" అన్నాను.

' ఏ అద్దెనాయనా...! దేనికి అద్దె ఇవ్వాలి?" అన్నాడాయన తెల్లబోతూ.

"ఛ!ఛ! నామతిమండ...! అద్దె కోసం కాదండీ...! అద్దె ఇంటికోసం వచ్చాను. మీ పై పోర్షన్‌లో గది ఖాళీగా ఉందటగా!" అన్నాను.

అతడు, నా కాలివేళ్ళనుండీ తలదాకా... ఏడుసార్లు ఎగాదిగా చూసాడు.

"అన్నట్లు మీరు... వైష్ణవులేనా?"

"చిత్తం! శ్రీ వైష్ణవులం"

"ఏదీ... ఓసారి ప్రవరచెప్పు"

"ఇదేమిట్రా నాయానా! ఇల్లిమ్మంటే... ప్రవర చదవమంటాడు."మనసులో అనుకున్నాను.

"ఊ! చదువు" అన్నాడు.

'తప్పుతుందా! చాదస్తపు పిండమనుకుంటాను... ఈయన వాలకం చూస్తుంటే...! అనుకుని గడగడా చదివి, నమస్కారం పెట్టాను.

"సరే, మీరేం చేస్తుంటారు?" అడిగాడు

"బతకగలిగి... బడిపంతులు ఉద్యోగం చేస్తున్నాను"

"భేష్! ఈ ఇంట్లో వుండాలనుకుంటే... కొన్ని నియమాలుంటాయి" అన్నాడు.

"నియమ నిబంధనలా...! నాకు తెలుసునులెండి! గోడలకు మేకులు కొట్టొద్దు! రాత్రిళ్ళు సెకండ్‌షోలకు వెళ్ళొద్దు. కరెంటు ఎక్కువగా కాల్చొద్దు...! ఇంతేగా.. ఇవన్నిటికీ సరే!" అన్నాను.

అతడు, చిద్విలాసంగా నవ్వి, "ఇవి నాకవసరం లేదు. మేకులు కొట్టడానికి నీకసలు స్థలమే ఉండదు. ఇల్లంతా మేకులమయం! అయినా... ముచ్చటపడికొట్టాలనుకుంటే... కొట్టుకో! మాకేమీ అభ్యంతరం లేదు. మేమేమీ అనం! ఇల్లు పాతది కదా. సుత్తి దెబ్బలకు నీ గది కూలిపోవచ్చు. ఇక

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**




**ఉత్తరాలు రాయడానికి పనికిరాని కార్డు?**

**రికార్డు**

సెకండ్‌షోలంటావా... ఈ ఊళ్ళో సినిమా థియేటర్ లేదు. ఇక కరెంటు సంగతి! నీ ఇష్టమొచ్చినట్లు వాడుకో...! ఎందుకంటే... ఈ ఊళ్ళో... అందరిళ్ళలోనూ దొంగ కరెంటే" అన్నాడు.

"మరి మీ నిబంధనలు వేటిగురించి...?"

"వస్తున్నా... వస్తున్నా... అక్కడికే వస్తున్నా! ప్రతిరోజూ ఉదయం బ్రహ్మ ముహూర్తంలో లేవాలి. అంటే... నాలుగు గంటలకన్నమాట. ఆ తర్వాత స్నానం చేసి, సంధ్యా వందనం చేసుకుని... నాతోపాటూ... విష్ణు సహస్రనామపారాయణ చెయ్యాలి. ప్రతి శనివారం... సాయంత్రం... వెంకటేశ్వరస్వామి సహస్ర నామావళి, గీతా పారాయణం చేయాలి. మా మనుమడు, మీ బడిలోనే ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు. వాడికి ఫ్రీగా ట్యూషన్ చెప్పాలి. ఇక చిట్టచివరి నిబంధన! లాస్ట్ బట్ నాట్ లీస్ట్...! ఈ ఇంటి ఆవరణలోకి ఉల్లిపాయ, కోడిగుడ్డు, మాంసం లాంటివేవీ... తీసుకురావొద్దు. ఈ మధ్య కొందరు బ్రాహ్మణులు... తమోగుణప్రధానమైన ఆహారాన్ని స్వీకరిస్తున్నారు. నువ్వు అలాంటి కోవలో వుంటే... తక్షణమే... సాత్వికాహారిగా మారిపో!

ఇంటి ఆవరణలో... నేను చెప్పిన ఆ మూడు నిషేధ పదార్థాలలో ఏది అగుపించినా సరే... నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా... నీ పెట్టేబేడా... వీధిలో నాట్యం చేస్తాయి. అందుకిష్టమయితేనే చేరు. అద్దె నూరు రూపాయలు! " అన్నాడు.

"అద్దె.... నూరు రూపాయలు!" ఆహా ఎంత ప్రియంగా వుంది... ఈ వాక్యం! "అయితే రేపే వచ్చి చేరతాను!" అన్నాను.

"శుభం!" అన్నాడాయన.

* * *

ఆ రోజు సాయంత్రం వాహ్యాళికి వెళ్ళి, ఇంటికొచ్చేనరికి, గేటువద్ద ఇంటాయన ఉగ్రనరసింహావతారంలో నిలబడున్నాడు. ఆయన ముక్కుపుటాలు కోపంతో అదురుతున్నాయి. కళ్ళు... ఎర్రచందనంతో నింపిన చందంగా... ఎర్రబడుతున్నాయి. పళ్ళు పటపట కొరుక్కోసాగాడు.



"ఉన్నవే నాలుగు పళ్ళు! అవి కూడా పోతే... కారప్పూస, జంతికలు లాంటివి తినే భాగ్యాన్ని కోల్పోతాడు.

"ఏమిటండీ అలావున్నారు? మీ మనవడేమైనా అల్లరి చేసాడా?!" అన్నాను.

"నోర్మూయ్! మా పిల్లాడు అల్లరి చేస్తే... నాలుగు బాది వదులుతాం. తప్పు నీ వల్లే జరిగింది" అన్నాడు.

"హేమిటి...! నా వల్లా...! నేనేం చేసానండీ...!" అన్నాను. గదిలో చేరి కొద్ది రోజులే అయింది. తెల్లవారిఝామున లేవడం విషయంలో కాస్త అటూ, ఇటూ అయినా మొత్తం మీద వారి నిబంధనలకు తగినట్లుగానే నడుచుకుంటున్నాను. వాళ్ల మనుమడికి పాఠాలు చెప్పడానికి నా దుంప తెగుతున్నా నోరెత్తకుండా భరిస్తున్నాను.

"హమ్మా...! వామ్మో...! ఎంతటి అమాయకత్వం నటిస్తున్నావ్. చేసిందంతా చేసి... ..!" అన్నాడు.

"అయ్యో... తెలిసి నేనే తప్పు చేయలేదండీ. తెలియక ఏమైనా చేసింటే... చెప్పండి సరిదిద్దుకుంటాను" అన్నాను.

"నేను పెట్టిన నిబంధనను అతిక్రమించావు. ఇంట్లోకి ఉల్లిగడ్డలు తెచ్చుకున్నావు. ఔనా!" అన్నాడు గద్దిస్తూ...

"హవ్వ...! నేనా...! ఉల్లిగడ్డా..! తెచ్చానా...! ఎవరో నేనంటే గిట్టని వాళ్ళు నాపై తప్పుడు ప్రచారం చేశారు. అధ్యక్షా...! దీన్ని నేను తీవ్రంగా ఖండిస్తున్నాను" అన్నాను.

"ఏమిటి ఖండించేది... ఉల్లిగడ్డా!" అన్నాడు.

"హయ్యో...! నా మాట వినండి. అలాంటిదేం లేదు" అన్నాను.

రెండుసార్లు ముక్కు ఎగజీది, "అదిగో... నీ గదిలో నుండి వచ్చే వాసన ఏమిటి?" అన్నాడు.

"వదండి. కావాలంటే... ఇల్లంతా వెతుక్కోండి!" అనేసి, గబగబా మెట్లెక్కి తలుపు తెరిచాను.

తెరవగానే.. లోపల ఉల్లిపాయలుంటే... నేనెక్కడ దాచేస్తానోనని, గబగబా ఇంట్లోనికి దూరాడాయన. అటూ, ఇటూ చూసి నా మంచం మీదున్న రెండు ఉల్లిగడ్డలను, నేల మీద పడి వున్న మరో ఉల్లిగడ్డను చూపించాడు.

నేను కళ్ళు నులుముకుని మరీ చూసాను.

కళ్ళు నులుముకుంటే... సత్యం అసత్యమవుతుందా! అవి ఉల్లిగడ్డలే.

"ఇవి నా గదిలోనికి ఎలా వచ్చాయి!" అన్నాను.

"ఎలా వస్తాయి. కొనుక్కొస్తే వస్తాయి." అన్నాడు మండిపడుతూ. "లేకపోతే ఆకాశం నుండి రాలడానికి ఇవేమైనా వడగళ్లా?" అంటూ

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



తినడానికి రుచిగా ఉండని ద్రాక్షలు?

రుద్రాక్షలు

నా పెట్టె తీసుకుని మెట్లు వైపుకు నడిచాడు.

"నేను కొనలేదండీ..ఒకవేళ ఆకాశం నుండి రాలితే ఆ వార్త రేపు పేపరులో 'నమ్ము, నమ్మకపో' శీర్షికలలో వస్తుందేమో.. రేపటిదాకా చూసి..." అని అనునయించబోయాను.

"ఎకసెక్కాలాడకు. ఆకాశం నుండి ఉల్లిపాయలు ఎగిరొస్తాయా?" అని ఆయన అంటూండగానే .. "ఛటుక్కు...." మంటూ ఓ ఉల్లి గడ్డ కిటికీలోంచి వచ్చి ఆయన బట్టతల మీద స్టెప్పయ్యి... ఓ వందగజాలు పైకెగిరి.... పక్కకు పడింది.

ఆయన కెవ్వున అరిచి, ఆ పెట్టెను వదిలేసి, బట్టతలను కసాబిసా రుద్దుకుంటూ "ఇదెక్కడ్నించొచ్చింది?!" అన్నాడు.

"సదరు ఆకాశం నుండే.." అంటూ మా గది కిటికీ దగ్గరికి వెళ్ళి అవతలికి తొంగిచూసా. నా వెనుకనే ఆయనా!

మా ఇంటిని ఆనుకుని, ఓ చిన్న ప్లేగ్రౌండ్ వుంది. అక్కడ, కొందరు పిల్లకాయలు, ఉల్లిగడ్డలను బంతులలా ఉపయోగిస్తూ క్రికెట్ ఆడుతున్నారు. ఓ పిల్లాడి చేతిలో ఉల్లిగడ్డల బుట్టవుంది.

ఇంటాయనకు జ్ఞానోదయం అయింది. "రేయ్...! ఉల్లి గడ్డలతో ఆటలేంట్రా అప్రాచ్యపు వెధవల్లారా!!" అరిచాడు ఇంటాయన తల తడుముకుంటూ.

"ఆఁ.....!బంతికొనుక్కోవడానికి నాన్న డబ్బులివ్వలేదు. అమ్మ నడిగితే నాన్న మీద కోపం కొద్దీ దీంతో ఆడుకోమని ఉల్లిగడ్డల బుట్ట ఇచ్చింది. పోనీ మీరు బంతి కొనడానికి డబ్బులిస్తారా, తాతయ్యా" అడిగాడు ఓ పిల్లాడు.

ఇంటాయన సమాధానం ఇవ్వలేదు. రుసరుసలాడుతూ మెట్లు దిగి వెళ్లిపోయాడు.

* * *

ఇంకో పదిరోజుల తర్వాత - నేను స్కూల్ నుండి ఇంటికి వచ్చాను. ఇల్లంతా ఊడ్చి, చెత్త తీసుకెళ్ళి, బాల్కనీలో ఉన్న నా చెత్త బుట్టలో వేసొచ్చి, "కొద్ది క్షణాలలో ప్రళయం!" అనే పుస్తకం చదువుతూ కూర్చున్నాను.

ఆ 'కొద్దిక్షణాలు' గడిచాయి.

ఇంటాయన విసురుగా లోపలికి



దూసుకొచ్చాడు.

నా చేతిలోని పుస్తకాన్ని లాగి, గోడకేసి విసిరాడు.

"ఏమైందండీ...!?!" అంటూ లేచి నిలబడ్డాను.

"ఏమైందా...! నా పిండాకూడదయ్యింది! బుద్ధిగలవాడివని నమ్మి ఇల్లిస్తే... ఇదటయ్యా నువ్వు చేసే నిర్వాకం! హవ్వ! హవ్వ...!" అన్నాడు.

మళ్ళీ "ఏమైందండీ...!?!" అన్నాను.

"ఏమవుతుంది...! నీ పెళ్ళి... నా(శ్రాద్ధం! ఇంట్లోనికి కోడిగుడ్ల తేవడం మర్యాదైన పనేనా... అంట! నేను చెప్పిందేమిటి... నువ్వు చేసిందేమిటి...!" అన్నాడు.

"నేనా...! కోడిగుడ్డా...! తెచ్చానా...! ఎప్పుడూ?" అన్నాను.

"అఁ...! అఁ...! అదే వద్దనేది. అమాయకపు ఫేసు పెడితే... నిజం కాస్తా అబద్ధమవుతుందా!"

"పక్కింటి కుర్రాళ్లు.."అనబోయాను.

"కోడిగుడ్లతో ఎవరూ క్రికెట్టు ఆడరు. ఆ సంగతి కనుక్కునే వచ్చా... చెప్పు... నీ చెత్తబుట్టలోనికి కోడిగుడ్ల డొల్లి ఎలా వచ్చింది" అన్నాడు.

"ఏమిటండీ... పెద్ద వారయి వుండి అబద్ధాలాడతారు. కొన్ని నిమిషాల ముందే, నేను ఇల్లూడ్చి, చెత్త తీసుకెళ్ళి బుట్టలో వేశాను. బుట్టలో దుమ్ము తప్ప మరేం లేదు." అన్నాను.

"అయితే పద! చూద్దాం గానీ...!" అన్నాడు.

ఉత్తరం వైపున్న బాల్కనీలోనికి ఇద్దరం నడిచాం.

నేను చెత్త బుట్టలోనికి తొంగిచూసాను.

ఆశ్చర్యం...! మహదాశ్చర్యం.....!!

ఆ చెత్తబుట్టలో, ఓ పరమ చెత్త కాగితంలో... కోడిగుడ్ల డొల్లు అగుపిస్తోంది.

"ఇది... ఎలా... వ..చ్చిం...ది!" అన్నాను.

"ఎలా వస్తుంది? ప్రశ్న బ్రహ్మాండంగా ఉంది.. అండాలను భక్షించే నిమిత్తమై... తమరే తెచ్చుంటారు." అంటూ హాల్లోనికి పరుగెత్తి నా పెట్టె తీసుకుని, బాల్కనీలోనికి వచ్చాడు.

"బాబోయ్...! వద్దు...! నా పెట్టె విసిరేయొద్దు! నాకూ... ఆ గుడ్లకూ ఏం సంబంధం లేదు" అన్నాను ఏడుపుమొహంతో.

"..ఇకపై ఈ గదికీ.. నీకూ..కూడా ఏ సంబంధమూ లేదు. మర్యాదగా... అద్దులే! దీన్ని విస్సిరేస్తే గానీ... నా మనసు శాంతించదు" అన్నాడు రంకేస్తూ.

పరువుకోసం, పెట్టెకోసం, నేను ఆయనతో పెనగులాడుతూండగానే మా పక్కింటి పెరట్లో నుంచి ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి.

"అక్కయ్యా! కోడిగుడ్ల డొల్లను పొట్లంలో కట్టి విసిరేయమన్నావు గదా! నేను స్టైల్‌గా విసిరేసాను. అది కాస్తా, పక్కింటోళ్ళ బాల్కనీలోనికి దూసుకెళ్ళింది. ఇప్పుడెలా!" అంటున్నాడో కుర్రకుంక.

"అయ్యో! ఎంత పని చేసావురా... ఆ ఇంట్లో వుండే బాపనయ్యకు తెలిస్తే... అమ్మో... ఇంకేమైనా వుందా! కొంప మునుగుద్ది!" అని ఖంగారుపడుతోంది ఓ అమ్మాయి కంఠం.

"వెధవ పొరుగు.." అంటూ పెట్టె నా గదిలోకి విసిరేసి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు ఆచార్యులు గారు.

*****

వారం రోజుల తర్వాత ఉదయం ఏడింటికి గుడికి వెళ్ళి, ఓ గంట అక్కడ గడిపి, ఇంటికొచ్చాను. మా ఇంటాయన నావైపు మిర్రి మిర్రి చూస్తూ వాకిట్లో నిలబడున్నాడు. ఆయన వైపు చూసీ చూడనట్లుగా మెట్లవైపు నడిచాను.

"ఆగు!" అన్నాడు గట్టిగా.

నేను ఆగాను. "ఏకంగా... కోడినే ఇంటికి తేవడంలో... నీ ఉద్దేశ్యమేమిటి? ఆ అమాయిక ప్రాణిని కోసుకుని వండుకు తినాలనుకున్నావు కాబోలు!" అన్నాడు.

"మీరేం చెప్తున్నారో నాకు అర్థం కావడం లేదు" అన్నాను.

"అర్థం కాకపోవడానికి ఇదేమైనా సంస్కృతమా? చెప్పు... మా కన్ను గప్పి కోడిని ఇంటికెప్పుడు తెచ్చావు" అన్నాడు గాండ్రిస్తూ...

"నేనా...! కోడినా...! తెచ్చానా...! ఎప్పుడూ...!" అన్నాను.

"క్కొక్కొ... క్కొక్కొక్కొ... క్కొక్కొక్కొక్కొ...." నా గదిలో నుండి కుక్కుటేశ్వరుని పిలుపు వినిపిస్తుంది.

నేను గబగబా వెళ్ళి తాళం తీసాను.

కోడి, ఇవతలికి పరుగెత్తుకొచ్చింది.

"చెప్పు! ఏమిటి నీ సమాధానం! ఆ కోడిని ఏం చేద్దామని తెచ్చావు. అనేసి, గబగబా లోపలికి వెళ్ళి నా సామానంతా తీసుకొచ్చి గేటు బయట విసిరేయసాగాడు.

"హయ్యో...! ఇదేం అన్యాయమండీ...! చెయ్యని తప్పుకు శిక్ష విధిస్తారా...! గతం గుర్తుకు తెచ్చుకోండి. ఆవేశపడకుండా ఆలోచించండి." అని మొత్తుకోసాగాను.

"అన్ని విధాలా ఆలోచించాను. కోడితో ఎవరూ క్రికెట్ ఆడరు. కోడిని చెత్తకాగితంలో పెట్టి ఎవరూ విసిరేయరు. నువ్వు నీళ్ల పట్టుకోవడానికికో, దేనికో వెళ్లినప్పుడు పక్కింటివాళ్ల కోడి నీ మంచం కింద దూరి దాక్కుని ఉంటుందన్న కథలు చెప్పకు. అడిగి చూశా. చుట్టుపట్ల ఎవరి కోడీ తప్పిపోలేదు. .."

ఆయన అరుస్తూండగానే నాకు గుర్తుకు వచ్చింది, వాళ్ల మనుమడు నిన్న చేసిన శపథం! చదువు సరిగ్గా చదువుకోకపోతే ఓ రెండు వాయించా. అప్పుడే అన్నాడు 'మిమ్మల్ని రేపటికల్లా ఇల్లు ఖాళీ చేయించకపోతే నా పేరు మార్చుకుంటా" అని.

వాడే ఏ ఫ్రెండు ద్వారానో నా గదిలోకి కోడిని పంపివుంటాడు. గది తాళంచెవి డూప్లికేటు వాళ్లింట్లో ఉంటుందిగా!

కానీ మనుమడి గురించి ఫిర్యాదు చేస్తే ఆయన వినిపించుకోడు. పైగా నా వద్ద సాక్ష్యం లేదు. అప్పటికే చుట్టుపక్కల ఇళ్ళలోని వారు బయటికి వచ్చి చోద్యం చూస్తుంటే నా నోరు పెగలలేదు.

నా ఆలోచనలలో నేనుండగానే... ఆయన, నా సామానుతో పాటూ... నన్ను కూడా విసిరేసాడు. ఇంత అవమానం జరిగేక ఇక అక్కడ ఉండడం అనవసరం!

రిక్షాకోసం చూస్తూండగానే అంతలో ఆయన



భార్య బయటికి పరుగెత్తుకొచ్చి "బాబోయ్...! పాము... పాము...! మా ఆయనను రక్షించండి" అంటూ కేకలేసింది.

కొందరు ఆమె కేక విని, పరుగెత్తుకొచ్చారు. సరాసరి, మా ఇంటాయన కూర్చున్న పూజ గదిలోనికి వెళ్ళారు. వారి వెనకే నేనూ వెళ్ళాను. ఓ యువకుడు మమ్మల్ని తోసుకుంటూ ముందుకు వచ్చాడు.

పూజగదిలో పీటమీద కూర్చునున్నాడు మా ఇంటాయన. ఆయనకు ఒక అడుగు దూరంలో కట్లపాముంది. కదిల్తే... కాటేసేలా వుంది.

ఆ యువకుడు, పెన్నూ పేపరూ తీసుకుని, "తమరి పేరేమిటి?" అన్నాడు మా ఇంటాయన నుద్దేశించి.

"రక్షించండి బాబూ...!" మా ఇంటాయన ఏడుస్తున్నాడు.

"ముందు మీ పేరు చెప్పండి" మళ్ళీ అడిగాడా యువకుడు.

"రాఘవాచార్యులు! రక్షించమంటే... పేరడుగుతావేం!" అన్నాడు ఇంటాయన.

"మీ వయసు?"

"నీ ఇంటిని దొంగల్దోలా! రక్షించమంటే... వయసునడుగుతావేం!.. 69.." అన్నాడు ఇంటాయన వణుకుతూ.

"మీరు, మానవాళికిచ్చే అంతిమ సందేశమేంటి?" అన్నాడా యువకుడు.

"ఆ కట్లపాము... నిన్ను కాటెయ్య! రక్షించవయ్యా అంటే... అంతిమ సందేశం అంటావేంటి...?" అన్నాడు ఇంటాయన ఏడుస్తూ...

"నేను... ఫలానా పత్రిక జర్నలిస్టును. పామంటే... నాకూ చచ్చేంత భయం. దాని జోలికి పోను. పైగా అది ఇంటర్వ్యూ ఇవ్వదు. మీ మరణవార్త ప్రచురించేటప్పుడు.... మాకు రిలయబుల్ డేటా కావాలి గదా! అందుకనే ఈ ప్రశ్నలు. ఊ! చెప్పండి... అంతిమసందేశం? ప్రపంచాని కిస్తారా? లేక ఉట్టి ఈ గ్రామానికే పరిమితం చేస్తారా? క్విక్.." అన్నాడు ఆ జర్నలిస్టు యువకుడు తొందరపడుతూ...

అంతలో నలుగురు మహిళామణులు, జర్నలిస్టును వెనక్కి లాగి, ముందు కొచ్చి పాముకు పూజచేసే నిమిత్తమై... నేల మీద ముగ్గులేసి సమాయత్తమవుతున్నారు.

ఓ మహిళ, పాలగిన్నె అక్కడ పెట్టి, భక్తిగా చేతులు జోడించి, "నాగరాజా...! ఆ పాలు తాగు. మమ్మల్ని చల్లగా చూడు" అంది భయం భయంగా వెనక్కి జరుగుతూ.

"నీ మొహం! కట్లపామును పట్టుకుని... నాగరాజా అంటావేంటే?" అన్నాడు ఆమె భర్త.

"పాములు పాలు తాగవు!" అన్నాడొక సత్యాన్వేషకుడు.

"ఎందుకు పాలు తాగవు!" అన్నాడు మరో సందేహాత్ముడు.

"తాగవని ఎవడన్నాడు? నాగుల చవితికి... పుట్టలో పాలు పోస్తాం కదా! ఎన్ని లీటర్ల పాలైనా... ఇట్టే తాగేస్తాయి" అంది ఓ భక్త నారీరత్నం.

"అస్సలు... తాగవవి! కావాలంటే... చూడండి... బెట్! ఇప్పుడు పాము ఆ పాలు తాగితే... మీకు వంద రూపాయలిస్తాను. తాగకపోతే... మీరు నాకు వందివ్వాలి!" అన్నాడు.

ఇంతలో పక్కింటి క్రికెట్ కుర్రాడు సైన్సు పుస్తకం తీసుకుని లోపలికి వచ్చాడు.

"తాతగారూ! మీరేం భయపడకండి. పాము కాటుకు ప్రథమ చికిత్స ఎలా చెయ్యాలో నాకు తెలుసు. పాము కాటేసాక... ఆ భాగాన్ని కత్తితో గానీ బ్లేడుతో గాని కోసి, రక్తాన్ని పీల్చి ఉమ్మేయ్యాలి! ఖతం.. ఈ ఐడియా చెప్పినందుకు మీరు నాకు బంతి కొనివ్వాలి." అన్నాడు.

"ఈ ప్రథమ చికిత్సలు వేస్ట్! ఆ మధ్య పాము మా బావగారిని కాటేసింది. అంతే... అరగంటలో బుసబుసమని అరకిలో నురగ కక్కుకొని ఠారున చచ్చూరుకున్నాడు" అందో స్త్రీ.




"బాబూ...! నువ్వైనా నన్ను రక్షించు" అన్నాడు ఇంటాయన ఏడుస్తూ.

"రక్షిస్తాను! అందుకు ప్రతిగా... మీరొకటి చెయ్యాలి!" అన్నాను.

"చెప్పు! ఏం చెప్పినా చేస్తాను" అన్నాడు పామువైపు భయంగా చూస్తూ...

"నా సామానంతా... తిరిగి నా గదిలో పెట్టించాలి."

"నేనే పెట్టేస్తాను. త్వరగా రక్షించవయ్యా బాబూ... వా...!"

"హమ్మా....! మిమ్మల్ని నమ్మడానికి వీల్లేదు. దేవుడిపై ఒట్టెయ్యండి." అన్నాను

"హా... శ్రీమన్నారాయణునిపై ఆన! నీ గదిలోకి ఆవుల్ని, పందుల్ని తెచ్చుకుని కోసుకుతిన్నా ఏమీ అనను. సరేనా!? " అన్నాడాయన గొల్లుమంటూ.

నేనిక క్షణం ఆలస్యం చెయ్యలేదు. పక్కింటికి పరుగెత్తి "అర్జెంటుగా రెండు గుడ్లివ్వండి" అన్నాను. వారు రెండు కోడిగుడ్లిచ్చారు.

మళ్ళీ ఆయన పూజ గదిలోనికి వచ్చాను. వణుకుతున్న ఇంటాయనకు దూరంగా ఓ కోడి గుడ్డును పాముకు నాలుగడుగుల దూరంలో వేసాను. అది చప్పున ... ఆ గుడ్డు వైపు పాకింది.

నేను, ఈయన గారికి ఇవతలికి లాగాను. అప్పటికే ఆ పాము గుడ్డును మింగింది. మరో గుడ్డును అందుకుని గడప అవతలికి విసిరాను. అది సర్రున పాకుతూ వెళ్ళి ఆ గుడ్డును అందుకుని... బయటికి వెళ్ళిపోయింది.

ఆయన నా రెండు చేతులూ పట్టుకుని... "ఆవుని తెచ్చుకుని కోసుకుని తినేటప్పుడు మాత్రం కాస్త ముందుగా చెప్పు నాయనా, మా తోడల్లుడి ఊరికి వెళతాం." అన్నాడు ఏడుపు మొహం పెట్టి.

"ఛ, ఛ. మీరూరుకోండి. అసలు పాము ఎలా వచ్చిందాని నేనాలోచిస్తుంటే.." అన్నాను నేను. అప్పుడు మా శిష్యరత్నం, ఆచార్యులు గారి మనుమడూ నీళ్ళు నములుతూ ముందుకు వచ్చాడు - 'మరేం, మాష్టారిని తరిమేయాలంటే ఆయన గదిలోకి పాము పంపి భయపెట్టాలా, లేకపోతే కోడి పెట్టేసి తాత చేత తిట్టించాలా అని మా ఫ్రెండ్స్ నడిగాను. ఇద్దరూ హెల్ప్ చేసినట్టున్నారు. కోడి ప్లాను సక్సెసవడంతో పాము తెచ్చిన ఫ్రెండు కోసం వచ్చి దాన్ని ఇక్కడే పడేసి పోయాడు." అన్నాడు.

"హోరి పిడుగా, కోడి పెట్టింది నువ్వా" అని నేను, 'పాముని ఇంట్లోకి తెస్తావుట్రా భడవా'. అని ఆచార్యులు గారూ విరుచుకుపడడంతో తుర్రుమని పారిపోయాడు ఆ కుర్రాడు.




రాజా

తెలుగు సినిమా పాటకు ఓ లాలిత్యాన్ని అద్ది- ఆ పాటను పదిమంది పాడుకునే స్థాయినుంచి సాంస్కృతిక రంగంలో ప్రతిభా పాటవ ప్రదర్శనా స్థాయికి తీసుకువెళ్ళిన సంగీత దర్శకుల్లో ఎస్.రాజేశ్వరరావు స్థానం అపూర్వం. ప్రేక్షక శ్రోతలలో ప్రతి ఒక్కరూ 'ఇది రాజేశ్వరరావు ముద్ర' అని ఎవరికి వారే-తమకు మాత్రమే పరిచయమున్నంత సాధికారంగా చెప్పగలరు ఆయన బాణీల గురించి. అంతగా మన హృదయాలతో పెనవేసుకుపోయాయి ఆయన పాటలు. 1957లో వచ్చిన నరసు వారి

# భలే అమ్మాయిలు

చిత్రంలోని పాటల్ని అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. సినిమా రచన విభాగానికి సంబంధించిన వారంతా మాటలూ, పాటలూ కలిపి రాసే రచయితలుగా ఉంటున్న ఆ రోజుల్లో కథకి అంటూ ప్రత్యేకంగా తయారై 'కథా శివబ్రహ్మం'గా పేరు తెచ్చుకున్న రచయిత సదాశివబ్రహ్మం, జానపద రసరాజుగా పేరొందిన కొసరాజు ఈ చిత్రంలోని పాటలను రాశారు.

గోపాల జాగేలరా నన్ను లాలించి పాలింప రావేలరా బాలగోపాల జాగేలరా
దరిజేర చలమేలరా... ఆ.....
దరిజేర చలమేలరా ॥2॥
నన్ను దయజూడ విధియేమిరా ॥దరి॥
మొర వినవేల కనవేల మురళీధర కరుణాకర గిరిధర ॥గోపాల॥
కనుగవ అరమోడ్చి శృతి గూర్చి మురళి
అనుపమ సంగీత మొలికించు సరళి ॥కనుగవ॥
కనుగొని ప్రేమించి నిను జేరినా... ఆ.....
చనువున నేనెంతో బ్రతిమాలినా ॥కనుగొని॥
కనికరించి పలుకరించవేలరా
మురళీధర కరుణాకర గిరిధర ॥గోపాల॥
సరిగపద ॥గోపాల॥
సదపగరి సరిగపద ॥గోపాల॥
పగరిసదా సరిగపద ॥గోపాల॥
దాసరి పాదస పా సరిగపద ॥గోపాల॥
గరిగరిసా రిసరిసదా రిసదప గరిగపద ॥గోపాల॥
సాస దదసాస గపదసాస రిగపదసాస సరిగపద ॥గోపాల॥

(షణ్ముఖ ప్రియ)

రీగ రిగ రీరీ... ఆ.....
రిగ రిరిసనీని దనిగరిసనీ దనిరిసనీ దనిని దపమ
పదప పనిద దసని నిరస సగరి నిరిస దసని పనిదా
గమపదని ॥గోపాల॥
నిస్సనినిసా... ఆ.....
నిరిస నిసదా పగరిసదా పరిసదా పసదా పదపదని
దనిదనిస నిసనిసరి సరిగగరీ నిసరిరిసని దనిస సనిద








పమాపదని ॥గోపాల॥

**కాంభోజి**

గగమ గమగా గామగమ రిమగ గరిస గరిస నిదరిస నిద
సనిదపపా దసరిగా... ఆ.....
రీగరిగరీరీ రిమగగారిస గరిరీస దరిస సానీదాప దసరిగరీ... ఈ.....
రిగమ రిగమామ సరిగ సరిగాగ దసరి పదమగారి సనిద పదగరీస
నిద పద రిసా నిద పసనిద పనిద మదపమ గరిసరి గమ పద సరిగ ॥గోపాల॥
మగపదస మాగా మగగరిస దాసా దరిసనిదపాదా సనిదపద ॥జాగేలరా॥

**మధ్యమావతి:**

రిమపనిస రీరి రిమరిమ రిరిసని ససరి నినిస పపని రిసని పమ రిరిమమ
నినిరీ... ఆ.....రీపమరిసని సమరి మసరి నిరిసరి నిప మపనిసరి
మారీ రిసని రీసా సని పసారీ మపని ॥గోపాల॥

**మోహన:**

గాగరిరిగ రిగరిరిస సదగగ రిగగ సరిరి దసస పదరిసరి దసదప పాదా
సారిగా...గగప గప గగరి రిరిగరిగరిరిస ససరిసరిససద పాపదగరీ...
రీరీ గరిసద సానా రిసదప దాదా సదపద గపద గరిసా
దగారీ సాదప రీసాదాపగ సాదాపా గసరిగ పసదా
గారీరీసా రిసదపదసా...రిరిసారిరిదా సదప గపదా...
గరిసదగరీ...సదపగసదా...సదసపదగా...గపదాగరిసా
గరిసాపగరీ దపగా సదపా రిసగరి పగ దపసదరిస రిగరిగ సరిస
దసద పద గారీ సద రీసా సదప సారీ గపద ॥గోపాల జాగేలరా॥



ఈ పాటను ఎమ్.ఎల్.వసంతకుమారి, పి.లీల పాడగా సావిత్రి, గిరిజ, రేలంగిపై చిత్రీకరించారు. శాస్త్రీయ సంగీత కచ్చేరీల స్థాయిలో సినీ గీతాలను కూడా స్వరపరచి ప్రదర్శించవచ్చుననే నమ్మకాన్ని కలిగించే పాట యిది. ఎమ్.ఎల్. వసంత కుమారి వంటి శాస్త్రీయ సంగీత విద్వాంసురాలితో పాడించుకున్నది కూడా అందుకే! ఈ పాటను స్వరాలతో సహా తప్పులు దొర్లకుండా పాడి మెప్పించగల గాయనీ గాయకులెవరికైనా సరే ఏ పాటైనా పట్టుపడితీరుతుంది. తెలుగు సినీ గీతాల్లో తరాల తరబడి నిలిచిపోయే అతి గొప్ప గీతమిది. ఈ పాట పల్లవి, చరణాలు, చివరి స్వరాలను-మోహనరాగంలోనూ, మధ్యన వచ్చే స్వరాలను-షణ్ముఖప్రియ, కాంభోజి, మధ్యమావతి రాగాలతోనూ రూపొందించారు. సుస్వర సంగీతానికి చెవి యొగ్గి వినే ప్రతివారింటా ఉండదగ్గ గీతమిది.

గిరిజ : అందాల రూపమూ!! ఆనందదీపమూ
కందోయి విందుసేయు మంద మందహాసము
అందుకే ఆ మోహమూ! యిందుకే యీ స్నేహమూ ॥అందాల॥
ప్రేమ తరంగమూ నా అంతరంగమూ
చెంగుచెంగున దూకే-పసిడితురంగమూ
వినువీధులలో-విహరించేటి ॥విను॥
ఆ చందమామమీద అట్టె నిలిచిపోయెనూ
అందుకే ఆ మోహమూ యిందుకే యీ స్నేహము ॥అందాల॥
నీ కనుసన్నలూ-నీ చిరునవ్వులూ
అరవిరిసిన విరజాజి మల్లెపువ్వులు
నీ మురిపాలూ-నీ సరసాలూ
వేమారు మరువలేక వెర్రిదాననైతినీ
అందుకే ఆ మోహమూ
యిందుకే యీ స్నేహమూ ॥అందాల॥



ఈ పాటను సుశీల పాడగా గిరిజ, జగ్గయ్యపై చిత్రీకరించారు. విన్నవారెవరికైనా సరే... పాటలో ఓం ప్రథమంగా ఆకట్టుకునేది సుశీల గొంతులోని ఫ్రెష్‌నెస్... స్వచ్ఛత! కొన్ని కొన్ని పాటలను వింటున్న కొద్దీ పరిజ్ఞానం పెరుగుతూ ఉంటుంది. ఎన్నో పాటల ఛాయలు మనసుని స్పృశించి పోతుంటాయి. ఈ పాటలో ఇన్ని ఫ్రేజ్‌లు ఉన్నాయా... ఈ ఫ్రేజ్‌తో తర్వాత ఇంకో పాట తయారయిందా... అని అనిపించే రాగానుభావంతో హృదయం సుసపన్నం అయిపోతూ వుంటుంది. అటువంటి అనుభూతిని కలిగించే పాట యిది.

పల్లవి రెండు లైన్లతో పాటు తొలి చరణంలోని 'ప్రేమ తరంగమూ-నా అంతరంగమూ' అనే లైనుకి, మలి చరణంలోని 'నీ కనుసన్నలూ-నీ చిరునవ్వులూ' అనే లైనుకి జత పడిన ట్యూన్ ఆలపిస్తూ వుంటే... 'సుభాకా తారా'(1954) సినిమాలో 'గయా అంధేరా-హువా వుర్ఝాలా' పాట గుర్తొస్తుంది. ఈ పాటను 'సంతానం (1955) సినిమాలో 'సంతోషమేలా సంగీతమేలా' పాటకు వాడుకున్నారు. (ఈ పాటకు సంబంధించిన విశ్లేషణ 1-15 జూన్ 2002 సంచికలో ప్రస్తావించటం జరిగింది). అలాగే తొలి చరణంలోని రెండవ లైను 'చెంగు చెంగున దూకే పసిడి తురంగము', మలి చరణంలోని

రెండవ లైను 'అరవిరిసిన విరజాజి మల్లెపువ్వులూ' వింటుంటే-హాస్యనటుడు భగవాన్ నిర్మించిన 'అల్బేలా' సినిమా కోసం సి.రామచంద్ర స్వరపరిచి చితల్‌కర్ పేరుతో లతాతో పాడిన 'షోలాజో బడ్‌కే-దిల్ మేరా ధడ్‌కే' పాట పల్లవిలో 'దర్ద్ జవానీ కా సతాయే బడ్ బడ్‌కే' అనే మూడవ లైను గుర్తొస్తుంది.

ఇక తొలి చరణంలోని మూడవ లైను-'విను వీధులలో విహరించేటి' మలి చరణంలోని మూడవ లైను-'నీ మురిపాలూ-నీ సరసాలూ'... ఈ రెండు లైన్ల ట్యూన్‌ని వింటుంటే తర్వాతి రోజుల్లో రాజేశ్వరరావు 'అమాయకురాలు' సినిమా కోసం స్వరపరిచిన 'సన్నజాజి పువ్వులు-చందమామ కాంతులు-చిన్నారి పాపా నవ్వులు' అనే పాట గుర్తొస్తూ వుంటుంది.

ఇలా చరణాలలోని ఒక్కొక్క లైనూ ఒకొక్క ఫ్రేజ్‌ని గుర్తు చేస్తున్నా అవన్నీ రాజేశ్వరరావు గారి తెలివితేటల మీద గౌరవాన్ని పెంచే విధంగానే వుంటాయే తప్ప ఆయన స్వరకల్పనా సామర్థ్యాన్ని ఎక్కడా తక్కువ చేసే విధంగా వుండవు. ఇన్‌స్పిరేషన్‌ని తీసుకొని పేర్లల్‌గా క్రియేట్ చెయ్యడం అంటే ఇలా వుండాలి అని అనిపించేట్టు ఉంటాయి.

**జిప్సీ :** చకచక ఝుణతా-తకధిమికిటతా
పకపక నవ్వుతా-పంతమాడతా
ఎంటెంట తిరుగుతున్న జంటసోకుసూడరే ॥2॥
**కోరస్:** హేయ్! చకచకఝునత-తకధిమికిటతా
పకపక నవ్వుతా-పంతమాడతా
ఎంటెంట తిరుగుతున్న జంటసోకు సూడరే ॥2॥
**జిప్సీ :** పక్కనున్న పిల్లా! పంచదారబిళ్ళ
టక్కులెన్నో చేస్తున్నది
**కోరస్ :** ఆ అందగాణ్ణి బుట్టలోన వేసుకున్నది
**జిప్సీ :** మనసు లాగినాది! వయసు దోచినాది
మచ్చుమందు చల్లినాది
**కోరస్ :** అబ్బబ్బ వుచ్చువేసి పట్టినాది-హైహహో॥చక॥
**జిప్సీ :** సూదంటురాయల్లె! లాగుతున్నదీ!! వాలు
సూపుల్తో లోకుల్ని వూపుతున్నది
**కోరస్ :** వాలుసూపుల్తో లోకుల్ని వూపుతున్నది
**జిప్సీ :** వొళ్ళు తెలియనీయకా! కళ్ళు గాననీయకా
గీటు దాటకుండ కన్ను గీటుతున్నదీ
**కోరస్ :** దీని నాటకాలు తెలిసెనని నవ్వుతున్నదీ
**జిప్సీ :** మంచికులుకులాడీ
**కోరస్ :** తళుకుబెళుకులాడీ
**జిప్సీ :** మంచికులుకులాడీ
**కోరస్ :** తళుకుబెళుకులాడీ
**జిప్సీ :** బలే వన్నెచిన్నెలెన్నో చూపు వగలాడీ
**కోరస్ :** ఆహా! వలపుజూపీ !! మోసపుచ్చుమాయలాడి
**జిప్సీ :** మురిసిపోయె రాజా!! ముచ్చటైన రోజా
అంతు తెలిసి అడుగువెయ్యవోయ్
**కోరస్ :** ఒహోహో అందమంత అనుభవించవోయ్ ॥చక॥



ఈ పాటను జిక్కి, బృందం పాడగా పద్మిని(ప్రియదర్శిని గ్రూప్ డాన్సర్లతో అభినయించింది. సన్నివేశ ప్రాధాన్యంగా ఎన్.టి.ఆర్., సావిత్రి కూడా అభినయంలో పాలు పంచుకుంటారు. ఇక్కడ ఓ రెండు మూడు విషయాల్ని ప్రస్తావించి తీరాలి. ఈ చిత్రానికి మాతృక అయిన బడీ బెహన్ (1949)లో 'చుప్ చుప్ ఖడె హో జరూర్ కొయి బాత్‌హై' అనే పాట లత, ప్రేమ్‌లత కలిసి పాడినది వుంది. ఆ పాట ఆ రోజుల్లో ఎంతగా హిట్ అయిందంటే-ఏ.వి.యం. వారి 'జీవితం' సినిమాలో 'టిక్కుటిక్కు టక్కులాడి' అనే పల్లవితో యధాతథంగా తీసుకోక తప్పదనేటంత స్థాయిలో హిట్ అయింది. తెలుగు వెర్షన్ 'భలే అమ్మాయిలు' సినిమాకొచ్చేసరికి ఆ సన్నివేశానికి ఆ హిందీ ఒరిజినల్ పాట ప్లేస్‌లో తెలుగుపాట ఇంకొకటి చేసి తీరక తప్పదు. అటువంటి పరిస్థితుల్లో రాజేశ్వరరావు సృష్టించిన పాట-'చక్ చక్ ఝుణతా'!

మోహన రాగాన్ని అవసరం అయిన చోట మిశ్రమం చేసుకుంటూ ఆయన ఈ పాటను ఎంత ధీటుగా స్వరపరిచారో తెలుసుకోవాలంటే ఒరిజినల్ సినిమాలోని 'చుప్ చుప్ ఖడేహో' పాటని, 'చక్ చక్ ఝుణ్‌తా' పాటని పక్కపక్కన పెట్టుకుని వింటే తెలుస్తుంది.

మరో విషయం ఏమిటంటే-ఈ పాటలో 'సూదంటు రాయల్లె లాగుతున్నది-వాలుసూపుల్తో లోకుల్ని వూపుతున్నది' అనే లైనుకున్న ట్యూన్‌ని ఇప్పుడు గనక వింటే రాజేశ్వరరావుగారబ్బాయి కోటి 'పెదరాయుడు' సినిమా కోసం చేసిన 'అబ్బ దీని సోకు చూసి వచ్చా వచ్చా' అనే పాట పల్లవి గుర్తొస్తుంది.

ఇంకో విషయం ఏమిటంటే ఈ 'పెదరాయుడు'లోనే కోటి స్వరపరిచిన 'కదిలే కాలమా కాస్సేపు ఆగుమా' అనే పాటొకటి వుంది. అందులో 'తాతయ్య తేజం, పెదనాన్న నైజం' అనే చరణం వింటే రాజేశ్వరరావు గారు 'డాక్టర్ చక్రవర్తి' సినిమా కోసం స్వరపరిచిన 'ఓ బొంగరాల బుగ్గలున్నదానా' పాటలో 'నీకైపు కళ్ళతో నీ కొంటె నవ్వుతో గారడి చేశావు' అనే చరణం యధాతథంగా స్మృతి పథంలో సాక్షాత్కరించి 'రసాలూరు జీన్స్' అంటూ మనచేత అనిపించేస్తాయి.

ఒహో బంగరు చిలుక
అహా ఎందుకె అలుకా
ఇలా చూడవు మాటాడవు మోమాటమా ॥ఒహో॥
చెరువు మీద అలకైతే చెడేదెవ్వరో
ఫలహారం మాని బాధపడేదెవ్వరో ॥చెరువు॥
చిరునవ్వు నవ్వితే రతనాలు రాలునా ॥చిరు॥
ఒక మాటకు వరహాలు ఒలికిపోవునా
వరాలొలికి పోవునా ॥ఓహో॥
కనికారం లేదా-కన్నెదుట నిలచినా
అనురాగం రాదా-నోరార పిలచినా ॥కని॥
చిరునవ్వు నవ్వితే రతనాలు రాలునా ॥చిరు॥
ఒక మాటకు వరహాలు ఒలికిపోవునా
వరాలొలికి పోవునా ॥ఓహో॥





'ఒహో బంగరు చిలుక' పాటను జిక్కి గానం చేయగా సావిత్రి, యన్.టి.ఆర్.పై చిత్రీకరించారు. ఈ పాట పీలూ, అభేరి రాగాలపై ఆధారపడింది. ఈ పాటలో రాజేశ్వరరావు ముద్ర చాలా చోట్ల కనబడుతూ వుంటుంది. 'కనికారం లేదా కన్నెదుట నిలచినా' అనే రెండవ చరణానికి ముందు వచ్చే ఆలాపనను ఆలపించుకొంటూ పోతే 'భలేరాముడు' సినిమాలోని 'ఓహో మేఘమాలా... చల్లగ రావేలా' అనే పాటలో తేల్తాం... అలాగే రెండు చరణాలలోనూ 'చిరునవ్వు నవ్వితే రతనాలు రాలునా' అనే వాక్యం తర్వాత వచ్చే ఫ్లూట్ బిట్‌ను ఆలాపించుకుంటూ పోతే 'చెంచులక్ష్మి' సినిమాలో 'కానగరావా ఓ శ్రీహరి రావా' పాటలోని మొదటి చరణంలోని 'వేచి వేచి కనులేమో కాయలు కాచే' తర్వాత వచ్చే ఫ్లూట్ బిట్ దగ్గర తేల్తాం. ఈ రెండు ఉదాహరణలు ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే-ఒక్కొక్క సంగీత దర్శకుడికి తనదైన శైలి ఉంటుంది. ఆ ముద్ర ద్వారా ఆయనను గుర్తించవచ్చు. శాస్త్రీయ సంగీతం అభ్యసించకుండా సినీ సంగీతం ద్వారా రాగాలతో పరిచయం ఏర్పర్చుకోవాలనే వారికి ఈ రకమైన సాధన వుపకరిస్తుంది. ఈ పాటలోని 'చెరువు మీద అలకైతే' అనే ప్రయోగం సభ్య ప్రపంచంలోని విలువల దృష్ట్యా అప్పట్లో చాలా మందికి కాస్త ఇబ్బందిగానే అనిపించింది.

మది ఉయ్యాల లూగే
నవ భావాలేవో రేగే
మానస మానంద మాయెనహో ॥మది॥
ప్రేమతో గగన వీధులలో
హాయిగా ఎగిరి పోవుదమా ॥ప్రేమతో॥ ॥మది॥
తీయని కోరికలూరెను నాలో
తెలియదు కారణమేమో
ప్రేమ ఇదేనా ప్రణయ మిదేనా ప్రణయమిదేనా ॥ప్రేమ॥
నూతన యవ్వన సమయమున ॥మది॥
చిన్నతనమేలా సిగ్గు పడనేలా
మన్ననలెందుకు మనలోనా ॥చిన్న॥
ప్రేమలో కరిగిపోవుదమా
భేదమె మరిచిపోవుదమా ॥ప్రేమ॥ ॥మది॥
ఓ చెలియా మన జీవితమంతా
పున్నమ వెన్నెల కాదా
రేయి పవలు-నే-నినుమురిపించి
నిను వలపించి
ప్రేమ జగానికి కొనిపోనా ॥మది॥









'మది ఉయ్యాలలూగే' పాటను ఘంటసాల, లీల గానం చెయ్యగా ఎన్.టి.ఆర్., సావిత్రి అభినయించారు. ఈ పాటలో 'ప్రేమతో గగన వీధులలో' దగ్గర, 'చిన్నతనమేలా' దగ్గర, 'ఓ చెలియా మన జీవితమంతా' దగ్గర ఘంటసాల పాడిన పద్ధతి వింటే అన్ని స్థాయిల్లోనూ గాత్రాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించడం అంటే ఏమిటో అవగాహనకు వస్తుంది. రేంజ్‌కి తగ్గట్టుగా వాయిస్‌ని మలచుకోవడం తెలుస్తుంది. ఇది ఇలా ఉండగా ఈ పాటలో లీల పాడిన విధానాన్ని జాగ్రత్తగా గమనిస్తే-'మది ఉయ్యాలలూగే నవభావాలేవో రేగే మానస మానంద మాయెనహో' అని అనిపించి పల్లవి అనుభవంలోకి వస్తుంది. 'ప్రేమలో కరిగిపోవుదమా-భేదమే మరచిపోవుదమా' లైన్‌ల దగ్గర లోబేస్‌లో ఆమె ఇచ్చిన పెర్ఫార్మెన్సే అందుకే తిరుగులేని సాక్ష్యం. ఇక సంగీత దర్శకునిగా రాజేశ్వరరావు ముద్రని పల్లవిలోను చరణాలలోనూ పట్టుకోవడం కష్టం. వెస్టన్ కార్డ్స్‌తో కూడిన ఇంటర్‌లూడ్స్ వింటే తరువాత రోజుల్లో ఆయన చేసిన-'నీకో తోడు కావాలి నాకో నీడ కావాలి' (చదువుకున్న అమ్మాయిలు), 'ఎగురుచున్నది యవ్వనమూ' (దొరికితే దొంగలు)-పాటలు గుర్తుకు వస్తాయి. బిళహరి, కమాస్ రాగాల ఆధారంగా ఈ పాట స్వరపరచబడింది. సాహిత్యపరంగా చూసుకుంటే కవులకు గౌరవం ఇచ్చే రోజులు కాబట్టి 'పున్నమ వెన్నెల' అనే పదాల్ని యధాతథంగా ఉంచారు. ఈ రోజుల్లో అయితే 'పొరపాటున గుడి పెట్టడం మర్చిపోయి ఉంటారు' అని నిర్ధారించేసుకుని ఎవరికి వారే కవులైపోయి 'పున్నమి వెన్నెల' అని దిద్దేస్తారని వేరే చెప్పనవసరం లేదు కదా!?









వెంకట్రా : అహ! నిసరిమపా! సరిమపా! రిమపా! మపా! పా
రత్నమ్మ : చీటికి మాటికి చీటికట్టి వేధించేవానాడు
లాటరీలోన లక్షలు లక్షలు సాధించేవీనాడు
వెంకట్రా : చీటికిమాటికి! చీటికట్టి వేధించేనానాడు
లాటరీలోన లక్షలు లక్షలు సాధించేనీనాడు
రత్నమ్మ : చెంగావీ చీరకట్టి! రంగైన రైక తొడిగి వెంకట్రా :అహ...అహ...అహ...అహ...
రత్నమ్మ : చెంగావీ చీరకట్టి రంగైన రైక తొడిగి
బంగారు రవ్వల నగలు సింగారించి జోరుగా నేనీతో వస్తా జోడుగా
వెంకట్రా : ఒహో! చిలకా గోరింకల్లాగ-అలుమగలంహాయిగా...ఆ...
రత్నమ్మ : నిసరిమపా, సరిగపా, రిమపా,మపా, పా,
వెంకట్రా : అహ! చిలకా గోరింకల్లాగ ఆలుమగలం హాయిగా
చీకుచింతా లేకుండా యిక-ఆడుతు పాడుతు వేడుక చేద్దాం
నీలయ్య : గురువా వెంకట్రా :శిష్యా
నీలయ్య : నిసరిమపా, సరిమపా, రిమపా, మసా, పా
రత్నమ్మ : ఛీ పా ॥చీటికి॥
రత్నమ్మ : కోరిన కోరికలన్నీ, తీరేను ఒకటేసారి వెంకట్రా : హా! హా! హా...
రత్నమ్మ : కోరిన కోరికలన్నీ! తీరేను ఒకటేసారి
సాటివారందరిలోన! రాణీలాగవుంటాను మహరాణీలాగ వుంటాను
వెంకట్రా : ఓహో! రాణీలావుంటే నువ్వు రాజాలా నేనుండనా...ఆ...
రత్నమ్మ : నిసరిమపా, సరిమపా, రిమపా, మపా, పా
వెంకట్రా : అహ రాణీలావుంటే నువ్వు రాజాలా నే నుండనా
రాణీ నీవు, రాజా నేను చేతిలో బెల్లం వున్నంత కాలం
నీలయ్య : గురువా వెంకట్రా : ఛీపా
ముగ్గురు : నిసరిమపా, సరిమపా, రిమపా, మపా, పా
లాటరీలోన లక్షలు లక్షలు లాభించె ఈనాడే.
ఇద్దరు : మోటారుమీద యిద్దరమింకా పోదామా యీనాడే
యిక పోదామా యీనాడే టూర్ పోదామా యీ నాడే

ఈ పాటను పి.బి.శ్రీనివాస్, జిక్కి పాడగా రేలంగి, సూర్యకళ, హాస్యనటుడు బాలకృష్ణపై చిత్రీకరించారు. పి.బి.శ్రీనివాస్, జిక్కితో పాటు బాలకృష్ణకు ప్లేబ్యాక్ పాడిన వారి పేరు టైటిల్స్‌లో గాని, క్యాసెట్ ఇన్‌లే కవర్‌పై గాని ఎక్కడా పేర్కొనడం జరగలేదు. ఈ పాటకు మధ్యమావతి రాగం ఆధారం. 'నిసరిమపా' అనే స్వరాల దగ్గర కాని, 'చిలకా గోరింకల్లాగ ఆలుమగలం హాయిగా', 'రాణిలా వుంటే నువ్వు రాజాలా నేనుండనా' అనే వాక్యాల వద్ద వున్న రాగాలాపన దగ్గర కాని మధ్యమావతి రాగం సుస్పష్టంగా కనిపిస్తుంది. ఈ పాటను సాధన చేస్తే మాధ్యమావతి రాగంపై ఖచ్చితంగా మంచి పట్టు వస్తుంది. పి.బి.శ్రీనివాస్ కంఠం రేలంగికి నప్పుతుందని నమ్మిన సంగీత దర్శకుడు యస్.రాజేశ్వరరావు అందుకే 'భలేరాముడు'లో ఒక పాట పాడిస్తే ఈ సినిమాలో రెండు పాటలు పాడించారు. అంతేకాదు-అంతకుముందు గాని, ఆ తర్వాత గాని పి.బి.శ్రీనివాస్ గళంలో మనం చూడని జిలుగుల్ని కూడా రాబట్టారాయన. ఈ సినిమాలోనే రేలంగికి పి.బి. పాడిన 'నాణెమైన సరుకుంది లాహిరి' అనే పాటను వింటుంటే రేలంగిని పి.బి. మిమిక్ చేసినట్టు వుంటుంది. ఇక ఈ లాటరీ పాటలో అయితే- ఫోక్ టైప్‌లో 'అహ/అహ' అని అనటంలోనూ, పై స్థాయిలో రాగాలాపన తీయటంలోనూ పి.బి.శ్రీనివాస్‌లోని గాయకుణ్ణి రాజేశ్వరరావు బాగా రెచ్చగొట్ట గలిగారనిపిస్తుంది.



సరోజ : దాగుడు మూతలు చాలునురా-నీ
ఆగడమంతా తేలెనురా-దొరికావ్‌లేరా నీ దొంగవేషాలు మానరా
కోరస్ : వేషాలింక మానరా-నీ మోసాలు మాకు తెలిసెనురా ॥దాగుడు॥
సరోజ : కలకలలాడుతూ-కిలకిల నవ్వుతూ ॥కల॥
వలపించి మోసగించే-వయ్యారి రాజా...హోయ్...
కోరస్ : వలపించి మోసగించే వయ్యారి రాజా ॥దాగుడు॥
సరోజ : మురిపించు మాటలా పులకించుపాటలా ॥2॥
మరపించి మాయచేసే-మన్మథరాజా
కోరస్ : మరపించి మాయచేసే మన్మథరాజా ॥దాగుడు॥
సరోజ : వన్నెలు చూచి-కన్నెల మనసుదోచే వాడవోయీ
కోరస్ : కన్నెల వయసుదోచే వాడవోయీ
సరోజ : నీటైనవాడా-నీ నాటకాలు యికసాగవోయి
కోరస్ : నీ బూటకాలు యిక సాగవోయి ॥దాగుడు॥

ఈ పాటను జిక్కి, బృందం పాడగా సావిత్రి ప్రధాన పాత్ర ధారిణిగా అభినయించింది. కిషోర్‌కుమార్, వైజయంతిమాల హీరో హీరోయిన్లుగా నటించిన న్యూఢిల్లీ (1956) అనే సినిమా కోసం శంకర్-జైకిషన్ స్వరపరిచి లతతో పాడించిన 'తుమ్ సంగ్ ప్రీత్ లగాయి రసియా' అనే పాటను ఇంటర్‌లూడ్స్‌తో సహా యధాతథంగా ఈ పాటకు వాడుకున్నారు. దేశం మొత్తంమీద ఆ హిందీ పాట ఎంత హిట్ అయిందో-మన తెలుగు ఆడియన్స్ ఎంతవరకు ఉన్నారో అంతవరకు ఈ తెలుగు పాట కూడా హిట్ అయింది.

సినీ సంగీతం ద్వారా శృత పాండిత్యాన్ని సాధించవచ్చు. అయితే అందుకు శ్రవణ సంస్కారం తోడవ్వాలి. అటువంటి శ్రవణ సంస్కారానికి దోహదం చేసే పాటలుగా ఈ 'భలే అమ్మాయిలు' సినిమాలోని పాటల్ని చెప్పుకోవచ్చు.

# సరిగమలు-గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకులు)







వేటూరి సుందర రామమూర్తి గారితో పరిచయ భాగ్యం ఒక విధంగా చాలా ఆలస్యంగా కలిగింది. ఆయన రచించిన ఎన్నో అద్భుతమైన పాటలకి నేను కీబోర్డ్ ప్లే చేశాను. అది అనిర్వచనీయమైన ఆనందం! రమేష్ నాయుడు గారు, మహదేవన్ గారు, బాల సుబ్రహ్మణ్యం గార్ల సంగీత దర్శకత్వంలో చాలా మంచి పాటలకి నేను కీబోర్డ్స్ వాయించటం పూర్వజన్మలో చేసుకొన్న పుణ్యం. ముఖ్యంగా 'శంకరాభరణం'లో అన్ని పాటలకీ, ఆనందభైరవి, శ్రీవారికి ప్రేమలేఖ, పడమటి సంధ్యారాగం, సప్తపది, ఇలాఎన్నో సినిమాలకి కొన్ని వందల గొప్ప పాటలకి నేను కీబోర్డ్స్ ప్లే చేయటం నాకు కలిగిన అదృష్టం. అసలు ఆ పాటలన్నిటికీ 90% ఆర్కెస్ట్రా మెంబర్స్ అందరం, గాయకులూ కలిసి పనిచేసేవాళ్లం. ఒక విధంగా చెప్పాలంటే మన ఇంట్లో పండక్కి అందరం కలిసి క్రింద కూర్చొని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఆత్మీయంగా, ఆనందంగా భోజనం చేసినట్లు ఉండేది. ఎంతో తృప్తిగా ఉండేది.

ఇప్పుడు రికార్డింగ్ పద్ధతి ఎలా వుందంటే మనింట్లో డైనింగ్ టేబుల్ వుంటుంది, దానిపైన భోజనం పెట్టి ఉంటుంది. ఎవరికి ఆకలి వేస్తే వాళ్ళు వచ్చి భోజనం చేసి వెళ్తుంటాము. అలా వుంది. ఆత్మీయత, తృప్తి తగ్గుతోంది. ఒక రకంగా నేను అదృష్టవంతుణ్ని. ఎందుకంటే ఎన్నో సినిమాలకి (సుమారు తొమ్మిది భాషల్లో) ఎందరో మహానుభావులు కలిసి ఎంతో రుచిగా చేసిన వంటలో పాలుపంచుకొనే భాగ్యం కలిగినందుకు చాలా ఆనందంగా వుంటుంది.



అన్నయ్య రమేష్‌కి సుందర రామమూర్తి గారితో చాలా అనుబంధం వుండేది. చక్రవర్తి గారి వద్ద అన్నయ్య సహాయకుడిగా పనిచేసేప్పుడు కోటి, (ప్రముఖ సంగీత దర్శకుడు) అన్నయ్య లంబు, జంబులుగా ఉండేవారు గురువుగారికి. ఆయనకి బాలూగారంటే వల్లమాలిన అభిమానం. ఒక తల్లి కడుపున పుట్టకపోయినా ఇద్దరూ అన్నదమ్ములే. పైగా వాళ్లిద్దరి కాంబినేషన్ గొప్పది. అలాగే వేటూరి గారికి రాజన్ నాగేంద్ర, మహాదేవన్, రమేష్‌నాయుడు, చక్రవర్తి గార్లంటే ఎంతో ప్రేమ. ఆయనలో ఉన్న గొప్ప సుగుణాలలో ఒకటి ఏమిటంటే వయసుతో భేదం లేకుండా అందరితో కలిసిమెలసి ఉండటం.

నా జీవితంలో వేటూరి వారితో కలిసి పని చేయటం నా అదృష్టం. మొట్టమొదటి సారిగా ఆయన్ని అన్నయ్యే పరిచయం చేశాడు. 'బాబాయి హోటల్' మేమిద్దరం కలిసి పనిచేసిన మొదటి చిత్రం. అందులో చిత్ర పాడిన లాలిపాట రాశారు. తరువాత పర్వతాలు-పానకాలు, ప్రేమా జిందాబాద్ చిత్రాలకి ఇద్దరం కలిసి పనిచేశాము. ప్రేమా జిందాబాద్‌లో బ్రహ్మానందం గారికి ఒక పాట రాశారు. ఆ పాట రికార్డింగ్ 7-1 కాల్ షీట్. (ఎస్.పి.శైలజ పెళ్ళికి 2, 3 రోజుల ముందు) గురువు గారు 8 నుండి 9 గంటల లోపు పూర్తి పాట ఇచ్చారు. (తననాలకి రాసింది)

ఎబిసి రాని ఏ బ్రాసిరో వాడు
ఓ అంటే ఢం రాని సన్నాసిరో
రూపంలో కోతి, రాగంలో కాకి,
పప్పు సుద్దోయమ్మా

ఇలా ఉంటుంది పల్లవి. నేను 'ఏంసార్? నా గురించే ఈ పాట రాశారా?' అంటే జంధ్యాల, వేటూరి గారు నవ్వేశారు, ముసిముసిగా. తరువాత గురువు గారు శ్రీ కృష్ణార్జున విజయం, పుట్టింటి గౌరవం, మేడమ్ ఇలా చాలా సినిమాలకి నాకు చాలామంచి పాటలు రాశారు. తరువాత ఆయన రచించగా వెలువడిన డివోషనల్ క్యాసెట్



(కోటి వేల్పుల అండ-కోటప్పకొండ) నాకు మంచి పేరు తెచ్చింది. అందులో ఒక గొప్ప పాట రాశారు. (పాడింది None other than బాలు గారు) 'అమ్మతోడు అందరివాడు, అమ్మతోడు ఎరుగని వాడు' (పల్లవి) వేటూరి గారికి చాలా ఇష్టమైన పాటల్లో ఇది ఒకటి కావటం నా అదృష్టం. కలియుగ దైవం వెంకటేశ్వర స్వామి సేవలు వర్ణిస్తూ రాబోయే ఒక టీవి సీరియల్‌కి ఆయన రచించగా నేను సంగీత దర్శకత్వం వహించాను. ఈ పాట కంపోజింగ్ మా ఇంట్లో జరిగింది. దానికి వేటూరి వారు, జానకి గారు, నేనూ కలిసి కూర్చొని కంపోజింగ్ చేయటం నేను జీవితంలో మరచిపోలేని సంఘటన. గురువు గారికీ, జానకి గారికీ ఇష్టమైన వంట చేసింది నా భార్య. ఆయన మంచి భోజన ప్రియుడు. మంచి పాటని ఎంత ఆస్వాదిస్తారో మంచి భోజనాన్ని కూడా అలాగే అనుభవించి తృప్తిగా తింటారు. (ఎస్.జానకి గారు కూడా అంతే).



ఒకసారి వేటూరిగారికి హైదరాబాద్‌లో ఘనమైన సన్మానం జరిగింది. శ్రీ ఎన్.టి.రామారావు గారు అధ్యక్షులు (అప్పటి చీఫ్ మినిస్టర్) రవీంద్రభారతిలో జరిగింది. చలనచిత్ర పరిశ్రమ అంతా ఆ సభకి తరలివచ్చింది. భద్రాచలంలో సీతారాముల కళ్యాణం చూసినంత తృప్తిగా ఆ సభ జరిగింది. (వేటూరి గారి సతీమణి పేరు సీతమ్మ గారు) జీవితంలో గుర్తు పెట్టుకొనే చాలా ముఖ్యమైన వేడుకల్లో అదొకటి. అటువంటి సభకు నేను హాజరవటం నా అదృష్టం. ఆ రోజు అందరూ ఎంత బాగా మాట్లాడారో మాటల్లో వర్ణించలేను. ముఖ్యంగా రామోజీరావు గారి ప్రసంగం హైలెట్.

గురువు గారికి మల్లాది రామకృష్ణశాస్త్రి గారన్నా, ఆత్రేయ గారన్నా, కణ్ణదాసన్‌గారన్నా, పింగళిగారన్నా ఎంతో అభిమానం, గౌరవం. అలాగే అందరు కవులకీ ఆయనకి సత్సంబంధాలున్నాయి. ఆయనకి, సీతమ్మ గారికీ ముగ్గురబ్బాయిలు. పెద్దబ్బాయి రవి వాళ్ళ నాన్న గారి బాటలో ప్రయాణిస్తూ ఉండటం ఎంతో ముదావహం. ఇప్పుడు వేటూరి గారిని చూస్తే నాకు ఒక మహా యోగిలా ఉన్నారు. జీవితంలో ఎన్నో అనుభవాలు పొందారాయన. ఎంతోమంది హీరోలకీ, సంగీత దర్శకులకీ, గాయకులకీ 'కళాభిక్ష' పెట్టారు. ఆయనంటే మా ఇంట్లో అందరికీ ప్రాణం. ఆయనకీ, నాకూ విశాఖపట్నంలో వాణీ ప్రభాకర్ గార్లు వాళ్ళ స్కూలు వార్షికోత్సవ సందర్భంలో ఎంతో ఘనంగా సన్మానించారు. మాటల్లో చెప్పలేని గొప్ప అనుభూతిని పొందాను. పైగా వేటూరి గారు మా కాలేజ్ (ఎస్.ఆర్.ఆర్.& సి.వి.ఆర్. ప్రభుత్వ కాలేజి, విజయవాడ) ఓల్డ్ స్టూడెంట్. ఆ సభకి అధ్యక్షత వహించింది శ్రీ పేరాల భరత శర్మ గారు (ఇటీవలే ఆయన మరణించారు.) ఆయన మాకు లెక్చరర్. ఎ.కె.ఖాన్ గారూ (ఎస్.పి) ప్రముఖ న్యాయవాది శ్రీ డి.వి.సుబ్బారావు గారూ పాల్గొన్నారు. అలాగే చిత్తూరులో జరిగిన ఒక సభకి (చిత్తూరు కల్చరల్ అకాడమీ, సెక్రటరీ శ్రీ రాజశేఖర్ నాయుడు ఏర్పాటు చేశారు.) వేటూరి గారు, రామానాయుడు గారూ, కె.విశ్వనాథ్ గారూ, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారూ, జయసుధ గారూ, అల్లురామలింగయ్య గారూ, నేను పాల్గొన్నాము. ఆయా శాఖల్లో గొప్ప పేరు సంపాదించిన ఆ మహానుభావులకి ఎంతో



ఘనంగా సన్మానం జరిగింది.

ఆ సభలో వేటూరి గారు చేసిన ప్రసంగం 'న భూతో న భవిష్యతి'. మంత్రివర్యులు బొజ్జల గోపాలకృష్ణారెడ్డి గారు అధ్యక్షులు. సుమారు 2 గంటల సేపు ఆయన మాట్లాడిన తీరు అందర్నీ కదిలించి వేసింది. చిత్తూరికి ఉన్న ప్రాముఖ్యత, అక్కడ జన్మించిన మహానుభావుల గురించి వేటూరి గారు ఎక్కడా తడుముకోకుండా అత్యద్భుతంగా మాట్లాడారు. గొప్ప సభ అది.

వేటూరి గారి 60వ జన్మదినోత్సవం నేను మరచిపోలేను. అప్పుడు విజయాగార్డెన్స్‌లో 'పుట్టింటి గౌరవం' రీ రికార్డింగ్ జరుగుతోంది. సుమారు 45 మంది ఆర్కెస్ట్రా మెంబర్స్ 'హ్యాపి బర్త్‌డే' వాయించిన తరువాత గురువుగారికి పుష్పమాల, ఫలాలు సమర్పించి అందరం ఆయనకి పాదాభివందనం చేసి ఆయన ఆశీర్వాదం పొందాము. నేనూ, సౌండ్ ఇంజనీర్ కొల్లి రామకృష్ణ (గురువు గారికి చాలా ముఖ్యమైన శిష్యుల్లో ఒకడు) గురువు గారూ కలిసి భోజనం చేశాము. ఆయన ఎంతో ఆనందించారు.

ఇటువంటి గొప్ప వ్యక్తి గురించి రాయటం నా అదృష్టం. ■

# వేటూరి అనువాద గీతాలు

## సఖి

సంగీతం : ఎ.ఆర్.రెహమాన్ గానం: సాధనా సర్గమ్

కో॥ నిన్న మునిమాపుల్లో ॥2॥ నిద్దరోవు నీవాళ్ళో
గాలల్లే తేలి పోతానో ఇలా డోల లూగేనో
ఆనందాలర్ధ రాత్రి అందాల గుర్తుల్లో
నిన్ను వలపించా మనం చెదిరి విలపించా...
కురుల నొక్కుల నలుపే చుక్కల్లో...॥2॥
గర్వం అణిచెనులే నా గర్వమణిగెనులే
ప॥ స్నేహితుడా స్నేహితుడా రహస్య స్నేహితుడా
చిన్న చిన్న నా కోరికలే అల్లుకున్న స్నేహితుడా
ఇదే సకలం సర్వం ఇదే వలపు గెలుపు
శ్వాస తుది వరకు వెలిగే వేదం
వాంఛలన్నీ వరమైన ప్రాణబంధం ॥ స్నేహి॥
చ॥ చిన్న చిన్న హద్దు మీర వచ్చునోయ్
ఈ జీవితాన పూలపుంత వెయ్యివోయ్
మనసే మృదువోయ్ పువ్వుకోసే భక్తుడల్లే మెత్తగా
నేను నిద్రపోతే లేత గోళ్ళు గిల్లేయ్ సందేల్లో తోడువోయ్
అయిదు వేళ్ళు తెరచి ఆవు వెన్న పూసి సేవలు శాయవలెరా
ఇద్దర మొకటై కన్నీరైతే తుడిచే వేలందం ॥స్నేహి॥ ॥నిన్న॥
చ॥ శాంతించాలి పగలింటి పనికే...ఏ.... ॥శాంతి॥
నీ సొంతానికి తెచ్చెనింక పడకే వాలేపొద్దు వలపే
పుల్లైన్ చొక్కా ఆరబోసే వయసే
నీతో చెమ్మచెక్కలైనా నాకు వరసే ఉప్పుమూటై అమ్మెయినా
ఉన్నట్టుండెత్తేస్తా ఎత్తేసి విసిరేస్తా కొంగుల్లో నిన్నే దాచేస్తా
వాలని పొద్దు విడుదల చేసి వరమొకటడిగేస్తా ॥స్నేహి॥

## దేవరాగం

సంగీతం : కీరవాణి గానం: చిత్ర, బాలు

ప॥ యా యా యా యా నెమలి కన్నుల కలయా
యా యా యా యా మురళి మోహన కళయా
చిలిపిగా ఓలమ్మో ఏదో తాళం
కడవలో పాలన్నీ తోడే రాగం కన్నా..... కన్నా.....
జతై కలిసినలయా కౌగిళ్ళ నిలయా కవ్వించుకోవయ్యా ॥యా॥
ఆ: నీ లీలలే నా డోలలై వేడి ఊల వేసే వేణుగానమల్లే
వాలు సందేవేళ చందనాలు జల్లే
మోమాటమే పై పెదవిలో తేనెటీగలొచ్చి కుట్టినట్టు గిల్లే
లేత చెక్కిలింక ఎర్రముగ్గు జల్లే
గోపిక మునుపాడే గోవులకన్నుల్లో
వెన్నెల తెరవేసే కొమ్మల నీడల్లో
విరిసిన పూలే జల్లి దీవుల్లోన తడిపాడి తానాలాడించే
ప్రియా చిలికినదయా చిలిపిరోదయా కౌగిళ్ళ నిలయా॥యా॥
అ: ఈ నాటిదా ఈ సంగమం
చూసి చూడలేని చూపులమ్మ చుంబనం
కంటిరెప్ప చాటు లేపేరమ్మ శోభనం
ఆ: నీ మాటలే సై ఆటలై కొల్లగొట్ట నేల కోకమాటు వగలే
కన్ను కొట్టనేల కాముడల్లే పగలే
అ: యదుకుల గోపెమ్మ ఆ: ఆ....
అ: ముసి ముసి మురిపాలు ఆ: ఆ....
అ: యమునల వరదమ్మ ఆ: ఆ......
అ: అడిగెను రాధమ్మ ఆ: ఆ.....
ఆ: అతి సుఖ రాగాలెన్నో ఆలాపించే
సాయంత్రాల నీడల్లో జతై కలిసి అలయా కౌగిళ్ల నిలయా
కవ్వించుకోవయ్యా ॥యా॥

## రిథమ్

సంగీతం : ఎ.ఆర్.రెహమాన్ గానం: ఉన్నికృష్ణన్, కవితా సుబ్రహ్మణ్యం

అ: గాలే నావాకిటికొచ్చె
మెల్లంగా తలుపే తెరచే
ఐతే మరి పేరేదన్నా "లవ్వే" అవునా
నీవూ నిన్నెక్కడ వున్నావ్ గాలీ అది చెప్పాలంటే
శ్వాసవు నువ్ నాలో వున్నావు అమ్మా అవునా!
తుళ్ళి పడుగాలి కళ్ళపడదాయె ఎంకి పాట పాడూ
ఇల వున్న వరకూ నెలవంక వరకూ గుండెలోకి వీచూ
ఆ: గాలే........వీచూ
అ: ఆషాడ మాసం వచ్చి వానొస్తే నీవే దిక్కు
నీ వోణీ గొడుగే పడతావా
ఆ: అమ్మో నాకొకటే మైకం అనువైన చెలిమే స్వర్గం
కన్నుల్లో క్షణమే నిలిపేనా
అ: నీ చిరు సిగ్గుల వడి తెలిసె నేనప్పుడు మదిలో పొదిగితే
నీ నెమ్మదిలో నావునికే కనిపెడతానా
ఆ: పువ్వులలోనా తేనున్న వరకూ కదలను వదిలి
అ: భూమికి పైనా మనిషున్న వరకూ కరగదు వలపు॥గాలే॥
ఆ: చిరకాలం చిప్పల్లోనా వన్నెలు చిలికే ముత్యం వలెపే
నా వయసే తొణికిసలాడినదే
అ: తెరచాటు నీ పరువాల తెర తీసే శోధనలో
ఎదనిండా మదనం జరిగినదే
ఆ: నే నరవిచ్చిన పువ్వయితే నులి వెచ్చని తావైనావు
ఈ పడుచమ్మను పసిమొగ్గను చేస్తావా
అ: కిర్రు మంచమడిచే కుర్ర దుయ్యలంటే సరియా సఖియా
ఆ: చిన్న పిల్లలై మనం కుర్ర ఆటలాడితే వయసా వరసా ॥గాలే॥

## మెరుపు కలలు

సంగీతం : ఎ.ఆర్.రెహమాన్ గానం: హరిహరన్, సాధనా సరగమ్

అ: వెన్నెలవే వెన్నెలవే మిన్నే దాటి వస్తావా
విరహాన జోడీ నీవే
నీకు భూలోకులా కన్ను సోకే ముందే
పొద్దే తెల్లారే లోగా పంపిస్తా ॥వెన్నెల॥
అ: ఇది సరసాల తొలి పరువాలా జత సాయంత్రం
సై అన్న మందారం (2)
చెలి అందాల చెలి ముద్దాడే
చిరు మొగ్గల్లో సిగ్గేసే పున్నాగం
పిల్లా...పిల్లా...భూలోకం దాదాపు కన్ను మూయువేళ
పాడేను కుసుమాలు పచ్చ గడ్డి మీన
ఏ పూవుల్లో తడి అందాలో అందెలే ఈ వేళ ॥వెన్నెల॥
ఆ: ఎత్తైన గగనంలో నిలిపే వారెవరంట
కౌగిట్లో చిక్కుపడే గాలికి అడ్డెవరంట
అ: ఇది గిల్లి గిల్లీ వసంతమే ఆడించే
హృదయంలో వెన్నెలలే రగిలించే వారెవరూ
ఆ: పిల్లా...పిల్లా...పూదోట నిదరోమని పూలే వరించు వేళ
పూతీగ కలలోపల తేనే గ్రహించువేళ
అ: ఆ వయసే రసాల విందయితే ప్రేమల్లే ప్రేమించు
ఆ.......ఆ....... ॥వెన్నెల॥






జనవరి 29 వేటూరి
జన్మదినం సందర్భంగా
సంగీత
సాహిత్యాభిమానుల
తరపున
అభినందనలతో ...

హాసం



